# తెలుగు తమిళ కవిత్వాలు
# జాతీయవాదం

డాక్టర్ చల్లా రాధాకృష్ణ శర్మ

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001.

TELUGU TAMILA KAVITWALU : JATEEYAVADAM
by **Dr. Challa Radhakrishna Sarma** M.A;M. Litt, Ph.D.,
Rtd. Professor of Telugu, Madurai Kamaraj University,
5/519, Thiruvalluar St, Sadasiva Nagar, Madurai 625 020.
Published by YUVABHARATHI, Literary and Cultural
Organisation, Tilak Road, Hyderabad - 500 001.



యువభారతి 30వ వార్షికోత్సవ ప్రచురణ

ప్రచురణ : 150

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి 1994

ప్రతులు : 1000

ముఖచిత్రాలంకరణ : **శ్రీ శీలా వీర్రాజు**

**వెల : రూ. 25-00**

ప్రతులకు :
**యువభారతి కార్యాలయం**
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు,
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001.

ముద్రణ :
**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,**
1-1-517/1/B, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాద్ - 380.
ఫోన్లు : 611413, 600457.

ముఖచిత్ర ముద్రణ :
విష్లా ప్రింటర్స్ ప్రైవేట్ లిమిటెడ్,
హైదరాబాద్ - 44.

# యువభారతి
## జాతీయవాద కరదీపిక

సమాజ శ్రేయస్సుకు సమున్నత ప్రమాణాలు గల సాహిత్యం, ఉత్తమ మూల్యాలను పెంచి పోషించగల సహృదయ లోకం అవసరమని గుర్తించి, ఆ రెండింటినీ బలంగా పెంపొందించే సాహిత్య సాంస్కృతిక సామాజిక చైతన్యాన్ని కలిగించటానికి యువభారతి ఉద్యమిస్తున్నది.

సాహిత్యం ఎటువంటి సాహిత్యేతర శక్తుల ఆజమాయిషీకి లోనుగాకుండా, స్వతంత్ర వ్యక్తిత్వంతో సాత్త్విక శక్తిగా రూపొందాలనీ, అటువంటి సాహిత్యాన్ని సృష్టించే రచయితలు ఏ కాలంవారైనా, వారి కృషినీ, సందేశాన్నీ సామాన్య ప్రజానీకానికి అందేటట్లు వివిధ ప్రక్రియల ద్వారా యువభారతి యత్నిస్తోంది. అంటే - రాజకీయ కాలుష్యం లేని సాహిత్యోద్యమాన్ని యువభారతి అవిశ్రాంతంగా సాగిస్తోంది.

'చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది' - అనే లక్ష్యంతో సమాజంలో వ్యష్టిగా, సమష్టిగా, శాంతియుత సహజీవనాన్నీ, ప్రజాస్వామ్య విధానాన్నీ, నిర్మాణాత్మక కార్యశీలాన్నీ, మానవత్వపు విలువలతో కూడిన సేవాభావాన్నీ ఆచరించి చూపిస్తోంది యువభారతి.

యువభారతి 1963 సం॥లో విజయదశమినాడు పుట్టింది. ఈ యేడు 30వ వార్షికోత్సవాలు చేసుకొంటోంది. వార్షికోత్సవాలలో ప్రధానాంశంగా 'వివేకానందలహరి' ఉపన్యాస వ్యాస మంజరిని రూపొందిస్తోంది. రజతోత్సవాలలో భాగంగా నిర్వహించిన సదస్సులలోని సాహితీ పత్రాలను ప్రచురణలుగా వెలువరిస్తోంది. కొత్త గొంతుకలు, సరికొత్త విలువలు; మానవతా మూల్యాలు, విద్యా వైద్య శాస్త్ర కళారంగాలు; సమకాలీన సాహిత్యం - స్త్రీవాద ధోరణులు; సాహితీ సమాలోచనం 1992 & 1993; ఆధునిక సాహిత్యం: దళిత స్పృహ

మొదలైన ప్రచురణలను ప్రకటిస్తోంది. ఆ సందర్భంలోనే యువభారతి హితులు, సాహితీవేత్తలు, ప్రముఖ రచయితలు అయిన డాక్టర్ చల్లా రాధాకృష్ణశర్మ గారు రచించిన 'తెలుగు తమిళ కవితలు - జాతీయవాదం' అనే ఈ విలువైన రచనను వెలువరించడానికి సంతోషిస్తున్నాం.

సమకాలీన యువతరానికి జాతీయ భావాన్ని గురించి సదవగాహన కలిగించవలసిన అవసరం ఇప్పుడెంతైనా ఉంది. తెలుగు, తమిళ కవితల్లో భారతీయభావం ఎలా తరతరాలనుంచి పెంచిపోషింపబడుతున్నదో తులనాత్మక దృక్పథంతో వివరించి చెప్పితే భావసమైక్యతతో పాటు, భాషా సంస్కృతుల సదవగాహన గూడా పెంపొందుతుంది. అది ఈనాడు అత్యావసరమైన సామాజిక సాహిత్యాంశం. ఆ అవసరాన్ని గుర్తించి డాక్టర్ చల్లా రాధాకృష్ణశర్మ గారు రచించిన ఈ గ్రంథం సకాలంలో సత్ప్రయోజనం కోసం యువ సాహితీ జగత్తుకు అందిస్తున్న అక్షరోపాయనంగా యువభారతి భావిస్తున్నది. ఈ గ్రంథ ప్రచురణకు అనుమతించిన డాక్టర్ రాధాకృష్ణశర్మగారికి యువభారతి కృతజ్ఞతాభివందనా లర్పిస్తున్నది ఇది మా 150 వ ప్రచురణ కావటం కూడా మా అదృష్టం!

భారతీయ భాషా సాహిత్యాల తులనాత్మక అధ్యయనం ద్వారా భారతీయాత్మను దర్శించే సాహిత్య ప్రస్థానం యువభారతి ఉద్యమంలో భాగం. వివిధ భాషలలో ప్రఖ్యాతిగాంచిన కవుల కవితా వైభవాలను తెలుగులో సరళవ్యాఖ్యానాలతో వెలువరించటం యువభారతి ఎప్పుడో మొదలు పెట్టింది. ప్రసిద్ధ హిందీ కవులు సూరదాస్, తులసీదాసుల కవితా వైభవాలను ప్రచురించింది. దాక్షిణాత్య భాషా కవులలో సుబ్రహ్మణ్య భారతి కవితలను డాక్టర్ చల్లా రాధాకృష్ణశర్మ గారి 'తమిళ సాహిత్యం - భారతి కవిత' అనే గ్రంథం ద్వారా పరిచయం చేసింది. ఇంకా మరికొందరు భారతీయ భాషా కవుల పరిచయాలు వెలువడుతున్నాయి. ఈ శాఖలో యువభారతి చేస్తున్న కృషికి ఎంతో ప్రోత్సాహాన్ని అందిస్తున్న డాక్టర్ చల్లా రాధాకృష్ణశర్మగారి సహృదయతకు మేమెల్లప్పుడు కృతజ్ఞులమై ఉంటాం!

తెలుగు తమిళ సాహిత్యావగాహనలో పూలవంతెనలా, సాంస్కృతిక రాయబారిగా కృషిచేస్తున్న సహృదయ సాహితీవేత్త డాక్టర్ చల్లా రాధాకృష్ణ

శర్మగారు. తమిళ సాహిత్య చరిత్ర, తరతరాల తమిళ కవిత, ఆధునిక తమిళ సాహిత్య నిర్మాతలు, సుబ్రహ్మణ్య భారతి, తమిళవిందు, తమిళ పంచకావ్య కథలు మొదలైన రచనలు తెలుగువారికి తమిళ సాహిత్య విశేషాలను సవిమర్శకంగా పరిచయం చేస్తున్నాయి. తెలుగును గురించి అయిరంతలైనాగం, తెలుంగు అలక్కియప్పలకణి మొదలైన గ్రంథాలద్వారా తమిళులను తెలియ జెప్పటంలోనూ, Landmarks in Telugu Literature మొదలైన అయిదారు గ్రంథాల ద్వారా ఇంగ్లీషు తెలిసినవారికి ఎరుక చెప్పటంలోనూ, డాక్టర్ శర్మగారు ఆదాన ప్రదాన కార్యక్రమాన్ని ఆత్మీయంగా నిర్వహిస్తున్నారు. ఇవన్నీ ఒక యెత్తు; వారు తెలుగు సాహిత్యానికి కవిగా, వ్యాసకర్తగా, తులనాత్మకాధ్యయన పరిశోధకుడుగా, కథానిక, నాటిక, నవల, జీవితచరిత్ర మొదలైన ప్రక్రియలను నిర్వహించే రచయితగా చేస్తున్న కృషి మరొకయెత్తు. చాలాకాలంనుంచి ప్రవాసాంధ్రునిగా ఉంటున్నా తెలుగునాట వెల్లువుకుతున్న సాహితీ చైతన్యాన్ని సన్నిహితంగా గమనిస్తూ, ఆంధ్రప్రదేశ్‌లోని ఉత్తమ రచయితలలో ఒకరుగా పరిగణింపబడుతున్న డాక్టర్ చల్లా రాధాకృష్ణ శర్మగారు ఈ గ్రంథాన్ని రచించటం ఒక ఉత్తమ కార్యం. యువభారతికి దానిని ప్రచురించే అవకాశం దొరకడం అదృష్టం! ఆధునిక జాతీయవాద సాహిత్య చైతన్య స్పందనను సవ్యంగా అర్థంచేసుకొని సందర్శించటానికి ఈ గ్రంథం ఒక కరదీపిక!

యువభారతి 30 వ వార్షికోత్సవ సందర్భంగా ఈ గ్రంథాన్ని జ్ఞానపీఠ పురస్కార గ్రహీత ఆచార్య సి. నారాయణరెడ్డిగారు ఆవిష్కరించారు ప్రసిద్ధ కవి డాక్టర్ జె. బాపురెడ్డిగారు అధ్యక్షత వహించారు. వారిరువురికి కృతజ్ఞతలు. ముఖచిత్రాన్ని అలంకరించిన మిత్రులు శ్రీ శీలా వీరరాజుగారికి, ఈ గ్రంథాన్ని సకాలంలో ముద్రించి యిచ్చిన పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్‌వారికీ, ముఖచిత్రాన్ని ముద్రించిన పిప్లా ప్రింటర్స్ ప్రైవేట్ లిమిటెడ్ వారికి కృతజ్ఞతలు. సహృదయులు ఈ ప్రచురణను ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

హైదరాబాద్
6-2-1994

జి.వి. సుబ్రహ్మణ్యం
అధ్యక్షుడు

సమరాన్ని ఉద్దీపింపజేసిన కవితలు చాలా తెలుగు భాషలో సంతరించబడ్డాయి. అవి తమిళదేశపు కారాగృహాలలోనూ మారుమోగాయి.'

విలువలు మారుతున్న యీ నాళ్ళలో ఆనాటి జాతీయోద్యమ కవుల రచనలు ఎన్నో మరుగున పడడం సహజం. కాని దేశభక్తి, సమైక్య దృక్పథం, జాతీయ భావం వంటి ప్రశస్త భావాలు సార్వకాలికాలు. అందులోను వసుధైవ కుటుంబం వంటి విశిష్టభావం ప్రచారంలోకి వస్తున్న తరుణంలో జాతీయ భావం మరింత శక్తిమంతంగా కనిపించడంలో వింతలేదు. అందువల్ల జాతీయ కవుల రచనలు మళ్ళీ ప్రచారం అందుకోగలవని ఆశించవచ్చు.

ఈ రచనను తమ ప్రచురణగా ప్రకటిస్తున్న యువభారతికి - ముఖ్యంగా ఆ సాహితీ సాంస్కృతిక సంస్థ అధ్యక్షులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారి సహృదయతకు - కృతజ్ఞుణ్ణి.

ఈ నా కృషి సోదరాంధ్రుల్ని అలరించగలదని నా నమ్మకం.

—చల్లా రాధాకృష్ణశర్మ

# విషయసూచిక

# అధ్యాయం - 1

# జాతీయభావం–స్వరూప స్వభావాలు

ఆర్థిక సాంఘికాది భేదాలు ఎన్నో ఉన్నా, తాము ఒకే జాతికి చెందినవారమన్న భావం భారతీయులలో ప్రముఖంగా కానవస్తుంది. ఈ జాతీయభావమే దేశ సమైక్యానికి పునాది వేసింది. ఈ విశిష్టభావానికి మన జాతీయ కవులు బ్రహ్మరథం పట్టారు. తమిళ నవయుగ ప్రవక్త సుబ్రహ్మణ్య భారతి (1882-1921) మనస్సుకి హత్తుకునేలా ఇలా పేర్కొన్నారు:

ఎన్నో జాతులు మనలో ఉండేను
ఏమది న్యాయం ఇతరుల జోక్యం?
ఒక తల్లి పిల్లలు కలహించుకున్నా
అన్నదమ్ములే వారెన్నటికీ[1].

ఆయనే మరొకచోట తన భావాన్ని ఇలా విశదీకరించారు: 'క్రైస్తవులైనా పార్శీలయినా మహమ్మదీయులైనా, ఎక్కడినుంచి వచ్చి యే దైవాన్ని పూజించినా, భారతదేశంలో పుట్టి పెరిగి ఈ దేశాన్నే నమ్ముకున్న వారినందరినీ భారతీయులుగానే పరిగణించాలి. ఇది ఏక జాతి; విభజించరానిది; నాశనం లేనిది.'[2]

ప్రముఖ జాతీయకవి గరిమెళ్ళ సత్యనారాయణ (1893-1952) తన రచనలలో పెక్కుచోట్ల ఈ భావాన్ని స్పష్టంచేసిన వైనం చిరస్మరణీయం.

ఎవరెన్ని చెప్పిన హిందూదేశ వాసు
లేక సోదరులె సుండీ
అంటూ దోషము మాకు లేదండీ
పాపమంటూ చాటుదాము రండీ[3]
అన్నదమ్ముల్లోన భేద - మాడు పెట్టాడండి బాబు
ఉన్నదల్లా ఊడదన్ని - ఊరుతున్నాడండి బాబు[4]

భారతదేశవాసులు అన్నదమ్ములని ఈ జాతీయ కవులిద్దరూ భావించడం గమనించదగిన అంశం.

భిన్న మతాలకు, విభిన్న సంస్కృతులకు, వివిధ భాషలకు నిలయం భారతదేశం. ఈ విషయం సర్వవిదితం. ఈ వైవిధ్యంలో ఏకత్వాన్ని దర్శించడం నేర్చుకున్న నిపుణమతులు భారతీయులు. కొన్ని సందర్భాలలో మత పరమైన కలహాలు ఏర్పడవచ్చు; భాషా సంబంధమైన కలహాలు తొంగి చూడవచ్చు; మరో కారణంగా అభిప్రాయ భేదాలు కలగవచ్చు. అయినా తాము ఒకే జాతికి చెందిన వారమన్న భావానికి మాత్రం భంగం ఏర్పడకపోవడం విశిష్టతలలోకెల్ల విశిష్టత! ఇక్కడ జాతి శబ్దం ఒక ప్రత్యేకార్థంలో ప్రయుక్తం. ఒకే రాజకీయ వ్యవస్థలో నివసించే ప్రజా సమూహం అనే విశాలార్థంలో జాతి శబ్దం వాడబడుతున్నది. అలాంటి భావం జాతీయత అనే పేరున వ్యవహృతం. నిజానికి భారత ఉపఖండంలో సుమారు మూడువేల జాతులున్నట్లుగా భావించబడుతున్నది;[5] అప్పుడప్పుడు అక్కడక్కడ జాతి వైషమ్యాలు చెలరేగినప్పటికీ మళ్ళీ అందరినీ ఈ జాతీయ భావం సమైక్య పరచడం ఒక అద్భుతమనవచ్చు. 1962 లో చైనా దురాక్రమణ సందర్భంగా విభిన్న భాషల వారూ వివిధ మతాల వారూ తమ తమ ఆంతరంగిక విభేదాలు విస్మరించి ఒక్క జాతిగా సంచరించడం మరచిపోలేని విషయం. అందుకు కారణం మనలో జీర్ణించుకుపోయిన జాతీయ భావమే!

ఒక దేశంలో నివసిస్తూ, ఒకే తెగకు చెంది, ఒకే భాష, సంస్కృతి, ఆచార వ్యవహారాలు కలిగి, ఒకే రాజకీయ వ్యవస్థకు కట్టుపడి నివసించే జనులకు జాతి అని పేరు. సర్వసాధారణంగా జాతి శబ్దానికి నిఘంటువులలో కనిపించే అర్థమిది. ఈ దృష్టితో పరికిస్తే, మన దేశంలో ఎన్నో జాతులున్నట్లు చెప్పవలసి వుంటుంది. జాతులెన్నో ఉన్నా, అన్ని జాతులవారూ ఒకే రాజకీయ వ్యవస్థకు కట్టువడిన వారే. కనుకనే భారతజాతి అని వ్యవహరిస్తున్నాము. అలాగే విభిన్న భాషలు ప్రచారంలో ఉన్నప్పటికీ ఆ భాషలలోని సాహిత్య సంపదను భారతీయ సాహిత్యం అనే సమష్టి నామంతోనే వ్యవహరిస్తున్నాము. ఒక్కమాటలో చెప్పాలంటే - భారత జాతి ఎలా అవిభాజ్యమో, అలాగే భారతీయ సాహిత్యం కూడా. అది బహుముఖమూ సువిశాలమూ అయినది. ఒకే రాజకీయ వ్యవస్థ లేని ప్రాచీన భారతంలో కూడా మన దేశం భారతదేశమనీ, మనం భారతీయులమనీ వ్యవహరించబడడం గమనించదగిన విషయం.

ఈ సందర్భంగా సుబ్రహ్మణ్య భారతి చెప్పిన యీ కింది మాటలు పరిశీలనార్హాలు:

"మన వేదం. మన శాస్త్రాలు, మన తీరుతెన్నులు, మన భాషలు, మన కవిత్వం, మన శిల్పం, మన సంగీతం, మన నాట్యం, మన వృత్తి విధానాలు, మన గోపురాలు, మన మండపాలు, మన ప్రజలు - వీటన్నిటికీ సమష్టి నామం మన ఆర్య సంపద.

"కాళిదాసు వెలయించిన శాకుంతలం, హిందీలో తులసీదాసు రచించిన రామాయణం, కంబ రామాయణం, సిలప్పదికారం, తిరుక్కుఱళ్, ఆండాళ్ (గోదాదేవి) ప్రసాదించిన పాశురం - వీటన్నిటికీ సమష్టి నామం ఆర్యసంపద.

"తంజావూరు ఆలయం, (మధురలో) తిరుమలనాయకుని మహలు, త్యాగయ్య కృతులు, ఎల్లోరాలోని గుహాలయం, ఆగ్రాలోని తాజ్‌మహలు, శరభ శాస్త్రి వేణు వాద్యం (పిల్లనగ్రోవి) - వీటన్నిటికీ సమష్టి నామం ఆర్య సంపద."[6]

హిందూదేశవాసు లన్నప్పుడు గరిమెళ్ళ దృష్టిలో విశాల భారతదేశం మెదిలినట్లుగానే, భారతి దృక్పథంలో ఆర్యసంపద అంటే జాతీయ సంపద అని అర్థం. కాళిదాసు శాకుంతలాన్నీ, కంబ రామాయణాన్నీ, త్యాగయ్య కృతుల్నీ, ఆగ్రాలోని తాజ్‌మహలునీ భారతీయుల ఆస్తిగానే భారతి సంభావించారు. ఏ భాషలో ఆణిముత్యం వంటి ఏ రచన వెలసినా, ఎక్కడ ఏ విశిష్ట కళా ఖండం కానవచ్చినా— అదంతా భారతీయుల ఉమ్మడి సంపదే.

మనమందరం ఒక్కటే అని భావించే మానసిక స్థితిని జాతీయత అని నిర్వచించవచ్చు. మనమందరం అన్నప్పుడు వివిధ రాష్ట్రాలలో వివిధ భాషలు వ్యవహరిస్తూ నివసించే ప్రజలందరు అని అర్థం చెప్పుకోవాలి. పరిపాలనా సౌలభ్యంకోసం వెలసిన రాష్ట్రాలు విభిన్నములైనా, అవన్నీ ఒకే దేశంలోని అంతర్భాగాలు. అనగా రాష్ట్రాలు విడివిడిగా ఉన్నంత మాత్రాన, అవి ఒకే దేశంలోని భాగాలు కావనుకోవడం అసమంజసం.

ఇక సుప్రసిద్ధ నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వాలు జాతీయతను ఎలా నిర్వచించినవో పరిశీలిద్దాము.

'స్వదేశం లేక స్వజాతిపట్లగల అభిమానం జాతీయ భావం.'[7]

'ఒకజాతి సంక్షేమంపట్లగల అభిమానం.'[8]

'జాతీయత అంటే స్వాతంత్ర్య వాంఛ.'[9]

'తమలో తమకు ఆర్థికముగను, సాంఘికముగను భేదము లెన్నియున్నను రాజకీయముగ తామందరు ఒకరే అనియు, ఇతరులు వేరనియు భావించు మానవుల సముదాయమునకు జాతి (group) అనియు, అట్టి భావమునకు జాతీయత అనియు పేర్లు.'[10]

'అంతర్జాతీయ సూత్రాలకంటె, వైయక్తిక లాభంకంటె స్వదేశ విధేయతను మిన్నగా భావించే ఒక భావం. అది ఒక నవ్య భావం....అది పెక్కు రూపాలు ధరించవచ్చు. ఒక్కొక్కసారి రాజకీయ భాగంగా పరిగణించబడే రాష్ట్రాలకు సంబంధించినదై ఉండవచ్చు....'[11]

'జాతిపట్లగల శ్రద్ధాసక్తులు, జాతీయ సమైక్యం లేక స్వాతంత్ర్యాన్ని ఉద్బోధించడం జాతీయత.'[12]

'ఒకే సంస్కృతికి చెంది, ఒక ప్రదేశంలో సన్నిహితంగా జీవిస్తూ, ఒక మనుగడ గలిగి సంచరించే జనుల మానసిక స్థితి. అది స్విస్ జాతీయుల ఆరోగ్యకరమైన దేశభక్తి మొదలుకొని జర్మనీ నాజీల దురభిమాన పూర్వకమైన అసహనం దాకా వర్తిస్తుంది.... జాతీయత నవ్య భావం. కాని, దాని బీజాలు ఆదిమ మానవుడు కొన్ని తెగలుగా సంఘాన్ని విభజించుకున్నప్పటి నుంచి ఉన్నాయి.'[13]

విశ్వకవి రవీంద్రులు 1916 లో జపానులో జాతీయతను గురించి ఉపన్యాసాలు చేశారు. రోమారోలా (Romain Rolland) వంటి సుప్రసిద్ధ ఫ్రెంచి రచయితను అవి బహుధా ఆకర్షించాయని కృష్ణ కృపలానీ (1907-92) తమ రచనలో పేర్కొన్నారు.[14] కాని, ఆ ఉపన్యాసాలు అమెరికను పత్రికల ఆగ్రహానికి పాలయ్యాయి. టాగూరు జాతీయతను హానికరమైన సిద్ధాంతంగా (cult of evil) భావించడం ఆ పత్రికలకు నచ్చలేదు. జాతీయత అన్న పేరుతో అతి విధేయత, ద్వేషభావం మొదలైనవి తలెత్తుకు తిరగడం ఆయనకి నచ్చలేదు. అందువల్ల టాగూరు జాతీయతను నిరసించారు. ధర్మాన్ని ఆయన అధికాధికంగా గౌరవించారు. ఈ విషయం టాగూరు, గాంధీజీల మధ్య ఒక చర్చ

నీయాంశంగా పరిణమించడం దురదృష్టం. 'ఆచరణలో నా జాతీయభావం అంతర్జాతీయ భావం'అని గాంధీజీ పేర్కొన్నారు.[15] సంకుచితమైన జాతీయతను ఆయన నిరసించారు. ఏది ఎలా ఉన్నా, టాగూరు తమ గ్రంథంలో వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయాలను తెలుసుకోవడం వాంఛనీయం.[16]

'భారతదేశంలో మన అసలు సమస్య రాజకీయం కాదు; అది సాంఘికం.'

'చరిత్ర ఒక్కటే; అది మానవ చరిత్ర. వివిధ జాతుల చరిత్రలు ఆ మహాచరిత్రలోని అధ్యాయాలు మాత్రమే.'

'ఇండియాకి ఎన్నడూ జాతీయ భావం లేదు.'

'జాతీయత ఇండియాకి ఒక బెదిరింపుగా ఉన్నది. ఇండియా పడుతున్న యిబ్బందులకు సంవత్సరాల తరబడిగా అది కారణభూతమై ఉన్నది.'

'ఇండియా సువిశాల దేశం. ఇండియాలో ఎన్నో జాతులున్నాయి. ఒక భౌగోళిక ఆవరణలో దేశాలెన్నో ఇమిడి వున్నాయి. ఒక దేశం పెక్కు దేశాలుగా కానవచ్చే ఐరోపాకి అది భిన్నమయింది.'

'జాతుల సమస్య వంటి గొప్ప చిక్కు మనకున్నా, ఇండియా కొంత వరకైనా ఏదో సాధించగలిగింది. వివిధ జాతులతో సర్దుబాటు చేసుకునేందుకు ప్రయత్నించింది. వాటి మధ్య గల భేదాలను గుర్తించింది. అయినప్పటికీ ఏకత్వపు పునాది కోసం అన్వేషించింది. ఈ పునాది నానక్, కబీరు, చైతన్యుడు ప్రభృతి మహా భక్తుల వద్ద నుంచి సంక్రమించింది. వివిధ జాతులకు వారు ఏకేశ్వర బోధ కావించారు.'

శ్రీ అరవిందులు కూడా జాతీయత గురించి తమ రచనలలో విపులంగా చర్చించారు. ఆయన అభిప్రాయాలు కూడా తెలుసుకోవడం సముచితం.[17]

'జాతిలో గల దివ్య సమైక్యాన్ని గ్రహించాలనే ప్రగాఢమైన అభిలాషే జాతీయత. విభిన్నంగా అసమానంగా పైకి కనిపించే సాంఘిక ఆర్థిక కారణాలు వస్తుతః ఒక్కటే. అవన్నీ ఆ సమైక్యతకు సంబంధించినవే. భారతదేశం ప్రపంచానికి ప్రదర్శించే జాతీయతా లక్ష్యం మనిషికీ మనిషికీ మధ్య, కులానికీ కులానికీ మధ్య సమానత్వం కలదనీ, తిలక్ చెప్పినట్లుగా అది విభిన్నం కాదనీ, విరాట్ స్వరూపంలోని సంఘటిత సమాన భాగాలనీ వ్యక్తం చెయ్యడమే. జాతికి

కావలసిన యితర అవసరాలను పరిహరించి జాతీయవాది రాజకీయ స్వాతంత్ర్యం వైపే మొగ్గు చూపుతున్నాడు.

'జాతీయత ఒక అవతారం. దాన్ని హతమార్చలేరు. ఈశ్వరునిచే నియమించబడిన దివ్య శక్తియే జాతీయత. ఏ మహత్తరమైన శక్తి నుంచి ఉద్భవించి మరల ఆ శక్తినే చేరుకుంటుందో, అంతవరకు అది భగవన్నిర్ణయమైన కార్యం నిర్వర్తించాలి'.

ఆధ్యాత్మిక దృష్టితో శ్రీ అరవిందులు జాతీయతను వివరించగా, ప్రముఖ జాతీయవాది జవహర్లాల్ నెహ్రూ జాతీయతలోని మంచి సెబ్బరలను మొగమోటమి లేకుండా వ్యక్తం చేశారు. తమ వివిధ రచనలలో జాతీయతను గురించి ఆయన తమ అభిప్రాయాలు తెలియజేశారు.[18]

'సముచిత స్థానంలో ఉన్న జాతీయత ఉత్తమమయింది; కాని అది విశ్వసనీయుడైన మిత్రుడూ జాగరూకతగల చెరిత్రకారుడూ కాదు; చాలా సంఘటనల్ని కప్పివేస్తుంది. కొన్ని సందర్భాలలో, ముఖ్యంగా, మనకో మన దేశానికో సంబంధించిన సత్యాన్ని తారుమారు చేస్తుంది.

'జాతీయత పారిశ్రామికీకరణం ప్రపంచగతిని మార్చివేశాయి. వట్టి పెంకులు మాత్రం మిగిలాయి. అసలు అర్థం అదృశ్యమయింది.

'జాతీయత వికసించే కొద్దీ "నా దేశం, తప్పో ఒప్పో" అనే భావన బలం పుంజుకుంటుంది. వ్యక్తులకు సంబంధించినంతవరకు దుష్టములూ నీతిబాహ్యములూ అయిన కృత్యాలు చెయ్యడం జాతులు గర్వకారణంగా భావించాయి.

'జాతీయత ప్రధానంగా వ్యతిరేక భావం. ఇతర జాతీయ బృందాలు, ముఖ్యంగా పాలితదేశాల విదేశ పరిపాలకులమీది క్రోధ ద్వేషాలను ఆహారంగా చేసుకుని అది ఒళ్ళు పెంచుకుంటుంది.

'మనలో చాలా మంది మనకు గల జాతీయ పక్షపాత బుద్ధినుంచి బయటపడలేకపోతున్నాము; మన కళ్ళల్లో ఉన్న మసకను తృణీకరించలేకపోతున్నాము.

'విదేశీయుల ఆధిపత్యానికి లోనై స్వాతంత్ర్యం అభిలషించే ప్రాచ్య దేశాలలో నేడు జాతీయత చోదక శక్తిగా ఉన్నది.

'నా సమకాలీన భారత దేశానికి జాతీయత తప్పనిసరి. నేడు కూడా అది తప్పనిసరే. సహజమూ ఆరోగ్యవంతమూ అయిన అభివృద్ధి అది.

'గత సాధనలు, సంప్రదాయాలు, అనుభవాలు మొదలైనవాటి సమష్టి స్మృతియే జాతీయత. ముందెన్నటికంటె నేడు అది దృఢంగా ఉన్నది.

'జాతీయత ఒక గొప్ప జీవశక్తి. మన ప్రజల ప్రతిభలోని యే అంగాన్ని గాని, వారి ప్రాథమిక సంప్రదాయాలను గాని విసర్జించినట్లయితే, అందువల్ల మనం చాలా కోల్పోయిన వారమవుతాము; మూలాన్ని ఛేదించిన వారమవుతాము.

'జాతీయత ఒక విచిత్ర లక్షణం. ఒక దేశపు చరిత్రలో అది జీవ శక్తినీ ఐకమత్యాన్నీ ప్రసాదిస్తుంది. కాని, అదే సమయంలో అది వ్యక్తిని పరిమితం చేస్తుంది. ఎందుకంటే, తన దేశాన్ని ప్రపంచానికి భిన్నమైనదిగా అతడు భావిస్తాడు.

'స్వదేశ స్వాతంత్ర్యానికి పాటుపడేందుకు జాతీయత ఆరోగ్యవంతమైన ఒక శక్తిగా పని చేసినా, స్వాతంత్ర్యానంతరం అది అనారోగ్యకరమూ అభివృద్ధి నిరోధకమూ కావచ్చు.'

ఇంకా మేధావులు పలువురు జాతీయత గురించి తమ అభిప్రాయాలు వ్యక్తం చేశారు. ఏమయినప్పటికీ, జాతీయతను ఇదమిత్థమని నిర్వచించడం అనుకున్నంత సులభం కాదు. జాతీయతలో స్వదేశాభిమానం, దేశభక్తి, సత్సంప్రదాయానురక్తి ప్రముఖంగా అంతర్లీనమై ఉన్నాయి. భిన్న భాషలు, భిన్న సంస్కృతులు గల దేశంలో జాతీయత నెలకొనడం దుర్లభమని కొందరు భావించవచ్చు. జాతీయత నెలకొనడానికి భాష, మతం మొదలైనవి ప్రముఖంగా తోడ్పడవచ్చుగాని అవే ప్రధాన హేతువులని మాత్రం పేర్కొనడం అసమంజసం. మానసిక స్థితే జాతీయ భావానికి ప్రేరణ అనడం సముచితమూ సహేతుకమూను. ఇందుకు మన దేశమే ప్రబలోదాహరణం. భిన్న భాషలూ భిన్న సంస్కృతులు ప్రచుర ప్రచారంలో ఉన్నప్పటికీ, మన మానసిక స్థితి ఇంచుమించు ఒకే విధంగా ఉండడంవల్ల మనలో జాతీయభావం నెలకొనడానికి ఆస్కారం కలిగింది. ఆచార వ్యవహారాలు అభిరుచులు వేషభాషలు మొదలైనవి వివిధ ప్రాంతాలలో వేర్వేరుగా కానవచ్చినా, అవి జాతీయ భావ స్రవంతికి అడ్డగర్రలు వేయలేకపోయినవి. దేశక్షేమానికి భంగం వాటిల్లనున్న తరుణంలో మన భేదభావాలు నశించి, మన

మందరం ఒక్కటే అన్న జాతీయభావం మనలో ఏర్పడుతూ వుండడం పేర్కొనదగిన అంశం. ఈ జాతీయ భావం ఉండడం వల్లనే సూర్యుడ స్తమించని ఆంగ్ల సామ్రాజ్యాన్ని సైతం, మొదట్లో భీరులమైనా కాలక్రమాన ధీరులమై ప్రతిఘటించగలిగాము. విజయం సాధించగలిగాము. విభిన్న భాషాసాహిత్యాలకూ వివిధ సంస్కృతులకూ కొలువుకూటమైన భారతదేశం సాధించిన ఘన విజయ మిది; బంగరు టక్షరాలతో వ్రాయదగింది.

## జ్ఞా పి క లు

1. భారతి వ్రాసిన దేశియ గీతంగళ్ (జాతీయ గీతాలు) నుంచి వందే మాతరం గేయం.

   ఆయిరం ఉండింగు జాతి - ఎనిల్
   అన్నియర్ వన్దు పుగల్ ఎన్న నీతి? ఓర్
   తాయిన్ వయిట్రిల్ పిఅన్దోర్ - తమ్ముళ్
   శణ్డై సెయ్‌దాలుం సగోదరర్ అన్రో?

   పై గేయానువాదం చల్లా రాధాకృష్ణశర్మది. వందేమాతర గేయం నుంచి గ్రహించబడింది. తమిళ సాహిత్యం - భారతి కవిత (పుట. 16) 1982, యువభారతి, సికింద్రాబాదు.

2. పెరియసామి మారన్ సంకలించిన భారతి వ్యాస సంపుటి, భారతి తమిళ్. తెలుగు సేత చల్లా రాధాకృష్ణశర్మ వ్రాసిన సుబ్రహ్మణ్య భారతి (1965) నుంచి గ్రహించబడింది.

3. మా కొద్దీ తెల్లదొరతనము గేయం నుంచి. గురజాడ రాఘవశర్మగారు సంకలించిన జాతీయగీతాలు, 1973, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు.

4. సైతాను ప్రభుత గేయం నుంచి, జాతీయ గీతాలు, పుట. 309.

5. Jim Masselos, Indian Nationalism An History, P. 5, Sterling Publishers (P) Ltd., New Delhi 1985.

6. భారతి వ్యాసాలు - పునర్జన్మం (1). మ. పొ. శివజ్ఞానం వ్రాసిన విడుదలైపోర్రిల్ తమిళ్ వళర్న్ద వరలాఱు (1970) అనే గ్రంథం నుంచి ఉద్ధృతం.

7. The Oxford English Dictionary, 2nd edn. Vol. X, 1989.

8. The American Heritage Dictionary of the English Language, 1981.

9. యం. రామలింగం : ఇరుపదాం నూట్రాండు తమిళ్ ఇలక్కియం' తమిళ్ పుత్తగాలయం, మదరాసు, 1977.

10. సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశములో మామిడిపూడి వేంకటరంగయ్య గారి వ్యాసం, పుటలు 170-75, 4వ సంపుటము, 1964.

11. The New Encyclopaedia Britannica, Vol. 8. 15th edn, 1987.

12. The New Lexicon Webster's Dictionary, 1987.

13. Encyclopaedia Americana, Vol. 19.

14. Tagore A Life : Krishna Kripalani, Pub. by the author, 1971.

15. ఉమాశంకర్ జోషిగారి వ్యాసం: Nationalism and the Poet. 1978, అక్టోబరు 21న తిరుచూరులో జరిగిన ఒక సదస్సులో ఆయన సమర్పించిన వ్యాసం.

16. Nationalism, Mecmillan & Co. Ltd., London, 1950.

17. Sri Aurobindo Birth Centenary Library, Vols. 1 and 15.

18. Jawaharlal Nehru : The Discovery of India, Asia Publishing House, 1964 (Reprint). ఇంకా యస్. బి. సెన్‌గారి సంకలనం Glorious Thoughts of Nehru (New Book Society of India, New Delhi, 1972) అనే గ్రంథం కూడా చూడవచ్చు.

అధ్యాయం 2

# భారతీయుల దృష్టిలో జాతీయభావం

'ఓసి జాతీయతా, నీ బలోజ్జ్వలత్వ
మెంత; నీ శక్తి సామర్థ్య మెంత; నీదు
శంఖరవమునఁ గల యింద్రజాల మెంత;
అస్థిపంజరములు నైత మాడు నౌర!'

అని జాతీయతా ప్రాశస్త్యాన్ని 1928 లో తాము రచించిన జాతీయత అనే ఖండికలో వేనోళ్ళ కొనియాడారు దువ్వూరి రామిరెడ్డి గారు. జాతీయత పూరించే శంఖారావానికి అస్థిపంజరాలే ఆడేటప్పుడు, చీమునెత్తురుల చైతన్య శరీరం ఎంతగా స్పందిస్తుందో మాటల కందని విషయ మది!

అంగ వంగ కళింగాది నామములతో ప్రాచీన భారతంలో వివిధ దేశాలు వర్ధిల్లినా, ప్రాచీన భారతీయులు 'జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అని భావించారు.[1] అనగా కన్న తల్లినీ పుట్టి పెరిగిన దేశాన్నీ స్వర్గం కంటె మిన్నగా సంభావించారు. ఈ ఉదాత్త భావన మన ప్రాచీనుల జాతీయతా దృష్టికీ, వారి మాతృ దేశాభిమానానికీ ప్రబల నిదర్శనం. మొదటి నుంచీ మన దేశంలో జాతీయవాదం లేక జాతీయ భావ సిద్ధాంతాలు ప్రజల్ని ప్రభావితం చేస్తూ వున్నవని ప్రముఖ చరిత్రకారులు రాధాకుముద్ ముఖర్జీ గారు విశ్వసించారు.[2] కాని, యీ భావం చాలా వరకు వైయక్తికమే కాని ఆధునిక జాతీయ భావానికి భిన్నమయిందని మద్దూరి సుబ్బారెడ్డి గారి అభిప్రాయం.[3] ఇది సత్య సన్నిహితమే అయినప్పటికీ అతిప్రాచీన కాలంలోనే భారతావనిలో జాతీయ భావం అస్పష్టంగా నైనా నెలకొనడం పేర్కొనదగిన అంశం. పాశ్చాత్య దేశాలలో జాతీయ భావం 18 వ శతాబ్దిలో వెలుగులోకి వచ్చిన విషయాన్ని మనం విస్మరించరాదు. ఈ దృష్టితో చూసినప్పుడు ప్రాచీన భారతీయుల జాతీయ భావం ప్రముఖంగా గోచరిస్తుంది.

జన్మదాత అయిన తల్లిని ప్రత్యక్షదైవంగా భావించేతత్వం భారతీయులది. అలాగే సకల సంపత్సమేత అయిన పృథివిని తల్లిగా తలచే స్వభావం భారతీయులది. భూమిని భూమాతగా వ్యవహరించడం మన సంప్రదాయం. బహుప్రాచీనమైన తైత్తిరీయ ఆరణ్యకంలో 'ఉత్తిష్ఠత మాస్వప్త అగ్నిమిచ్ఛధ్వం భారతాః' అని ఉన్నది. 'భారతీయులారా!మేల్కొనండి, అగ్నిని అభిలషించండి' అని దీని అర్థం. ఇక్కడ భారతీయులారా అని ప్రయుక్తం కావడం గమనించదగింది. 'మాతా భూమిః పుత్రోహం పృథివ్యాః' అని అథర్వణవేదం ఘోషిస్తున్నది.[4] ఋగ్వేదం మొదలైనవాటిలో (1-191-6) కూడా ఇలాంటి భావాలు కానవస్తున్నాయి. ఆకాశాన్ని తండ్రిగా, భూమిని తల్లిగా, సోముణ్ణి భ్రాతగా, అదితిని సోదరిగా మన పూర్వులు భావించారు. 'నా రాష్ట్రంలో మేధావులు, రాష్ట్రానికి తోడ్పడేవారూ ప్రభవింతురుగాక!'అని యజుర్వేదం అభిలషిస్తున్నది. దేశం, రాష్ట్రం (జాతి) మొదలైనవి ప్రాచీనకాలంలోనే మన దేశంలో ఏర్పడ్డ భావనలుగా కనిపిస్తున్నాయి. 'సర్వేజనా స్సుఖినోభవంతు' అని సర్వజనుల సౌఖ్యాన్ని ఆకాంక్షించడం భారతీయుల సంప్రదాయం. ఇలా ఉన్నతాశయాలు మన వేదోపనిషత్తులలో కనిపించినా, మన ఆచరణలో ఈ ఉదాత్త భావన లోపించినట్లు చెప్పవచ్చు. మన ఆచరణకీ, ఆశయానికీ మధ్య భేదం కనిపించినా మన జాతీయభావానికి మాత్రం భంగంవాటిల్లలేదని భావించవచ్చు.

మొదటినుంచీ భారతీయులు కన్యాకుమారి మొదలుకొని హిమాద్రిదాకా విస్తరిల్లిన అఖండ భారతాన్ని తమ మనసుల్లో నిలుపుకున్నారు. ఈ అఖండ భారత భావనే జాతీయభావానికి ప్రాణం పోసింది.

'ఉత్తరం యత్సముద్రస్య హిమాద్రేశ్చైవ దక్షిణమ్
వర్షం తద్భారతం నామ భారతీ యత్ర సన్తతిః'

పురాణప్రసిద్ధమైన ఈ శ్లోకం[5] ప్రకారం హిమాలయం మొదలుకొని దక్షిణ సముద్రంవరకూ వ్యాపించిన విస్తృతమైన భూభాగానికి భారతదేశం అనీ, ఈ భారతదేశ సంతతికి భారతీ అనీ పేర్లని వ్యక్తమవుతున్నది.

'పూర్వే కిరాతే యస్యాంతే
పశ్చిమే యవనా స్మృతా
ఉత్తరం యత్ సముద్ర స్య
హిమాద్రి శ్చైవ దక్షిణం
వర్షం తత్ భారత నామ
భారతీ యత్ర సంతతిః'

'హిమాలయం సమారభ్య
యావదిందు సరోవరం
తం దేవ నిర్మితం దేశం
హిందూస్థానం ప్రచక్ష్యతే'

అని మన పురాణాలు భారతదేశపు సరిహద్దుల్ని స్థిరీకరించాయి.[6]

కవికుల గురువు కాళిదాసు భౌగోళిక వివరాలకు ప్రాధాన్య మిచ్చి నంతగా మరొకరు ఇయ్యలేదేమో అని చెప్పవచ్చు. హిమాద్రి వర్ణనతో ఆ మహాకవి కుమార సంభవ కావ్యం ప్రారంభించాడు. మేఘ దూతంలో పంచవటి మొదలుకొని అలకాపురిదాక గల భూభాగాన్ని రసవత్తరంగా అభివర్ణించాడు. రఘువంశంలోనూ భౌగోళిక వర్ణనాంశాలు తెలియవస్తాయి. కాళిదాసు రచనల్ని అలవోకగా పరిశీలించినా, ఆ కవిరాజుకు గల అఖండ భారతదేశపు స్పృహ మనల్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తుంది. పుష్పక విమానంలో లంక నుంచి తిరిగి వస్తూ రాముడు గోదావరి దాకా గల ప్రదేశాలను వివరిస్తూ, ఆ తర్వాత తాము కాలి నడకను ప్రయాణం సాగించినట్లు తెలియజేస్తాడు. ఎత్తున పయనిస్తున్న పుష్పకం నుంచి పశ్చిమతీరాన ఉన్న తాళ వృక్షాల నల్లని బారు తళతళ మెరిసే చక్రానికి తుప్పుపట్టిన అంచులా కనిపిస్తున్నదని రాముడు సీతకు తెలియజేయడం మధురాతిమధురం. ఈ విషయాదికం పరిశీలిస్తే కాళిదాసుకి గల మాతృదేశాభిమానం, నిశిత పరిశీలనాసక్తి మొదలైనవి వ్యక్తమవుతాయి. అందువల్ల ఆయన్ని జాతీయ కవిగా అభివర్ణించవచ్చునని ఉమాశంకర్ జోషీగారి అభిప్రాయం.[7]

వాల్మీకి రామాయణం అనుసరించి, రంగనాథ రామాయణకర్త పుష్పక విమానంలో పయనిస్తున్న రాముడు మార్గమధ్యంలోని విశేషాలను సీతకు పూస

గ్రుచ్చిన విధంగా తెలియజేస్తాడు. కథా దృష్టితోనే ఆ విశేషాలు వివరించబడినా అవి చదువుతున్నంతసేపు మనకూ ఆయా ప్రదేశాలు చూస్తున్న అనుభూతితో పాటు రాక్షస వీరుల విక్రమం కూడా తెలియవస్తుంది.

ఇక ప్రవరుని నిమిత్తమాత్రునిగా చేసుకుని అల్లసాని పెద్దన కావించిన హిమాద్రి వర్ణన మధుర మోహనం. హిమవన్నగాన్ని ఆయన దర్శించక పోయినా దర్శించి వచ్చినట్లుగా అభివర్ణించాడు. అదే మహాకవి ప్రతిభ. కాళిదాసాది కవుల రచనలు ఆయనకి బహుధా ఉపకరించి వుండవచ్చు.

ఆసేతు హిమాచలం అన్న పదబంధం మన జాతీయ భావాన్ని చెప్పక చెపుతుంది. ఉత్తర దక్షిణ భారతాలను సాంస్కృతికంగా ఏకం చేసిన యశస్సు దశరథ రాముడికి చెందుతుంది. అయోధ్య నుంచి బయలుదేరిన ఆ అవతార పురుషుడు శ్రీలంక అని నేడు వ్యవహృత మవుతున్న లంకను చేరవలసి వచ్చింది. అది సుదీర్ఘ ప్రయాణం. అలా ప్రయాణం సాగించినవారిలో చరిత్రకు తెలియ వచ్చినంతవరకు రాముడే ఆద్యుడు. లంకలో ప్రవేశించేందుకు ముందు రాముని ఆజ్ఞను తలదాల్చి సముద్రం మీద సేతువు నిర్మించడం జరిగింది. సేతు నిర్మాణం రాముని కాలంలో జరిగింది కనుక, ఆసేతు హిమాచలం అన్న మధుర పదబంధం రాముని కాలంలో వెలుగులోకి వచ్చినట్లు భావించ డంలో విప్రతిపత్తి లేదు.

ఆసేతుహిమాచలానికి సమానార్థకమైన తమిళ పదబంధం 'కుమరి ముదల్ ఇమయం వరై' ఇక్కడ కుమరి అంటే కన్యాకుమారి అని అర్థం. సేతువు అనే అర్థంలో కుమరి శబ్దం ప్రయుక్తం. ఈ సందర్భంగా సుప్రసిద్ధ తమిళ విద్వాంసులు ము. రాఘవయ్యంగారు వెలిబుచ్చిన అభిప్రాయాలను ఉదాహరించడం సమంజసం. మణిమేకలై అనే ప్రాచీన తమిళ కావ్యంలోని 'కురంగు సెయ్‌కల్ కుమరియం పెరున్దురై' (కోతులు ఆనకట్ట కట్టిన సముద్ర తీరాన ఉన్న కుమరి) అనే వాక్యాన్ని వ్యాఖ్యానిస్తూ ఆయన యిలా పేర్కొన్నారు. రాముని సేతువు కన్యాకుమారి వద్ద నుంచే మొదలయింది. కనుక అది ఆది సేతువు. ధనుష్కోటి వద్ద ఉన్నది మధ్య సేతువు.8

కన్యాకుమారిని తమిళులు పవిత్ర క్షేత్రంగా భావించేవారనీ, దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన ప్రజలు అక్కడ గుమిగూడేవారనీ, అక్కడి సముద్రంలో స్నానం చేసేవారనీ సిలప్పదికారం మొదలైన ప్రాచీన తమిళ కావ్యాలు సాక్ష్యమిస్తున్నాయి, నేటికీ కన్యాకుమారి పవిత్ర క్షేత్రంగా భావించబడుతున్నది. కనుక తరువాతి కాలంలోనే మధ్య సేతువైన ధనుష్కోటి ప్రచారంలోకి వచ్చి వుండవచ్చు. కోటి నదులు ధనుష్కోటిలో ఉండగ - అని త్యాగరాజ స్వామి ధనుష్కోటిని ప్రశంసించారు. కాని, సుమారు రెండు దశాబ్దాల క్రితం ధనుష్కోటి సముద్రంలో మునిగిపోయింది.

బహుకాలంగా హిమాద్రి ఒక ఉన్నతశైలంగానే కాక పరమ పవిత్రంగా భావించబడుతున్నది. కాగా ఆసేతుహిమాచలంలోని సేతువూ హిమశైలమూ భారతీయుల దృష్టిలో పవిత్ర స్థలాలు. ఇవి మన దేశానికి ఎల్లలు కావడం ఒక విశేషం.

ఒకానొకప్పుడు - అంటే అతి ప్రాచీన కాలాన - కన్యాకుమారి నుంచి హిమాద్రిదాక తమిళ భాష ప్రచారంలో ఉండేదని కొందరు తమిళ పండితులు విశ్వసిస్తున్నారు. ఇందుకు సిలప్పదికారంలోని ఒక పద్యాన్ని వారు సాక్ష్యంగా ఉదాహరిస్తారు.[9]

ఆ పద్యం చెప్పిన మాడల మరైయోన్ కవి సుప్రసిద్ధమైన సరిహద్దుల్ని సూచించే నిమిత్తం కన్యాకుమారి, హిమాద్రి అని పేర్కొనివుండవచ్చు! ఒకప్పుడు తమిళం కన్యాకుమారినుంచి హిమాద్రి దాకా ప్రచారంలో ఉన్నా, తరువాతి కాలాన తమిళ భాషకు సరిహద్దులుగా దక్షిణాన కన్యాకుమారి ఉత్తరాన వేంకటశైలం పేర్కొనబడ్డాయి. (వడ వేంగడం తెన్ కుమరి). ప్రాచీన లక్షణ గ్రంథమైన తొల్కాప్పియం రచించిన తొలాప్పియనారుకి సమకాలికుడైన పనం పారనార్ వెలయించిన పాయిరంలో (అవతారిక) ఇలా ఉన్నది:

'వడ వేంగడం తెన్ కుమరి ఆయిడై
తమిళ్ కూరుం నల్లులగం'

(ఉత్తరాన వేంకటాచలం (తిరుపతి), దక్షిణాన కన్యాకుమారి వీటి మధ్య ఉన్న భూభాగం తమిళం వ్యవహరించబడే దేశం.)

అనగా తొల్కాప్పియరు కాలం నాటికి (క్రీ.పూ. 3 వ శతాబ్ది)[10] తమిళ భాషకు సరిహద్దు ప్రాంతాలుగా కన్యాకుమారి, వేంకటాచలం నిర్ధారించబడినట్లు చెప్పవచ్చు.

సతీదేవి అని ప్రఖ్యాతి చెందిన కణ్ణకికి (సిలప్పదికారం కావ్యనాయిక) విగ్రహం మలచడానికిగాను చేర (కేరళ) రాజయిన సెంగుట్టువన్ హిమాలయం నుంచి శిలను తెచ్చినట్లు, ఆ శిలను సుందరతరమైన విగ్రహంగా శిల్పాచార్యులు మలచినట్లు, అది తిరువంజైక్కళంలో (తిరువంజిక్కుళం) ప్రతిష్ఠితమైనట్లు తమిళ పంచకావ్యాలలో ఒకటైన సిలప్పదికారం స్పష్టం చేస్తున్నది. ఏ తత్కావ్యాన్ని కేరళదేశపు తమిళ కవి అయిన ఇళంగో రచించారు. ప్రాచీనకాలంలో కేరళమును (చేరదేశం) పాలించిన వారు చేర భూపతులు. వారు తమిళులు. అందువల్లనే ఆ రోజుల్లో చేరనాడులో తమిళం పాలనాభాషగాను, కావ్యభాషగాను ఉండేది. తరువాతి కాలంలో పరిస్థితి మారిపోయింది. భారతదేశపు ఏకత్వాన్ని తెలియజేస్తున్న కుమరి - హిమాలయాల సంబంధం తమిళ సాహిత్యమంత ప్రాచీనమైనదని తమిళ విద్వాంసుల అభిప్రాయం.

వివిధ భారతీయ భాషలలోనూ కావ్య రచన జరగని ఆ రోజులలో మన దేశంలో సంస్కృతమూ తమిళమూ కావ్యభాషలుగా ఉండేవని చెప్పవచ్చు.[10-A] సంస్కృత సాహిత్యంలా తమిళ సాహిత్యమూ భారతీయ సంస్కృతికి దర్పణమని భావించబడుతున్నది. క్రీ.శ. ఏడవ శతాబ్దిలో వర్ధిల్లిన తిరునావుక్కరశర్ అనే భక్తకవి శివుడు సర్వమూ అయినవాడు అనే అర్థంలో 'ఆరియన్ కణ్డాయ్ తమిళన్ కణ్డాయ్' అని పేర్కొన్నాడు. ఆర్యుల వేదాలకు తమిళ వేదానికి శివుడు గోచరుడు - అని దీని కర్థం చెప్పవచ్చు. తమిళంలో చతుర్వేదాలు వెలసినట్లు కొందరు తమిళ పండితుల విశ్వాసం. శివుడు డమరుకం మోగించగా ఒక వైపునుండి సంస్కృతధ్వనులూ మరొక వైపునుంచి తమిళ ధ్వనులూ వెలువడ్డాయనీ, శివుడు సంస్కృత భాషను పాణినికీ, తమిళమును అగస్త్యునికీ నేర్పాడనీ, అలా శివుడు ఉభయ భాషలను అభివృద్ధి చేశాడనీ ఐతిహ్యం.

ఇక ప్రాచీన తమిళ సాహిత్యంలో కానవచ్చే హిమవత్ప్రశంసను పరిశీలిద్దాము.

తమిళ సాహిత్యానికి శ్రీకారం చుట్టిన యుగం సంగయుగం. ఆ నాళ్ళలో వెలుగు చూసిన కృతులలో హిమవన్నగ ప్రశంస కనిపించడం పేర్కొనదగిన అంశం. హిమాలయం నుంచి ఎగిరి వచ్చిన ఒక హంస దక్షిణాన ఉన్న కడలిలో చేపల్ని గ్రహించి మళ్ళీ హిమాలయానికి వెళ్ళి తన పిల్లలకి వాటిని ఆహారంగా పెట్టిన విషయాన్ని విశదపరిచే ఒక పద్యం నట్రిణై అనే కృతిలో చోటు చేసుకున్నది.[11] గంగానది కట్టలు తెంచుకుని ప్రవహిస్తున్నట్టుగా, నా ప్రేమ నా మనస్సుని అధిగమించి పొంగుతున్నదని ఒక నాయిక తెలియజేసినట్లుగా ఆ కృతిలోనే మరొక పద్యంవల్ల తెలియవస్తున్నది.[12] మధురగాథాసంకలనమైన అగనానూరులో ఒక పద్యంలో ధనార్జన నిమిత్తం తనను విడిచి వెళ్ళిన నాయకుని ఉద్దేశించి నాయిక ప్రశ్నించింది గదా: ఆర్జించాలన్న ఆ సంపద హిమాలయం కంటె శ్రేష్ఠమయిందా? అని.[13] పదిట్రుప్పత్తు, కుఱుందొగై, సిఱుపాణాట్రుప్పడై మొదలైన కృతులలో కూడా హిమవత్ప్రశంస కానవస్తున్నది.[14]

హిమాలయందాక చేరభూపతి సెంగుట్టువన్ జైత్రయాత్ర కావించడం వల్లనో మరి యే కారణంవల్లనో ఆ మంచుకొండ తమిళ సాహిత్యంలో సముచితమైన స్థానం వహించడం పేర్కొనదగింది. అంతేకాదు, హిమాలయం శ్రేష్ఠమైనదిగా ఆనాటి తమిళులు భావించినట్లు నిస్సంశయంగా చెప్పవచ్చు. గంగానది కట్టలు తెంచుకుని ప్రవహిస్తున్నట్టుగా తన ప్రేమ తన మనస్సుని మీరి పొంగుతున్నదని ఒక నాయిక చెప్పడం కూడా గమనించదగిందే. అగస్త్యుని కరుణవల్ల కవేరుని పేరుగా మీదుగా వ్యవహృతమవుతూ ప్రవహిస్తున్న కావేరి నదిని గాక ఉత్తరాన ఉన్న గంగానదిని ఆ నాయిక స్మరించడం చూడగా, ఆ రోజుల్లోనే హిమాలయమూ గంగానదీ పరమపవిత్రములుగా భావించబడినట్లు పేర్కొనవచ్చు.

ఈ సందర్భంగా సంప్రదాయబద్ధులైన హిందువులు పరమ పవిత్రంగా భావించే కాశీయాత్రను గురించి రెండు మాటలు చెప్పడం అవసరం. మత సంప్రదాయాలను అనుసరించే హిందువులు తొలుత రామేశ్వరంలోని సముద్రంలో స్నానంచేసి, రామలింగేశ్వరుణ్ణి పూజించి, అటుపిమ్మట కాశీ వెళ్ళి విశ్వనాథుణ్ణి పూజిస్తారు. ఆ తర్వాత గంగా నదీజలాలు తీసుకు వచ్చి వాటితో రామలింగేశ్వరుణ్ణి అభిషేకిస్తారు. రావణ వధానంతరం అయోధ్యకు తిరిగివస్తూ రాముడు రామలింగేశ్వరుణ్ణి పూజించినట్లు ఐతిహ్యం. సంప్రదాయం మాట ఎలా ఉన్నా,

భారతీయులు దక్షిణోత్తర భారతాలను ఇలా ఏకం చేయడానికి ప్రయత్నించారని భావించవచ్చు. నేటికీ ఈ విధంగా కాశీయాత్ర కావించే వారుండడం గమనించ దగిన విషయం. అయితే, వారికి మత విశ్వాసమో, సంప్రదాయమో ప్రేరణ కావచ్చు.

శివుడు సంస్కృత ద్రావిడ వ్యాకరణాలను నేర్పిన ఐతిహ్యంలోని సత్యా సత్యాలను నమ్మినా నమ్మకపోయినా, ఒక్కటి మాత్రం సుస్పష్టంగా చెప్పవచ్చు. మన దేశంలోని భాషలు విభిన్నములు కావచ్చు. అలాగే సంస్కృతులూ వివిధ ములు కావచ్చు. అయినా యీ వైవిధ్యాల మధ్య సమన్వయాన్ని సాధించడానికి నిరంతరం కృషి జరుగుతూనే వున్నదనీ, ఆ కృషియే మన జాతీయ భావానికి ప్రబల నిదర్శనమనీ భావించవచ్చు. సంస్కృత ద్రావిడములు విభిన్న భాషలే అయినప్పటికీ, వాటిని నేర్పిన గురువు మాత్రం ఒక్కడే కావడం విస్మరించరాని ప్రముఖ విషయం.

జాతీయ భావాన్ని పురస్కరించుకునే కాబోలు, వివిధ భాషలు వ్యవహ రించేవారిమధ్య సాన్నిహిత్యం ఏర్పడడానికి అనువాద కార్యక్రమానికి మన వారు ప్రాధాన్యమిచ్చారు. సంస్కృతంలోని కావ్యేతిహాసాల పరివర్తనానికి, అనుసరణకి ఈ జాతీయ భావం తోడ్పడిందని పేర్కొనడం అసంగతం కాదు. సంస్కృత సాహిత్యానికి దాక్షిణాత్యులైన దండి, జగన్నాథ పండిత రాయలు ప్రభృతులు చేసిన సేవ విశిష్టమయింది. అంతేకాదు, సంస్కృతం - తమిళ భాషీయుల మధ్య సాన్నిహిత్యం నెలకొల్పడానికి మణిప్రవాళమనే నూతన శైలిని ఆనాటి పండితులు వాడుక చేశారు. గ్రంథ లిపిలో సంస్కృత గ్రంథాలు వెలిశాయి. అలాగే తెలుగు లిపిలో తమిళ గ్రంథాలు కొన్ని వెలిశాయి. దక్షిణా దిని నివసించే సౌరాష్ట్రులు తెలుగు లిపిలో సౌరాష్ట్ర గ్రంథాలు వెలయించారు. ఈ దృష్టితో పరిశీలిస్తే, జాతీయ భావనకు భారతీయులు పెద్ద పీట వేశారని భావించవచ్చు. ఏమయినా, ఆధునిక జాతీయ భావం బహు విశిష్టమయింది. మత పరంగా హిందువుల్ని ఏకం చేయగలిగిన జాతీయ భావం వంటిది మన దేశంలో అనాదిగా ఉన్నా, ఆధునిక జాతీయ భావం ఆధునిక కాలంలోనే వెలసినట్లు

పేర్కొనడం సముచితం. సాంస్కృతికంగా ఒక్క భారతీయులలోనే కాక ఆగ్నేయాసియా దేశాల వారిని కూడా ఏకం చేయడానికి సంస్కృత భాషా సాహిత్యాలు దోహదం చేసిన అంశం సర్వవిదితం.

## జ్ఞాపికలు

1. ఈ సూక్తి వాల్మీకంలోనిదని భావించటం పరిపాటి. కాని ప్రసిద్ధ సంస్కృత విద్వాంసులు పుల్లెల శ్రీరామచంద్రుడు గారు తమ 26-2-92 లేఖలో ఇలా వ్రాశారు: 'పూర్వం కూడా నేనొకసారి 'జననీ జన్మభూమిశ్చ' ఇత్యాది శ్లోకం కోసం రామాయణం అంతా తిరగవేసినాను. అది రామాయణంలో లేదు. ఎక్కడినుండి ప్రసిద్ధిలోనికి వచ్చిందో తెలియదు.'
2. Nationalism in Ancient India, పుటలు 17-25, 42.
3. తెలుగులో జాతీయోద్యమ కవిత్వం, పుట 62, రాగసుధా ప్రచురణలు, తిరుపతి, 1982.
4. 12-1-12. తైత్తిరీయం 2,500 సంవత్సరాల నాటిదని మన విశ్వాసం.
5. పుల్లెల శ్రీరామచంద్రుడు గారి స్వాగతోపన్యాసం, సంస్కృత భారతీ, ఏప్రిల్-జూలై 1991.
6. తంగేడుకుంట హెబ్బార్ నాగేశ్వరరావు గారి 'కవిత' వ్యాసం, రజత రంజని (రంజని రజతోత్సవ సంచిక), హైదరాబాదు, 1988.
7. Nationalism And The Poet వ్యాసం.
8. ఈ వాక్యం మణిమేఖల కావ్యంలో 5వ ఆశ్వాసంలోనిది. చీత్తలై శాత్తనార్ అనే బౌద్ధమతావలంబకుడైన కవి ఈ కావ్యకర్త. దీని రచనా కాలం క్రీ. శ. రెండవ శతాబ్దిగా భావించబడుతున్నది. ఇటీవల శైవ సిద్ధాంత కళగంవారు ఈ కావ్యాన్ని ప్రసిద్ధ విద్వాంసులు పె. సోమసుందరనారుగారి వ్యాఖ్యానంతో చక్కగా ముద్రించారు. రాఘవయ్యంగారు పేర్కొన్నట్లుగా ఆయన కూడా కోతులు అనకట్ట కట్టిన సముద్ర తీరాన ఉన్న కుమరి అనే అర్థం తెలియజేశారు. కాగా కన్యాకుమారి ఆదిసేతువని భావించవచ్చు. ఇంకా వివరాలకు నా పుస్తకం కూడా

చూడవచ్చు. C. R. Sarma: The Ramayana in Telugu and Tamil - A Comparative Study, Lakshminarayana Granthamala, Madras, 1993.

9. విడుదలై పోరిల్ తమిళ్ వళర్న్ద వరలాఱు, ఇన్బ నిలైయం, మదరాసు, 1970.

10. ము. వరదరాజన్ వ్రాసిన తమిళ ఇలక్కియ వరలాఱు, సాహిత్య అకాడెమి, కొత్త ఢిల్లీ, 1972. తొల్కాప్పియనారు కాలం వివాదగ్రస్తం. క్రీ.పూ. 500, క్రీ.పూ. 300, క్రీ.శ. 2 వ శతాబ్ది, క్రీ.శ. 3 వ శతాబ్ది అని పండితులు రకరకాలుగా కాలనిర్ణయం కావించారు.

ఇంకా వివరాలకు చల్లా రాధాకృష్ణశర్మ తమిళ సాహిత్య చరిత్ర (1976) చూడవచ్చు.

10A. ప్రసిద్ధ విద్వాంసులు సునీతి కుమార్ చటర్జీ గారు ఇలా పేర్కొన్నారు: "Tamil Literature is also unquestionably a representative of Indian culture at its best and its profoundest."

11. నట్రిణై, 356 వ పద్యం (పంక్తులు 1.5)

12. పైదే, 369 వ పద్యం (పంక్తులు 7.11)

13. అగనానూఱు, 265 వ పద్యం (పంక్తులు 1.3)

14. పదిట్రుప్పత్తు, రెండవ దశకం 1, (పంక్తులు 23-24)
కుఱున్దొగై, 158 వ పద్యం.
సిఱుపాణాట్రుప్పడై, 48-49 పంక్తులు.

## అధ్యాయం 3

# జాతీయ భావానికి గ్రహణం పట్టువిడుపులు

స్వస్థాన వేష భాషా ప్రియత్వం మానవ సహజం. అతని కది ఉగ్గుతో అలవడింది. కనుకనే ప్రతి మానవుడు తన భాషను, తన జాతిని, తన దేశాన్ని ప్రేమిస్తాడు. ప్రేమించకపోవడం అసహజం. కాని యీ అభిమానం దురభిమానం కాకూడదు. అలా అయినప్పుడు ద్వేషభావం ఏర్పడుతుంది. జాతీయత దురభిమాన పూరితం కావడాన్ని రవికవీంద్రుడు సహించలేక పోయాడు. కనుకనే ఆయన జాతీయవాదం పట్ల వైముఖ్యం ప్రకటించారు. దురభిమాన పూరితమైనది ఏదైనా, అది అవాంఛనీయమే అవుతుంది. చవులు జాత్యన్నసమమె - అనుకుని, యితర ఆహార పదార్థాలను ద్వేషించడం అవాంఛనీయం.

స్వస్థాన వేష భాషాదుల్ని సముచిత రీతిని ఆదరిస్తూనే అఖండ భారతాన్ని ఆదరించే పెద్ద మనసుని అలవరుచుకున్న వారు భారతీయులు. జన్మభూమిని స్వర్గం కంటే మిన్నగా భావించినా, 'అన్నియు మన ఊళ్లె, అందరు మనవారె' లేక 'ఏదియు మన ఊరె, ఎల్లరు చుట్టాలె' (యాదుం ఊరే యావరుం కేళిర్)[1] అన్న విశాల భావాన్ని ఆత్మగతం చేసుకున్నారు. కనుకనే మనలో జాతీయ భావం నెలకొన గలిగింది. అయితే యిది కొన్ని సమయాలలో ప్రస్ఫుటమవుతున్నది; కడమ వేళల్లో అంతర్గంగలా ఉండిపోతున్నది. కాని, పరదేశీయుల పరిపాలన కాలంలో జాతీయ భావానికి గ్రహణం పట్టిందనీ, ఆ పరదేశీయుల పాలనకు స్వస్తి చెప్పడానికి పూనుకున్నప్పుడు, ఈ భావానికి బ్రహ్మరథం పట్టడం జరిగిందనీ చెప్పవచ్చు.

గుడ్డిలో మెల్ల అన్నట్లుగా, పాశ్చాత్య పరిపాలన వల్ల కలిగిన సత్ఫలితం మన దేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనం కలగడం. బ్రిటిషు వారి యేలుబడిలో పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతులతో కలిగిన సంబంధం మన సాంస్కృతిక పునరుజ్జీవనానికి దోహదం చేసింది. తత్ఫలితంగా మన దేశీయుల మనోభావాలలో మార్పులు కలిగాయి. మన ప్రాచీనాచార వ్యవహారాలను కొందరు తూర్పార పట్టసాగారు; వాటిని గౌరవించాలనీ, మన సంస్కృతి మహోత్కృష్టమైనదని కొందరు భావించసాగారు. తూర్పార పట్టిన వారిలో సంస్కరణ దృష్టి ప్రధానంగా కానవస్తుంది. మన రాజకీయ, ఆర్థిక విధానాలలో మార్పులు ఏర్పడాలని వారు గాఢంగా అభిలషించారు. మన సాంఘిక వ్యవస్థ మారాలని కూడా ఆశించారు. మన సంస్కృతి ఉత్కృష్టమైనదని భావించినవారు మన ప్రాచీన చరిత్రను పరిశోధించడానికి పూనుకున్నారు గత చరిత్రలోని వైభవాన్ని, సంస్కృతిలోని వైశిష్ట్యాన్ని తెలియజేసే ఉద్దేశంతో గ్రంథ రచనకూ పూనుకున్నారు. మన సంస్కృతిని మనం విస్మరించడంవల్లనో, గౌరవాభిమానాలతో చూడకపోవడంవల్లనో, మనం పతన స్థితికి పాల్పడ్డామని వారు భావించారు. ప్రజలలో స్వాతంత్ర్యాభిలాష, స్వరాజ్యకాంక్ష మిక్కుటమైనాయి; జాత్యభిమానం పెల్లుబికింది. తత్ఫలితంగా మేఘావృతుడైన జాతీయ భావ భానుడు బయటపడి తన సహజ కాంతుల్ని ప్రసరించసాగాడు. జాతీయ భావానికి పట్టిన గ్రహణం విడిచింది. కాని, పూర్తి విడుపుకి మరికొంతకాలం పట్టింది!

1885, డిసెంబరు 28న బొంబాయిలో భారత జాతీయ కాంగ్రెసు (ఇండియన్ నేషనల్ కాంగ్రెస్) ఉద్భవించింది. అనగా ఆ సంవత్సరం మన దేశంలో ఒక జాతీయోద్యమం వెలుగు చూసిందన్న మాట. అంతకు మునుపే జాతీయ భావమని స్పష్టంగా చెప్పలేము కాని, బ్రిటిషు సైనికాధికారుల్ని ప్రతిఘటిస్తూ మీరట్‌లో భారతీయ సైనికులు కొందరు ఒక తిరుగుబాటు జరిపారు. దాన్ని సిపాయీల కలహమనీ సిపాయీల తిరుగుబాటనీ, ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటమనీ వ్యవహరిస్తారు. ఆ సంగ్రామం 1857 మే పదవ తేదీని (ఆదివారం) జరిగింది.[2] అది విఫల ప్రయత్నమే అయినప్పటికీ, ఆ వీర వరేణ్యుల స్వాతంత్ర్య పిపాస మాత్రం ప్రశంసార్హం!

ఆ స్వాతంత్ర్య జాతీయ సమరం జరగక మునుపే, మన దేశంలో కొన్నిచోట్ల బ్రిటిష పరిపాలకులకు వ్యతిరేకంగా తిరుగుబాట్లు జరగడం పేర్కొనదగిన అంశం. అయితే వాటికి రావలసినంత ప్రచారం రాలేదు.

దక్షిణాపథంలోని తిరునెల్వేలి సీమలో, పాంచాలం కురిచ్చి పాళెగారయిన వీరపాండ్య కట్టబొమ్మన్ నాయకత్వాన తూర్పు ఇండియా కంపెనీవారి అధిక్యాన్ని ప్రతిఘటిస్తూ ఒక తిరుగుబాటు జరిగింది.[3] అతని అనంతరం అతని సోదరుడు ఊమదురై, శివగంగ మరుదు సోదరులు ఆ పోరుని కొనసాగించారు. 1792 - 1801 ల మధ్య ఆ పోరు సాగినట్లు భావించబడుతున్నది.[4] అదే సమయంలో మైసూరు పాలకుడైన టిప్పుసుల్తాను తూర్పు ఇండియా కంపెనీ ఆంగ్లేయుల్ని ప్రతిఘటిస్తూ యుద్ధం చేసి వీర స్వర్గం అలంకరించాడు.

1806 లో వేలూరుకోటలో జూలై 10 న ఒక యుద్ధం జరిగింది. దీన్ని వేలూరు సిపాయిల తిరుగుబాటుని వ్యవహరిస్తారు. దీన్ని గురించి వీర సావర్కారు (వినాయక దామోదర్, సావర్కారు, 1883 - 1966) తమ రచనలో ఇలా పేర్కొన్నారట: "1806 లో జరిగిన వేలూరు సిపాయీల తిరుగుబాటు స్వాతంత్ర్య పిపాసను పురస్కరించుకుని జరిగింది. అనంతర కాలంలో జరిగిన మొదటి స్వాతంత్ర్య సమరాని కది ఒద్దిక (రిహార్సలు) వంటిది."[5]

తెలుగునాడులో కూడా తూర్పు ఇండియా కంపెనీ మీద తిరుగుబాట్లు కొన్నిచోట్ల జరగకపోలేదు. పశ్చిమగోదావరి జిల్లాలోని మొగల్తూరు సంస్థానానికి చెందిన భూపయ్య, వెంకట్రామరాజులు కుంఫిసీ సైనికుల్ని ప్రతిఘటించారు. అది విఫల ప్రయత్నం.[6] 1790 లో కలిదిండి తిమ్మరాజు సాయుధుల మీద దాడి చేశాడు. 17 వ శతాబ్ది చివరి భాగంలో పోలవరం జమీందారులు బ్రిటిషువారిని ప్రతిఘటించారు. విప్లవ వీరుడు నానాసాహెబ్ విప్లవవీరుల్ని తోడుగా చేసుకుని వస్తున్నట్లుగా విని, నేటి పశ్చిమ గోదావరి జిల్లాలోని కొరటూరు గ్రామ మునసబు సుబ్బారెడ్డి ఆ పరిసర గ్రామాలలోని కోయ ప్రజల్ని సమీకరించి ప్రభుత్వాని కెదురుగా సాయుధ పోరాటం సాగించారు. గిరిజన నాయకులు కొందరు బ్రిటిషువారిని ప్రతిఘటిస్తూ ధ్వజ మెత్తారు. తిరుగుబాటుదార్లకూ బ్రిటిష్ సైనికులకూ జీలుగుమిల్లి కొండలలో 1879 లో యుద్ధం

జరిగింది. 'సిపాయీల మీద తిరుగుబాటుదార్లు తుపాకులతో కాల్పులు జరిపి విల్లంబులతో వీరోచితంగా పోరాడి అడవుల్లోకి తప్పుకున్నారు.' ఇది రంప పితూరీగా ప్రసిద్ధి కెక్కింది.[7]

ఇక బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిలిచి సాయుధ పోరాటం సాగించిన అల్లూరి సీతారామరాజు వీరగాథ (1897 - 1924) చరిత్ర ప్రసిద్ధం. సాయుధ విప్లవమంటే ఏ మాత్రమూ సానుభూతి లేని గాంధీమహాత్ముడు సైతం అల్లూరి వీరుని నిష్కళంక దేశభక్తిని ప్రశంసించారు. మహాత్ముడు తమ 'యంగ్ ఇండియా' పత్రికలో (1929, జూన్ 18 వ తేదీ సంచిక) 'ఆంధ్ర వీరుడు అనే శీర్షికకింద సీతారామరాజు గురించి వ్రాశారు.[8]

ఈ విషయాదికం సూక్ష్మంగా పరిశీలిస్తే, జాతీయత అన్నది ఆధునిక భావంగా పరిగణించబడినప్పటికీ, 1885 కి పూర్వమే అది ఏదో ఒక రూపంలో భారతీయులలో ఉన్నట్లు చెప్పవచ్చు.[9] అయితే జాతీయత అనే పేరుతో అది ఉండకపోవచ్చు. విదేశీ ప్రభుత్వాధికారుల మీది ద్వేషభావం వారి స్వాతంత్ర్యాను రక్తికి కారణ మయింది. అది స్వదేశాభిమానంగా పర్యవసించడంలో ఆశ్చర్యం లేదు. ఆ అభిమానం బలం పుంజుకునే కొద్దీ, అస్పష్టంగా ఉన్న ఆ జాతీయ భావం క్రమ క్రమంగా రూపుదిద్దుకో సాగింది. అసలు భారత జాతీయ కాంగ్రెసు అని పేరు పెట్టడమే ఒక గొప్ప విశేషం. భారత కాంగ్రెసు అనకుండా, భారత జాతీయ కాంగ్రెసు అనడం ద్వారా, ఆనాటి ప్రముఖులు అస్పష్టంగా మనలో ఉన్న జాతీయ భావానికి పెద్ద పీట వేసిన వారయ్యారు.

గాంధీజీ రంగప్రవేశంతో (1915) కాంగ్రెసు చరిత్రలో నవయుగం ప్రారంభమయింది. అది ఒక కొత్త మలుపు తిరిగిందన్నా అతిశయోక్తి కాదు. అంతవరకూ విద్యావంతుల సంస్థగా ఉన్న కాంగ్రెసు కార్యకలాపాలలో సామాన్యులు సైతం పాల్గొన సాగారు. కనుకనే ఆ జాతీయోద్యమానికి ఎక్కడ లేని ప్రచారమే కాక బలం కూడా వచ్చింది. అంతకు ముందు, అనగా 1905 లో, అప్పటి వైస్రాయి కర్జన్ ప్రభువు వంగవిభజన తలపెట్టాడు. తత్ఫలితంగా దేశంలో తీవ్రాందోళన చెలరేగింది. 1919 లో చెమ్స్ ఫోర్డు ప్రభువు వివాదాస్పదమైన రౌలట్ చట్టం ప్రవేశపెట్టాడు. దాన్ని న్యాయబద్ధం చేయ

వద్దని గాంధీజీ ప్రభుత్వాన్ని అర్థించారు. కాని ఆ అభ్యర్థనను ప్రభుత్వం పెడ చెవిని పెట్టింది. తత్ఫలితంగా గాంధీజీ అఖిల భారత స్థాయిలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా సత్యాగ్రహోద్యమం ప్రారంభించారు. అది సర్వ భారతాన్ని ఆకర్షించింది. అది అఖిల భారత స్థాయిలో సాగిన మొదటి ప్రజోద్యమం అని చెప్పవచ్చు. జాతీయ భావానికి రెక్కలు వచ్చిన సంవత్సరం 1919.

శాంతియుతంగా సత్యాగ్రహం సాగినా, బ్రిటిషువారు పశుశక్తి నుపయోగించి దాన్ని అణచివెయ్యడానికి ప్రయత్నించారు. ఫలితంగా ఢిల్లీ, అమృతసర్ మొదలైన చోట్ల కాల్పులు జరిగాయి. నిరాయుధులు తమ నిండు ప్రాణాలు కోల్పోయారు. ఎందరెందరో క్షతగాత్రులయ్యారు. ఆ తర్వాత, అనగా 1919, ఏప్రిలు 13న, జలియన్‌వాలాబాగులో ఘోర కలి తాండవించింది. ఎక్కడో పంజాబులో జరిగిన ఆ దురంతానికి భారతదేశమంతా స్పందించింది! భారతీయుల జాతీయ భావానికి అది ప్రబల నిదర్శనం. దేశంలో ఏ మూల ఏది జరిగినా, అది దేశాన్నే కలవర పెట్టింది. సాహిత్యం సంఘ జీవిత దర్పణం కనుక జలియన్ వాలాబాగు దురంతం వంటి హృదయ విదారక సంఘటనలు భారతీయ సాహిత్యంలో ప్రతిఫలించడంలో ఆశ్చర్యం రవంతైనా లేదు.

జాతీయ కవి గరిమెళ్ళ సత్యనారాయణ 34 పాదాలలో పాంచాలము అనే గేయం వ్రాశారు. 'కంట గుడ్డను బెట్టి కర్ణాన వేలెట్టి వింటావటర ఓరయ్యా' అని మొదలవుతుంది ఆ గేయం. 'హిందు మాతానురా' అనే గేయంలో కొండపల్లి జగన్నాథదాసు ఇలా అన్నారు:[10]

'డయ్యరసురుడ వీవు - దయ యెట్లు కలుగును
దనుజ భావమె నీకు - ధర్మమాయెనటర ॥హిందు॥

పంజాబు బిడ్డలను - పలు వధల గావించి
బ్రతుకదలచితివటర! - బ్రహ్మకల్పముదాక ॥హిందు॥

గురజాడ రాఘవశర్మ 'పాంచాలి' అనే శీర్షిక క్రింద భావబంధురములైన పద్యాలు వ్రాశారు. ఒక పద్యం[11]

'డయ్యి' రైనను, మరి వాని యయ్యయైన
'యొడయ' రైనను మరి వాని యొడయ డైన
సిగ్గు విడిచి చేసినట్టి దుష్కృత్య ఫలమ్ము
లనుభవింపక యున్నె! నా యాన, తల్లి!

రావణుని మించిన క్రూర రాక్షసుడని డయ్యరుని మరొక కవి అభివర్ణించాడు. మాటల కందని ఘోరకృత్యం జలియన్‌వాలాబాగు దురంతం. ఆ దురంతాన్ని సహించలేక రవికవీంద్రులు తమ సర్ బిరుదాన్ని విసర్జించారు. ఆ దురంతం ఎంతగా బాధించిందో అందువల్ల స్పష్టమవుతుంది.

ప్రముఖ దేశభక్తులు దామరాజు పుండరీకాక్షుడుగారు (1896-1970) పాంచాలి పరాభవం లేక పంజాబు దురంతాలు అనే అయిదంకాల నాటకం వ్రాశారు. 1921-22 ప్రాంతాలలో ఈ నాటకం బహుళ ప్రచారం అందుకుంది. డయ్యరు డయరాసురుడుగా, దుర్యోధనుడుగా నాటకంలో చిత్రించబడ్డాడు.[12]

పంజాబు కేసరిగా ప్రసిద్ధికెక్కిన లాలా లజపతిరాయ్[12] అధ్యక్షతను 1920 లో కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు మహాసభలో అసహాయోద్యమ తీర్మానం ఆమోదించబడింది. ఆ తరువాతి సంవత్సరాలలో ఆ ఉద్యమం తీవ్రరూపందాల్చి దేశాన్ని కదిల్చివేసింది. ఆ ప్రజోద్యమం ఫలితంగా ఎందరెందరో జాతీయవాదులు త్యాగాలు చేశారు. అసహాయోద్యమం జాతీయభావాలు గల కవుల్ని ఎంతగానో ప్రభావితం చేసింది. గాంధీజీ నాయకత్వం తిరుగులేనిదని ఋజువయింది. ఆయన మాట వేదవాక్కయింది. గాంధీజీ అవతార పురుషుడని జాతీయ కవులు సహర్షంగా పేర్కొన్నారు.[14]

సింహాసనానికి వచ్చిన తర్వాత ఐదవ జార్జిగా ప్రసిద్ధుడైన వేల్సు యువరాజు మన దేశానికి 1906 లో వచ్చిన సందర్భంగా కూడా దేశమంతట హర్తాళ్ జరిగింది. ఆయన రాకను పురస్కరించుకుని కవులు కొందరు స్వాగతం చెప్పగా, మరికొందరు నిరసిస్తూ కవితలు వెలయించారు. యువరాజుని ఆహ్వానిస్తూ తమిళ జాతీయకవి సుబ్రహ్మణ్య భారతి 45 పాదాల కవిత చెప్పడం ఆశ్చర్యంలో ఆశ్చర్యం! అంతకు ముందూ వెనకా ఆ జాతీయకవి పారతంత్ర్యాన్ని నిరసిస్తూను, స్వాతంత్ర్యాన్ని ప్రశంసిస్తూను ఎన్నో చక్కని గేయాలు వెలయించారు. అలాంటి కవి వేల్సు యువరాజుని ఎందుకు ప్రశంసిస్తూ కవిత చెప్పారో అంతు పట్టని అంశమని తమిళ విమర్శకుల అభిప్రాయం.[15]

ఈ సందర్భంగా మానికొండ సత్యనారాయణ శాస్త్రిగారి మాటల్ని గుర్తు చేసుకోవడం సముచితం. 'అనేక మంది ప్రదర్శకులు తుపాకిగుండ్లకు ఆహుతులైరి.

ఈ సందర్భములో ఆంధ్రలో పేర్కొనవలసినది శ్రీ గరిమెళ్ల సత్యనారాయణ గారిచే రచింపబడిన పాట 'ఏమయ్యో యువరాజా! ఎందుకొచ్చావయ్యా?' అనునది. ఆనాడు ఈ పాట ఆంధ్రదేశమంతటా ఆబాలగోపాలము ప్రసిద్ధమయ్యెను.[16]

ఆ తర్వాత జాతీయ కాంగ్రెసు తలపెట్టిన వివిధ ఉద్యమాల ప్రభావం మన కవుల మీద కనిపిస్తుంది. ఆ విధంగా జాతీయ భావం మన సాహిత్యంలో తిష్ఠ వేసింది.

## జ్ఞాపికలు

1. సంగకాలపు కవి అయిన కణియన్ పూంగుండ్రనార్ చెప్పిన 'జ్ఞానులు' అనే కవిత నుంచి ఈ పాదం గ్రహించబడింది. పాఠకుల కోసం ఈ కవితను ఉదాహరిస్తున్నాను.

అన్ని ఊళ్ళు మనవె, అందరు మనవారె
ఇతరులు కలిగింతురే శుభాశు
భములు? బాహిరములె బాధోపశమనముల్?
చావు క్రొత్తకాదు, సంతసమ్ము
కలుగువేళ మేను పులకరించదు, దుఃఖ
ము కలుగు తరి క్రుంగిపోదు మనసు.
కొండవాగులోన బండరాళ్ళ నడుమ
ఉరుములు మెరుపులును మెరయుచుండ
ఏగునట్టి పడవ ఈ జీవితమనగ;
విధికి లోబడి అది వెడలు గాదె
కనుక పొగడబోము ఘనులను, అటులనే
నింద చేయబోము నీచమతుల.

(చల్లా రాధాకృష్ణశర్మ తరతరాల తమిళ కవిత, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1977.)

2. Jim Masselos : Indian Nationalism An History, Sterling Publishers (P) Ltd, New Delhi, 1985 (P. 11)

3. కట్టబొమ్మన్ సాగించిన యుద్ధం గురించి తమిళంలో కవితలు అనేకం వెలువడ్డాయి. కలియుగ పెరుంగావియం, కట్టబొమ్మన్ శణ్డై కుమ్మి, పాంచై క్కోవై, వీరపాండియన్ అనురాగ మాలై, రామనాథపురం బేట్టి విరుత్తం, రామనాథపురం బేట్టి కుమ్మి, కట్టబొమ్మన్ కదైప్పాడల్, వీరపాండియం మొదలైనవి సంభావ్యాలు. వీటిలో వీరపాండియం కావ్యం సంతరించిన మధురానగరం వాస్తవ్యులు జగవీర పాండ్యేనారు తాను కంబళ నాయక వంశానికి చెందినవాడనని చెప్పుకున్నారు. సుబ్రహ్మణ్య భారతి రచించిన 'మఱవన్ పాట్టు' తోకల జాతి వారికి సంబంధించిన రచన.

ఇంకా వివరాలకు విడుదలై ప్పోరిల్ తమిళ్ వళర్న్ద వరలాఱుని చూడవచ్చు.

4. విడుదలై ప్పోరిల్ తమిళ్ వళర్న్ద వరలాఱు, పుటలు 25 - 26.
5. పై గ్రంథం, పుట 24. వీరసావర్కారు రచన. Indian War of Independence - 1857.
6. పశ్చిమ గోదావరి జిల్లాలో ఈస్టిండియా కంపెనీ మీద తిరుగుబాట్లు అనే వ్యాసం, విశాలాంధ్ర వారు ప్రకటించిన పశ్చిమ గోదావరి జిల్లా సమాచార దర్శిని, పుట 251, 1991.
7. పై గ్రంథంలో శ్రీ పరకాల పట్టాభి రామారావు గారి వ్యాసం.
8. పై గ్రంథం, ఆంధ్ర వీరుడు అల్లూరి సీతారామరాజు వ్యాసం.
9. జాతీయోద్యమ భావానికి ఆధునిక కాలంలో బీజారోపణం చేసిన మహనీయుడు రూసో అని ప్రముఖుల అభిప్రాయం.
10. జాతీయగీతాలు, పుట 111.
11. పై గ్రంథం, పుట 116.
12. ఇంకా వివరాలకు యల్లాప్రగడ మల్లికార్జునరావు గారి అముద్రిత సిద్ధాంత వ్యాసం 'జాతీయకవి' దామరాజు పుండరీకాక్షుడు రచనలు- ఒక పరిశీలన- చూడవచ్చు.
13. లజపతిరాయ్‌ని ప్రశంసిస్తూ సుబ్రహ్మణ్య భారతి లజపతిరాయ్ తుది (స్తుతి), లాజపతిరాయిన్ ప్రలాపం అనే రెండు గేయాలు రచించారు. దేశీయ గీతంగళ్ (47, 48) భారతియార్ కవితైగళ్, పూంపుగార్

పడిప్పగం, మదరాసు 1990. చెరకువాడ వెంకట్రామయ్య, గాదె జగన్నాథస్వామిగారలు రచించిన లాలాలజపతిరాయి కావ్యం 1907 లో వెలువడింది. (తెలుగులో జాతీయోద్యమ కవిత్వం, పుటలు 120-1)

14. తెలుగు కవుల ప్రశంస జాతీయ గీతాలులో చోటుచేసుకుంది. వాళ్గ నీ ఎమ్మాన్ లేక మహాత్మాగాంధి పంచకం అనే గేయం భారతి లేఖినినుంచి వెలువడింది. తండ్రి, ప్రభువు అనే అర్థాలు ఎమ్మాన్ అనే మాటకు చెప్ప బడుతున్నవి. గాంధీజీని ప్రస్తుతిస్తూ నామక్కల్ రామలింగంపిళ్ళె ప్రభృతులు చక్కని గేయాలూ పద్యాలూ వ్రాశారు. మలయాళ మహాకవి వళ్లత్తోళ్ నారాయణమీనన్ ఎన్టె గురునాథన్ (నా గురునాథుడు) అని మహాత్ముని ప్రస్తుతిస్తూ వ్రాశారు.

15. వివరాలకు కా. దిరవియం రచించిన దేశియం వళర్ద తమిళ్ (పూంపుగార్ ప్రచురం ప్రెస్, మదరాసు 1974) గ్రంథం చూడవచ్చు. పుటలు 25 - 28. దిరవియంగారి, విమర్శలోని చివరిభాగం ఇలా సాగింది: 'మొత్తం మీద ఈ కవిత భారతిగారి నిష్కళంకమైన కవితా ప్రవాహంలో ఒక్క క్షణం కనిపించి మరుగున పడిపోయిన శ్రుతిభేదం అని చెప్పవలెనని అనిపిస్తున్నది........ఈ కవితను భారతి వ్రాశారని అంగీకరించడానికి మనస్కరించడం లేదని చెప్పడమే, భారతిగారి పట్ల మనం ప్రదర్శిస్తున్న మహత్తరమైన ఆదరభావానికి, అచంచలమైన అస క్తికీ, నిజానికి, ఒక ప్రబల సాక్ష్యం కాగలదు.'

16. చల్లా రాధాకృష్ణ శర్మ : గరిమెళ్ళ సాహిత్యం, పుట 40, 1989. 'ఏమయ్యో యువరాజా! ఎందుకొచ్చావయ్యో' అన్న యీ పాట ప్రస్తుతం ప్రచారంలో లేదని చెప్పాలి. జాతీయ గీతాలలోగాని, అభ్యుదయ సాహిత్య మాస పత్రిక ప్రకటించిన గరిమెళ్ళ స్వరాజ్య గీతములలోగాని ఈ పాట లేదు. (ఆగస్టు - సెప్టెంబరు, 1989), కాని ఈ పాట కొండపల్లి జగన్నాథ దాసుగారిదని జాతీయ గీతాలలో పేర్కొనబడింది. (గరిమెళ్ళ రచనగా కాదు, పుటలు 282 - 3.)

## అధ్యాయం 4

# దేశాభిమానం

మన మందరం ఒక్కటే అనే సమష్టిభావం, దేశాభిమానం జాతీయతలోని రెండు ప్రధానాంశాలు. ఈ అంశద్వయం జాతీయతా భావానికి దేహాత్మలవంటివి. దేశాభిమానం దేహమైతే, సమష్టిభావం ఆత్మవంటిది. ఈ రెంటిలో ఏ ఒక్కటి లోపించినా, జాతీయతా భావానికి భంగ మేర్పడుతుంది. ఈ రెండూ సమపాళ్ళలో ఉన్నప్పుడే అది ఆరోగ్యవంతుడైన మానవునిలా కనిపిస్తుంది. స్వాతంత్ర్యానురక్తి కూడా పేర్కొనదగిన అంశమే.

వంగ రాష్ట్ర విభజన ఫలితంగా భారతీయులలో నిద్రాణమై ఉన్న జాతీయతాభావం ఒక్కసారిగా పెల్లుబికింది. అణగి మణగి ఉన్న భారతీయుల దేశాభిమానం గంభీరంగా తలెత్తుకు నిలిచింది. అది చూసి అప్పటి తెల్లదొరల ప్రభుత్వం నివ్వెరపోయింది.

దేశంపట్ల అచంచలమైన ఆదరాభిమానాలు కలిగి వుండడం దేశాభిమాన మవుతుంది. ప్రతి వ్యక్తికీ సహజంగా అలవడే విశిష్టగుణ మిది! దేశాభిమానం తిష్ఠవేసుకోవడంతో దేశి సరుకులమీద గౌరవాభిమానాలు ఏర్పడటం సహజం. విదేశ వాసనలుగల వాటిమీద ఏహ్యభావం ఏర్పడడమూ సహజమే. కాగా మన దేశంలో స్వదేశీ యోద్యమం శక్తిమంతం కావడంలో ఆశ్చర్యం లేదు.

మొదటినుంచీ భారతీయులు రాజభక్తులన్నా, అది అతిశయోక్తి కాదు. దేశభక్తికన్నా రాజభక్తే ఎక్కువగా ఉండేది. ఆ రాజభక్తిని పురస్కరించుకుని వారు రాజుల కోసం రణరంగాలలో తమ ప్రాణాలను సైతం గడ్డిపోచలుగా భావించి అర్పించారు. రణరంగంలో అసువులు కోల్పోవడం వీర స్వర్గానికి సోపానమని వారు మనస్ఫూర్తిగా భావించారు. రాజు విష్ణ్వంశ సంభూతుడని విశ్వసించడంవల్ల, ప్రాచీన భారతీయుల దృష్టిలో రాజు పూజ్యుడు; విశిష్టుడు. రాజే వారికి దేశమన్నా సాహసం కాదు. రాజుని బట్టి ప్రజలు సంచరించిన కాల

మది! రాజు పరిపాలించే భూభాగం వారికి దేశం. అందువల్ల భారతదేశమన్న స్పృహ వారికి ఒకవేళ ఉండినా, తమ ప్రభువులు రాజ్యంచేసే భూభాగాలనే వారు తమ దేశాలుగా భావించసాగారు. అందులో వింత లేదు. కాలక్రమాన రాజులు మత్తులనీ, వారి సేవ నరకప్రాయమనీ ఎంచసాగారు. కనుక రాజభక్తి పరాయణులైన భారతీయులు కాలగతిని బట్టి దేశభక్తులుగా మారడం ఒక విశేషం కాదు.

వంగదేశ విభజనానంతరం వందేమాతరోద్యమం మొదలయింది. 1906 లో జరిగిన కాంగ్రెసు మహాసభలో బంకించంద్ర ఛటర్జీ (1838-1894) రచించిన ఆనందమఠం నవలలోని వందేమాతర గీతాన్ని జాతీయగీతంగా ఆమోదించడం జరిగింది. అది దేశమంతటా ప్రతిధ్వనించింది. వందేమాతరం అన్న నినాదానికి మందేరాజ్యమని తెలుగువారు జోడించారు. తెలుగువారి జాతీయాభిమానాన్ని కలకత్తా నుంచి వచ్చి దక్షిణాపథంలో పర్యటించిన బిపిన్ చంద్రపాల్ (1858-1932)[2] అనే ప్రముఖ దేశభక్తుని గంభీరోపన్యాసాలు సుసంపన్నం చేశాయి. 1907, ఏప్రిలు 19 నుంచి 24 దాక ఆయన రాజమహేంద్రవరంలో ఉపన్యసించారు. వాటిని చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు మనోహరంగా తెనిగించారు. చివరి రోజున చిలకమర్తివారు ఆశువుగా ఈ కింది పద్యం చెప్పారు:[3]

'భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి.'

భారత జాతీయోద్యమానికి సంబంధించిన తొలి తెలుగు పద్యమిది. కాని అంతకుముందే అలాంటి పద్యాలు కొన్ని తెలుగు పత్రికలలో వెలువడినట్లు తెలియవస్తున్నది.[4] ఇది గమనించదగిన అంశమే అయినప్పటికీ, ఆంగ్ల ప్రభుత్వాన్ని నిశితంగా విమర్శించిన తెలుగు జాతీయకవి చిలకమర్తివారనడం సత్యసన్నిహితం.

దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్ - అని దేశానికికొత్త నిర్వచనం ప్రసాదించిన గురజాడ వెంకట అప్పారావు (1861-1915) గారు దేశభక్తిని గురించి వ్రాసిన 56 పాదాల గేయం చిరస్మరణీయం. ఆయన మీద జాతీయోద్యమ ప్రభావం ఉన్నట్లు ఖచ్చితంగా చెప్పలేము. కాని ఆ ఉద్యమాన్ని ఆయన చిన్నచూపు చూడలేదు. అయితే ప్రముఖ మానవతావాది కావడంవల్ల, ఆయన ఎల్లలులేని దేశాన్ని తన దేశంగా భావించినట్లు నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు. నిజానికి ఆయన వెలయించిన దేశభక్తి గేయాన్ని ఏ దేశస్థులైనా హాయిగా పాడుకోవచ్చు. అంతేకాక, దేశాభిమానం అని స్పష్టంగా వాడిన మొదటి తెలుగు కవి గురజాడ అన్నా సాహసం కాదు. ఈసురోమని మానవులు సంచరిస్తే, దేశం బాగుపడదని స్పష్టం చేశారు. కనుక దేశాభివృద్ధికి వట్టి మాటలు కట్టిపెట్టి గట్టి కృషి అవసరమనీ ఆయన ఉద్బోధించారు.[5] దేశి సరుకుల ప్రాధాన్యాన్ని కూడా ఆయన తెలియజేశారు. బహుశః స్వదేశీయోద్యమం ఆయన్ని బహుధా ఆకర్షించి వుండవచ్చు. దేశి సరుకుల్ని ప్రోత్సహించాలని ఆయన అభిలాషించారు. దేశాభిమానం, దేశాభిమానం అంటూ వట్టి గొప్పలు చెప్పుకోకుండా ఏదైనా ఒక మేలు చేసి జనులకు చూపాలని ఆయన దేశాభిమానులకు మంచి సలహా యిచ్చారు. దేశాభిమానుల మంటూ వట్టి గొప్పలు చెప్పుకునే ఆషాఢభూతుల్ని చూసి అసహ్యం కొద్దీ ఆయన ఈ మాట చెప్పి వుంటారు.

ఈ విషయాధికం స్ఫురణకు వచ్చినప్పుడెల్ల, సుబ్రహ్మణ్య భారతి గేయం కపట దేశభక్తులు (నడిప్పు సుదేశిగళ్) స్ఫురణకు వస్తుంది. వట్టి మాటలంటేనూ కల్లకపటములంటేనూ గురజాడవలె ఆయనకికూడా తగని అసహ్యం. కల్లబొల్లి మాటలు చెబుతూ కాలహరణ చెయ్యడాన్ని ఆయన సహించలేకపోయారు. కార్యశూరులు కావాలనీ, చెప్పే మాటకూ చేసే చేతకూ మధ్య పొంతన ఉండాలనీ ఆయన అభిమతం ఇక కుహనా దేశభక్తుల్ని ఆయన అభివర్ణించిన తీరుని ఆయన మాటలలోనే పరిశీలిద్దాము.[6] 'నెంజిల్ ఉరమిన్ఱి నేర్మైత్తిఱమిన్ఱి....' అని ఆరంభమవుతుంది ఆ గేయం.

గుండెదిటవూ సత్యదృష్టి లేక
మాయమాటలు పలికేరు - చిలకా

వట్టి వదరుబోతులే వారు
గుంపుతో కలిసి అరిచేరు గాని
మనసుకేమీ పట్టించుకోరు - చిలకా
మరచి పోతారు వెనువెంటనే.

స్వరాజ్య సౌఖ్యం సమకూరేనా
గుడ్డివారికెపుడైనా - చిలకా
కలిగేనా షండలకు సంతోషం?

కళ్ళు కలిగీ చూడలేని
కబోదులే వారు - చిలకా
మాటలాడీ లాభమేముంది?

యంత్రశాల లంటారు మా గుడ్డ లంటారు
మంత్రాల కెపుడైన - చిలకా
మామిళ్లు నేలపై రాలేనా?

స్వదేశీ వస్త్రాలనీ ఉప్పనీ
కబుర్లు చెపుతూ తిరిగేరు - చిలకా
కార్యశూరులు మాత్రం కారు.

నారీ శీలమనీ దైవభక్తి అనీ
నాలుక వల్లెవేసేను - చిలకా
నమ్మకమేమో హుళక్కి.

మగువలకు మానభంగం జరిగితే
వట్టి దేబెల మాదిరి - చిలకా
తమ ప్రాణాలు దక్కించుకుంటారు.

అమ్మవారి గుళ్ళో అక్రమాలు జరిగితే
అసువులే గొప్పగా తలచి - చిలకా
అటూ ఇటూ పరుగులెత్తుతారు.

భయమూ ఆడియరి మోహం
బాగా తలకెక్కిన వారే - చిలకా
మూగ మనుషులే వారు.

దీక్షా భావం సత్యనిష్ఠా లేని
మనుషుల కొరకగడియైనా - చిలకా
మనుటకు యోగ్యత కలదా?

అభిమానం కన్న మనుగడే మిన్న
అనుకునే హీనులకు - చిలకా
ఆశ్రయ మన్నది దొరికేనా?

కల్లుమీద మనసుంచి శివ శివా అన్నట్లు
వందేమాతర మనేరు - చిలకా
మనసులో అది తలవరు.

పాత పాత అని పలికేరు గాని
పాత వర్ధిల్లిన తీరు - చిలకా
పామరులు వా రెరుగరు.

తోడబుట్టినవారు కడగండ్ల పాలై
కను మూసినా కూడ - చిలకా
కొంచెమైనా జాలి తలవరు.

కరువులూ జబ్బులూ వచ్చి తనవారు
అలమటించుట చూసి - చిలకా
ఉలకరూ మరి పలకరు.

కరువుకి లోనై తల్లి కటకటబడినా
నోరు తెరిచి ఊరికే - చిలకా
వందే మాతర మనేరు!

ఈ దీర్ఘ గేయం ద్వారా దేశాభిమానంగల భారతి హృదయం అభివ్యక్తమవుతుంది. మాతృ దేశాభిమానం గురించి ఆయన పెక్కు గేయాలు సంతరించడం సహజమే. అయితే ఆయన గురజాడలా ఏ దేశానికైనా వర్తించే దేశభక్తి గేయం వ్రాయలేదు.

భారతదేశాన్ని ప్రస్తుతిస్తూ దేశస్తుతి (నాట్టు వణక్కం), భారతదేశం (భారతనాడు), భారతదేశం (భారతదేశం), మాదేశం (ఎంగళ్ నాడు) అనే గేయాలు భారతి వెలయించారు. ఆయన వర్ణించిన మా దేశం ఇలా సాగింది.[7]

భారత వీరులు పుట్టిన దేశం
మును లెందరో నివసించిన దేశం
నారద గానం వెలసిన దేశం
మంచిని ఎప్పుడు పెంచే దేశం
తీరని జ్ఞానం వెలిగిన దేశం
బుద్ధుని కరుణా పొంగిన దేశం
భారతదేశం బహు ప్రాచీనం
పాడెద మెప్పుడు దీని ప్రశస్తిని!

అకలంక దేశభక్తుడైన భారతి దేశభక్తి గీతాలను సంకలనం చెయ్యాలని గాఢంగా అభిలషించారు. 1906, ఫిబ్రవరి 13న వెలువడిన స్వదేశమిత్రన్ పత్రికలో (సుదేశమిత్తిరన్) ఆయన యిలా ఒక విజ్ఞప్తి కూడా చేశారు:ః 'మన మాతృదేశమైన భారతాంబ ప్రశస్తిని అభివర్ణిస్తూ ఆంగ్లంలోనూ తమిళంలోనూ విభిన్న కాలాలలో వివిధ కవులు సంతరించిన పద్య రత్నాలను ఒక హారంగా గుచ్చి ప్రకటించాలని అభిలషిస్తున్నాను. అందువల్ల అఖండ భారతదేశాన్ని ప్రశంసిస్తూ తమిళ గ్రంథాలలో కానవచ్చే పద్యాలను విజ్ఞులు కనుక నాకు తెలియజేస్తే, వారికి నేను కృతజ్ఞుడనై ఉంటాను. తమిళ పురాణాలలోనూ ఇతిహాసాలలోనూ జానపద గేయాలలోనూ నిషధం, కోసలం వంటి దేశ భాగాలను అభివర్ణించే పద్యాలు లభించవచ్చు; అవి లాభరహితాలు. నేటి కాలపు తమిళ విద్వాంసులు కనుక కొత్తగా 'దేశభక్తి' గేయాలు వ్రాసి పంపితే వాటిని కూడా కృతజ్ఞతాపూర్వకంగా స్వీకరిస్తాను.'

భారతికి దేశభక్తి గీతాలు ఏవీ లభించకపోవడంతో, ఆయన ఆశాభంగం చెందారు. కనుక ఆయనే స్వయంగా దేశభక్తి గీతాలు రచించి జాతీయకవిగా రూపొందడం పేర్కొనదగిన అంశం.

ఆ మరు సంవత్సరం వి. కృష్ణస్వామి అయ్యర్ అనే సహృదయుడు భారతి రచించిన వందేమాతరం మందాము. నా తలిదండ్రులు, హిమాలయం అనే మూడు జాతీయగీతాలను ప్రచురించి, ఉచితంగా నలుగురికీ పంచిపెట్టారు.

1980లో భారతి జాతీయగీత సంపుటం స్వదేశ గీతంగళ్ (గీతాలు) వెలువడింది. ఇందులో వందేమాతరం, దేశస్తుతి, కపటదేశభక్తులు, లజపతి

రాయ్ స్తుతి, స్వాతంత్ర్య ప్రశస్తి మొదలైన 14 గీతాలు ఉన్నాయి, ఆ మరు సంవత్సరం జన్మభూమి అనే మరొక సంపుటం వెలువడింది. ఇందులో జాతీయ గీతం (అనువాదం), మా తల్లి, స్వాతంత్ర్య దాహం, స్వతంత్ర దేవీస్తుతి, శ్రీకృష్ణ స్తోత్రం మొదలైన 16 గీతాలు అందాలు దిద్దుకున్నాయి.

మొదట్లో భారతి శిష్యుడూ తరువాతి కాలంలో విప్లవ కవిగా, ద్రావిడోద్యమ కవిగా ప్రసిద్ధుడైన భారతిదాసన్ (అసలుపేరు కనక సుబ్బరత్నం, 1891 - 1964) భారతదేశాన్ని స్తుతిస్తూ కొన్ని కవితలు వెలయించారు. ఆయన దేశాన్ని తల్లిగా భావించి 1922, నవంబరులో దెయ్‌వీక త్తాయ్‌నాడు అనే కవిత ప్రచురించారు. దెయ్‌వీక త్తాయ్‌నాడు అనగా దైవతుల్యమైన మాతృదేశమని అర్థం. షణ్మతాలకు నాలుగు వేదాలకు, నాలుగు జాతులకు, సీత యశోద బుద్ధుడు సిద్ధులు నారద భగీరథులు చోళుడు చేరన్ కంబన్ ప్రభృతులకు తన దేశాన్ని తల్లిగా అభివర్ణించారు. ఒకచోట చైనీయ సింహాలకు తల్లి అని ఆయన పేర్కొనడం గమనించదగింది. అఖండ భారతాన్ని తల్లిగా భావించారు[9]

సర్వమూ ఆమె ఆకృతి - అయినా
దేశ వ్యామోహంలోనే నా జీవసం
ఆమె సౌందర్యాన్ని పరికించగా
కనిపించదు ఏ లోపం.

అని ఆయన పేర్కొన్నారు.

తెలుగునాడులో కూడా జాతీయ భావాలు బాగా జీర్ణించుకున్న కవులు పలువురు భారత మాతను వేనోళ్ళ ప్రశంసించారు. అఖండ భారతాన్ని వారు తమ తల్లిగా భావించారు. అయినా ఆ జాతీయ కవుల్ని గురించి పొరుగున ఉన్న తమిళ సోదరులకు కూడా సరిగా తెలియకపోవడం చింత్యం. మ.పొ. శివజ్ఞానం వంటి ప్రముఖ దేశభక్తుడూ రచయితా యిలా పేర్కొన్నారు:[10] 'ఆంధ్రదేశంలో ప్రసిద్ధికెక్కిన జాతీయ కవులు ప్రభవించలేదు. కాని స్వాతంత్ర్య సమరానికి దోహదం చేకూర్చిన పెక్కు కవితలు తెలుగు భాషలో సంతరించబడ్డాయి. అవి తమిళ దేశపు చెరసాలల్లో కూడా ప్రతిధ్వనించాయి.' ఇక తెలుగు కవుల జాతీయ గీతాలు పరిశీలిద్దాము.

గరిమెళ్ళ కావించిన మాతృస్తవం ప్రశంసార్హం.
ముప్పదికోట్ల జనమునకు మూలమాతవు
మూల మాతవు మా పాలి నేతవు

అని యితర జాతీయ కవులవలె చెప్పినట్లుగా, ఆయన భారతమాతను అహింసా పథగామినిగా చిత్రించారు. కనుకనే తన భావాన్ని ఇలా స్పష్టం చేశారు:

యుద్ధశకమును మాన్పునట్టి బుద్ధిశాలివి
బుద్ధిశాలివీ - అనిరుద్ధ ప్రజ్ఞవీ.

మంగిపూడి వేంకటశర్మ, చెన్నాప్రగడ భానుమూర్తి, మంగిపూడి పురుషోత్తమశర్మ, ఉమర్ ఆలీషా, దువ్వూరి రామిరెడ్డి, వడ్డాది సీతారామాంజనేయులు, పూడిపెద్ది కాశీవిశ్వనాథశాస్త్రి, జాషువా, గురజాడ రాఘవశర్మ, రాయప్రోలు సుబ్బారావు ప్రభృతులు భారతమాతను ప్రస్తుతిస్తూ కవితలూ గేయాలూ ఎన్నో వెలయించారు. కొందరు కవులైతే దేశాభిమానం, జాతీయత అని స్పష్టంగా పేర్కొన్నారు కూడా.

చెన్నాప్రగడవారు తమ మాతృవిలాపము అనే కవితలో వ్యక్తం చేసిన అభిప్రాయం ఈ కిందిది:

'కాన దేశాభిమానంబు కల్మి క్రైస్త
వులు ముసల్మానులును హిందువులును భార
సీలు నొక్క కుటుంబమై చేరి దేశ
మాత నుద్ధరయింతురు గాతఁ బ్రీతి.'

అలాగే ముట్నూరి వెంకట సుబ్బారాయుడు, మంగిపూడి వేంకటశర్మలు 1907 లో వ్రాసిన తమ వందేమాతరం కవితలో-

'దేశాభిమానంబు దీపింపజేయు మం
త్రంబు వందేమాతరంబు సుండు' అన్నారు.

వందేమాతరం ఉద్యమం వెలుగు చూసినప్పటినుంచీ దేశాభిమాన మనే మాట మన కవులకు మంత్ర సదృశ మయిందన్నా అతిశయోక్తి కాదు. జాతీయతాభావం సమృద్ధిగాగల మంగపూడివారు తమ మేలుకొలుపులో వందేమాతర నినాదం బలం పుంజుకున్నట్లు స్పష్టం చేశారు.[12]

'వేడుకను జాతీయతా యను
వేగుచుక్క పొడిచే నదిగో
కూడి "వందేమాతరం" బని
కుక్కుటము లరచెన్.'

భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో 1906 నుంచి 1920 దాక గల 15 సంవత్సరాల కాలాన్ని 'తిలక్ యుగం' అని చెప్పవచ్చుననీ, ఆ కాలంలోనే దేశాభిమానమూ భాషాభిమానమూ ఏకమైనాయని మ. పొ. శివజ్ఞానంగారు పేర్కొన్నది నిజమనిపిస్తుంది. ఈ సందర్భంగా సుబ్రహ్మణ్య భారతి చెప్పిన యీ మాటలు ఉదాహరించదగినవి:[13]

'గత శుభకృతు సంవత్సరంలో (1903-4) భారతదేశంలో సర్వ శుభాలకు జీవాధారమైన "దేశభక్తి" అనే నవ్యమార్గం వెలుగు చూసింది. కనుక దేశాభిమానాన్ని ప్రబోధించే గేయాలూ కవితలూ 1904 నుంచి ప్రచారంలోకి వచ్చినట్లు భావించవచ్చు. దేశభక్తి అనే యీ కొత్త మతానికి ఏకైక దైవం భారతమాత.......

'మనకు మంచి కలగాలంటే.... గ్రామ గ్రామంలోనూ భారతమాత ఆలయం అనే గుడి ఒకటి నిర్మించి, నిత్య పూజారి కైంకర్యాలు జరిగేందుకు ఏర్పాటు చెయ్యాలి.

'ధ్రువుడు, ప్రహ్లాదుడు ప్రభృతులు విష్ణువు పట్ల ప్రదర్శించిన భక్తినే మనం స్వదేశంపట్ల ప్రదర్శించాలని మన పత్రికలో చాలా సార్లు వ్రాశాము. భక్తికి గల ప్రాముఖ్యం తెలియని ఐరోపాలో కూడా ఐర్లండు దేశస్థులు మన దేశంలో ప్రబలమవుతున్న స్వదేశీ ఉద్యమాన్ని చూసి వాళ్లు కూడా స్వదేశీని ఒక మహాధర్మంగా (మతం) అనుష్ఠించాలని ప్రయత్నిస్తున్నారు. స్వామి వివేకానందులు, "నా భారత పుత్రులారా! ఇంకా ఒక శతాబ్దిదాక మీరు నమస్కరించవలసిన దైవాలు ఎవరంటే భారతదేశపు ముప్పయికోట్ల ప్రజలే. వారంతా మహాశక్తి హవిర్భాగాలు. వీళ్ళనే మీరు ఆరాధించాలి. వీళ్ళకే మీరు సేవ చెయ్యాలి. దీన్ని మించిన గొప్పమతం మరొకటి లేదు" అని ప్రబోధించారు.

'భారతదేశమంతా ఈ మతాన్ని స్వీకరించగా, తమిళులు మాత్రం కొంచెం వెనుకంజ వేశారు. ఇలా వెనకబడి వుండడం దోషం. తమిళులారా! ఈ దోషాన్ని మీరు త్వరగా భర్తీ చేసుకోకపోతే సర్వనాశన మవుతారు. వివేక వంతులై జీవించండి.' (ఇది భారతి స్థాపించి నిర్వహించిన ఇండియా పత్రికలో 1909, ఏప్రిలు 10 న ప్రచురితమయింది.)

కృష్ణాపత్రిక 1902లో వెలుగులోకి వచ్చింది. నాటినుంచీ ఆ పత్రికలో దేశభక్తి ప్రబోధాత్మకములైన రచనలు వెలువడడం ప్రశంసార్హం. గాడిచర్ల హరిసర్వోత్తమరావు, కొండా వెంకటప్పయ్య ప్రభృతులు పేర్కొనదగిన రచనలు చేశారు 1905 డిసెంబరు కృష్ణాపత్రికలో కొండా వెంకటప్పయ్యగారి సంపాదకీయం ఇలా పేర్కొన్నది:[14] 'నేడు సేతువు మొదలుకొని హిమాచల పర్యంతము వ్యాపించుచున్న దేశాభిమానమును చూడ మేము జీవించియున్నందు కెంతయు సంతసించుచున్నాము. ఆంగ్లేయుల పాలనలో 'వందేమాతరం' అను మాట బూతుగా మారినది. స్వదేశాభిమానులు అడవి మృగములవలె వేటాడబడు చున్నారు. ఘరానా మనుష్యులు బంట్రోతులుగా మార్చబడుచుండిరి.'

కొండా వెంకటప్పయ్యగారు ఒక్క తెలుగువారినే కాదు - భారతివంటి తమిళుల్ని కూడా ఉత్తేజితుల్ని కావించారు. 1917, జూన్ 9 న తెలుంగమగా సబై అనే శీర్షిక కింద 'శక్తి దాసన్' అనే లేఖినీ నామంతో భారతి ఒక వ్యాసం వ్రాశారు.[15] అందులో ఆయన యిలా అన్నారు: 'గత శుక్రవారంనాడు నెల్లూరులో జరిగిన ఆంధ్ర మహాసభ స్థలి (కొండా వారు అధ్యక్షులు) 'వందేమాతరం' అనే నినాదంతో ప్రతిధ్వనించిందని తెలియవస్తున్నది. కొన్నాళ్ళకు మునుపు కూడలూరులో జరిగిన ఒక మహాసభలో వందేమాతరం పాటకూడా పాడబడలేదని విన్నాను తెలుగు జిల్లాలలో ఒక సభ కూడా అలా జరగదు....'

జాతీయకవులు - తెలుగువారుగాని తమిళులుగాని - అఖండ భారతాన్నే స్వదేశంగా భావించి రచనలు చేయడం గమనించదగిన అంశం. కనుక దేశ మన్నప్పుడు ఆసేతు హిమాచల పర్యంతం వ్యాప్తమై సువిశాల దేశమే వారికి గోచరించింది. దేశభక్తి భావం తెచ్చిన గొప్ప మార్పిది!

'ఉదయాస్తాచల సేతు శీతనగ మధ్యోర్వి....' అని చెన్నాప్రగడ భాను మూర్తి,

'హిమగిరి శిఖరము - వింధ్యవనీంద్రము
కన్యాకుమారీ పదడిండీరము....'అని కవి కొండల వెంకటరావు,

'గంగా యమునా గౌతమి కృష్ణా కావేరీ జలపూతా
వింధ్య ముఖర పృథివీధర భరితా' అని మంగిపూడి వెంకటశర్మ,

'జలకంబు లాడించు చెలిక త్తెగద నీకు
కనకాంబు జాహ్నవి గంగా భవాని
తలమీది గుండు మల్లెల దండ గద నీకు
నత్యున్నతోరు హిమాలయంబు'

అని జాషువా ప్రభృతులు సర్వభారతాన్ని భారతమాతగా సందర్శించి, కమ్మని కవితలూ గీతాలూ సంతరించారు.

భారతదేశం అనే దీర్ఘ గేయం సంతరించారు సుబ్రహ్మణ్య భారతి. ఈ గేయంలో ఆయన సందర్శించింది సమైక్య భారతాన్ని; సువిశాల భారతాన్ని.16

రజత హిమాద్రి తిరిగేము
కడలిని ఓడలు నడిపేము
బడినేమో గుడిగా మలిచేము
భారతమని భుజాలు చరిచేము.

సింహళదీవికి సేతువు కట్టేము
సేతువునేమో వీధిగ తీర్చేము
వంగదేశపు మిగులు జలాలతో
మధ్య దేశంలో పైరు చేసేము.

సింధునదిని పండు వెన్నెలలో
చేరదేశపు వయసు కన్నెలతో
తేట తెలుగులో పాట పాడుతూ
పడవ నడిపి తిరిగి వచ్చేము.

గంగాతీరపు గోధుమ పంటకు
కావేరి తమలపాకులు ఇచ్చేము
సింహతుల్యులు మహారాష్ట్రుల కవితకు
చేరదేశపు దంతం బహూకరించేము.

కాశీ విద్వాంసులు జరిపే చర్చలు
కంచిలో ప్రతిధ్వనించగ చేసేము
రాజపుత్ర వీరాగ్రణులకు
కన్నడపు పసిడిని కానుక యిచ్చేము.

ఆయుధాలు చేసేము కాగితం చేసేము
కర్మాగారం కళాయతనం నెలకొల్పేము
అలసత్వం విడిచేము తలయెత్తుకు తిరిగేము
సత్యము చెప్పేము చక్కని పనులు చేసేము.

జాతులు రెండే రెండని చాటి
అవ్వ పలుకులనే అమృత మనేము
నీతిని పాటిస్తూ పరులకు తోడ్పడుతూ
నివసిస్తే పైవారు; ఇతరులు కిందివారు.

(అవ్వ అనగా సుప్రసిద్ధ ప్రాచీన తమిళ కవయిత్రి అవ్వైయారు.)

ఇలా భారతదేశపు వైభవాన్ని స్పష్టం చేస్తూ నిర్మాణాత్మకములైన సూచనలు కావిస్తూ ఆనాళ్లలో భారతిలా కవిత చెప్పిన కవులు పలువురు లేరనడం అతిశయోక్తి కాదు. ఒక ప్రాంతంలోని మిగులు జలాలను మరో ప్రాంతంలో వ్యవసాయానికి వినియోగిద్దాము, సింహళదీవికి సేతువు నిర్మిద్దాము వంటివి ఆ మహాకవి చేసిన చక్కని సూచనలు.

ఇలా గీతాలలోనే కాక వ్యాసాలలో కూడా భారతి సర్వభారతాన్ని తన మాతృదేశంగా భావిస్తూ అమూల్య విషయాలు ఉదాహరించారు. పునర్జన్మం అనే వ్యాసంలో (పుట 3) ఆయన పేర్కొన్న అంశాలు మననం చేసుకోదగినవి. జాతీయ సంపద అనే అర్థంలో ఆర్యసంపద అని ఆయన ఉపయోగించారు. కాళిదాసు సంస్కృత భాషలో వ్రాసినా, తులసీదాసు హిందీలో వ్రాసినా, కంబకవి తమిళంలో రచించినా, త్యాగరాజు తెలుగులో పాడినా - అవన్నీ ఏ ఒక్కరివీ కావు, ఏ ప్రాంతం వాడివీ కావు, ఏ భాష వాడివీ కావు - అవన్నీ సర్వ భారతానికి చెందినవని ఆయన చెప్పడం గుర్తుంచుకోదగింది. అలాగే భారతావనిలోని శిల్ప కళా ఖండాలు మొదలైనవి కూడా. ఈ అఖిల భారతదృష్టి భారతిని జాతీయ కవిగా తీర్చిదిద్దిందనడంలో అణుమాత్రమైనా సందేహం లేదు.

భారతివలె, చెన్నాప్రగడ భానుమూర్తిగారు కూడా సర్వ భారతాన్ని మనస్సులో ఉంచుకుని చక్కని సూచనలు చేశారు. సాగరగాములైన నదుల్ని బంధించాలనీ, కాలువలు తవ్వాలనీ, రథ్యలు నిర్మించాలనీ ఆయన అభిలషించారు. అలనాటి సేతు రచనా నైపుణ్యం కనిపించాలనీ ఆశించారు. ఆయన మాతృ విలాపంలోని ఈ కింది పద్యం పరిశీలనార్హం:

సదయత్వంబున నాటి సేతు రచనా నైపుణ్య మేపారగా
నదులన్ సాగరగాములన్ పథమునన్ బంధించి వంధ్యోర్విస
స్యద గావింపగఁ గుల్య లేర్పరచి, రథ్యా శ్రేణి నిర్మించి సౌ
ఖ్యదమై పొల్చు స్వరాజ్య మీయవని స్థైర్య స్ఫూర్తి వర్ధిల్లుతన్.

మన జాతీయ కవుల ఆశయాలన్నీ నెరవేరకపోవడం మన దురదృష్టం. ఎప్పటికైనా మన దేశంలోని నదీ నదాలు జాతీయమవుతాయని ఆశిద్దాం! భారతి, భానుమూర్తి వంటి జాతీయ కవులు ఆశించినట్లుగా నదులు సాగరగాములు కాకుండా ఆ జలాలను సద్వినియోగం చేసుకోవలసిన అవసరం రోజు రోజుకీ పెరుగుతున్నది.

ఈ విశాల దృక్పథంతోనే భారతి భారతీయుల్ని గురించి యిలా అన్నాడు, పునర్జన్మం వ్యాసంలో:17

'గంగానదిలో కలిసే కాలువలన్నీ గంగానదిగా మారిపోతాయి. భారత దేశానికి వచ్చి యిక్కడ తరతరాలుగా నివసిస్తున్న వారందరూ ఈ దేశ ప్రజలవుతున్నారు.'

భారతి యింత స్పష్టంగా చెప్పిన యీ భావాన్ని గరిమెళ్ళ యిలా వ్యక్తం చేశారు: 'ఎవరెన్ని చెప్పిన హిందూదేశ వాసు- లేక సోదరులె సుండీ!' భారతీయులు ఏక సోదరులే అన్నారు గరిమెళ్ళ నిర్ద్వంద్వంగా. ఎవరెన్ని చెప్పినా అన్నది కండగల మాట!

సూత్రప్రాయంగా గరిమెళ్ళ చెప్పిన యీ మాటలకు వ్యాఖ్యలా కానవచ్చే యీ కింది గీతాన్ని భారతి అంతకుముందే వెలయించారు.

'ఎన్నో జాతులు మనలో ఉండేను
ఏమది న్యాయం ఇతరుల జోక్యం?
ఒక తల్లి పిల్లలు కలహించుకున్నా
అన్నదమ్ములే వారెన్నటికీ.'

అఖండ భారతదేశాన్ని సందర్శించిన గరిమెళ్ళకు భారతదేశం రెండు ముక్కలయినప్పుడు బాధాకరంగా కనిపించడంలో వింతయేమీ లేదు. 'అఖండ హిందూస్థాన స్వప్నం ఆఖరు కిట్లడుగంటింది' అన్నారు- **1947, జూన్ 8** ఆనందవాహినిలో ప్రచురితమైన 'చీలికలు' అనే గేయంలో.

అఖండ భారతమే మా దేశం అనే భావాన్ని వానమామలై వరదాచార్యులు గారు మధుర మోహనంగా పేర్కొన్నారు, తమ 'మా దేశం' గేయంలో.

ఆసేతుహిమాచల పర్యంతం బాసర్వస్వము మా దేశం
ఆచంద్రార్కం బా నందనవన మంకితమయ్యేను మా కోసం
.... .... ....
హిమాద్రి మొదలుగ కుమారి వరకు హిందూస్థానం మా దేశం
సమస్త భాషా జాతి మతసరిత్ సంగమ జలనిధి ఈ దేశం.

పొంగులు వారే దేశాభిమానంతో రాయప్రోలు సుబ్బారావు గారు (**1892-1984**) జన్మభూమి గేయం వ్రాసినట్లు నిస్సందేహంగా పేర్కొనవచ్చు. ప్రతి పాదమూ ఇందుకు ప్రబల సాక్ష్యమిస్తుంది.

ఏ దేశమేగినా ఎందు కాలిడిన
ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనిన
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము
.... .... ....
జనియించినాడ వీ స్వర్గఖండమున
.... .... ....
అవమానమేలరా? అనుమానమేల?
భారతీయుడ నంచు భక్తితో పాడ!
మొదలైన పాదాలలో స్వచ్ఛమైన దేశాభిమానం కనిపిస్తున్నది.

స్వేచ్ఛారాహిత్యం, పేదరికం, కరవుకాటకాలు మొదలైనవి ప్రముఖంగా గోచరించే అస్వతంత్ర భారతంలో దేశాభిమానం గల కవికి ప్రాచీన భారత దేశపు వైభవం కండ్లకు కట్టినట్లుగా కనిపించడం ఆశ్చర్యం కాదు. వర్తమాన భారతం కన్నీటి కథగా కనిపించినప్పుడు, గతకాలపు వైభవాన్ని స్ఫురణకు తెచ్చుకోవడం అసహజం కాదు. ఈ విషయమై ప్రస్తావిస్తూ తన కాలం వారికి ఇలాంటి జాతీయభావం అనివార్యమయిందనీ, అది సహజమూ, ఆరోగ్యకరమూ అయినదనీ జవహర్‌లాల్ నెహ్రూ తమ రచనలో పేర్కొన్నారు.[18] ఈ సహజమైన భావంతోపాటు వ్యతిరేక సూచకమైన భావమూ జాతీయభావంలో లేకపోలేదనీ ఆయన పేర్కొన్నారు.

'లేదురా ఇటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి పౌరు లింకెందు'

అని రాయప్రోలువా రన్నప్పుడు, ఆ పాదాలలో దురభిమానం కొంచెం తొంగి చూస్తున్నదని కొందరు భావించవచ్చు

అలాగే సుబ్రహ్మణ్య భారతి-
'మాకు తెలిసిన భాషలలో
మరెక్కడా కనిపించదు
తమిళంలా మధురమైనది
.... .... .... ....
మాకు తెలిసిన కవులలో
కంబరు వళ్లువరు ఇళంగోలవలె
జగతిలో ఎక్కడా జన్మించలేదు
ఇది సత్యం; వట్టి ప్రశంస కాదిది'[19]

అన్నప్పుడు కొంచెం దురభిమానం కనిపిస్తున్నట్టుగా తోచవచ్చు. కనుకనే కాబోలు రవి కవీంద్రులు జాతీయ భావాన్ని అంతగా సమర్థించలేదు. జాతీయవాదంలోని ఈ వ్యతిరేక సూచకమైన భావం దురభిమానానికి దారి తీస్తున్నదని చెప్పవచ్చు. అయినా అస్వతంత్ర దేశంలో నివసించే కవికి స్వదేశమన్నా, స్వభాష అన్నా అభిమానం మోతాదుకి మించి వుండడాన్ని దోషంగా భావించడం అసమంజసమేమో!

జాతీయ కవులు పలువురు గత వైభవాన్ని పలువిధాలుగా ప్రశంసించారు. కాని గురజాడ అప్పారావుగారు మాత్రం 'మంచి గతమున కొంచెమేనోయి' అని పేర్కొని ముందడుగు వెయ్యమని ప్రబోధించారు.

సకల పురాణేతిహాస సారభరితవు
సార భరితవు, ఓంకార మహితవు - అని గరిమెళ్ళ అనగా
శ్రీలు పొంగిన జీవ గడ్డయి
పాలు పారిన భాగ్య సీమయి
వ్రాలినది ఈ భరత ఖండము
భక్తి పాడర, తమ్ముడా - అని రాయప్రోలు చెప్పగా,
ఊర్వి పుట్టక ముందె నీవుంటివేమొ
సకల పురాణ శాస్త్రముల్ చదివినావు - అని జాషువా పేర్కొనగా,
దిక్కులన్నీ వెదకినా నీవంటి దేశమేదీ, పుడమిపై
ఎంత చక్కని తల్లివే, రాణివే యెల్లభూములకు - అని కాటూరి వేంకటేశ్వర రావు భావించగా.

నిన్ను నెన్నతరమా, నిరుపమాన భరతమాత
మిన్ననై యఖిల భూముల - అని మంగిపూడి వెంకట శర్మ అనగా,
సింధు గంగానదీ జలక్షీర మెప్పుడు
గురిసి బిడ్డల పోషించుకొనుచున్న
పచ్చి బాలెంతరాలు మా భరతమాత
మాతలకు మాత సకల సంపత్సమేత - అని జాషువా భరతమాతను ప్రస్తుతించారు.

భారతదేశం బహు ప్రచీనమైనదే కాక మంచిని పెంచే దేశమంటూ భారతి మా దేశం అనే గేయం సంతరించారు.

భారతిని అనుసరిస్తూ భారతిదాసన్ చేసిన భారతదేశ ప్రశస్తి యిలా సాగింది:

కాళికా దేవిని కలలో దర్శించిన
కంబకవి ప్రభవించింది ఈ దేశమే
ఖగోళశాస్త్ర విజ్ఞానం యావత్తు
ఆ భాస్కరుని ఉపదేశమే-20 (భాస్కరాచార్యుడు)

ఆయనే మరొకచోట ఇలా పేర్కొన్నాడు:21

ప్రకాశించే హిమాలయం ఉత్తరాన
ప్రసిద్ధి కెక్కిన కుమారి దక్షిణాన
మంచిని కూర్చే కొండల వరుసలు
మరి రెండు ప్రక్కల నెలకొన్నాయి
భారతదేశం
ప్రాచీనత సంతరించుకున్న దేశం
ప్రస్తుతించు తమిళనాడుని.
మునుపూ కవుల ప్రశంసల నందుకున్నది
ముప్పయికోట్ల మందిని కన్నది
తల్లి వర్ధిల్లాలని ప్రస్తుతించి
నెలకొన్న వైరభావం తగ్గించి
ఉత్సాహంగా అధిగమించు
ధారుణిలో పరాక్రమం గల
భారత పుత్రుడనని చెప్పు!

మన జాతీయ కవుల దేశాభిమాన స్రవంతి రెండు పాయలుగా ప్రవహించింది: ఒకటి స్వదేశ సంస్తుతి. రెండవది స్వరాష్ట్ర ప్రశస్తి. అయినా వారు వేర్పాటు వాదాన్ని ప్రోత్సహించలేదు. వారి కవితలకూ గేయాలకూ జాత్యభిమానం ప్రాణం పోసింది. ఆ అభిమానం దురభిమానం కాలేదు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రాన్ని కోరిన తెలుగు నాయకులు గాని, ఆంధ్ర రాష్ట్ర ప్రాధాన్యాన్ని వ్యక్తం చేస్తూ రచనలు వెలయించిన కవులు గాని అఖండ భారతాన్ని విస్మరించకపోవడం ప్రశంసార్హం. తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకోడానికీ, అభివృద్ధిని సాధించడానికీ వారు స్వరాష్ట్రం అభిలషించారని నిస్సంశయంగా చెప్పవచ్చు. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు 1912 ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో వ్రాసిన యీ విషయాదికం పరిశీలనార్హం. 'తరుణ మాసన్నమయినప్పుడు చెన్నపురి రాష్ట్రములోని ఆంధ్ర మండలంబులు ప్రత్యేక రాష్ట్రముగ నేర్పాటు చేయుట ముఖ్యమని తోచుచున్నది. ఈ రాష్ట్ర నిర్మాణమువలన నాంధ్రదేశమున నొక ముఖ్య పట్టణ మేర్పడ గలదు. అది భాషాభివృద్ధికిని నిలయము కాగలదు. తీక్ష్ణ స్పర్ధవలన నింతవర కాంధ్రులు వెనుకబడి యుండుటకు గల కారణ

మంతరించగలదు. జాతీయైక్యము నభిలషించు నీ కాలములో ప్రత్యేక జాతీయ రాష్ట్ర నిర్మాణము హానికరమని కొందరన వచ్చును. కాని యీ యూహలో సత్యము లేదు.'

ఆంధ్ర రాష్ట్రం ఆశించినవారు దేశాభివృద్ధి లక్ష్యాన్ని విడనాడలేదనడానికి కాశీనాథుని వారి మాటలే సాక్ష్యం!

భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణాన్ని సిద్ధాంతరీత్యా సుబ్రహ్మణ్య భారతి కూడా సమర్థించినట్లు చెప్పవచ్చు. అందుకు 1917, జూన్ 9 న తెలుంగమగాసబై (ఆంధ్ర మహాసభ) అనే శీర్షికతో ఆయన వ్రాసిన వ్యాసం నిదర్శనం. అందు లోంచి కొన్ని భాగాలు ఉదాహరిస్తున్నాను.[22]

'పై సభలో (ఆంధ్ర మహాసభలో) శ్రీవెంకటప్పయ్యగారు చేసిన ఉపన్యాస సారాంశాన్ని ఇక్కడ మనవి చేస్తున్నాను.

1. తెలుగు దేశాన్ని ప్రత్యేక రాష్ట్రంగా చేయాలి.

2. ఇండియాకి స్వతంత్ర పరిపాలనాధికారం సంక్రమించాలి.

3. వీలయినంతవరకు, భాషల ప్రాతిపదికను పురస్కరించుకొని ఇండియాని వివిధ రాష్ట్రములుగా విభజించాలి. అనగా, మదరాసు, బొంబాయి, సంయుక్త రాష్ట్రములు, మధ్యప్రదేశము, పంజాబు, బెంగాల్ అనే వాటిని తమిళనాడు, తెలుగునాడు, మహారాష్ట్ర దేశం, కన్నడనాడు, హిందూస్థానం, వంగదేశం - అని భాషల వారీగా విభజించాలి.

4 మాతృభాషలోనే విద్యాబోధన జరగాలి. ప్రభుత్వ కార్యకలాపాలు కూడా మాతృభాషలోనే జరగాలి.

పై నాలుగు అంశములలో మొదటిది, మూడవది, నాలుగవది - ఈ మూడూ కలిసి ఒక భాగం. రెండవ అంశం మరొక భాగం. రెండవది మాతృక అయితే, మొదటి భాగం పుత్రిక అనవచ్చు.

నా దృష్టిలో పై నాలుగు అంశములూ న్యాయ సమ్మతములే. అయినా ప్రస్తుత పరిస్థితులలో తెలుగునాడని ప్రత్యేక రాష్ట్రంగా విభజించడం కంటె ఆసేతుహిమాచల పర్యంతం గల హైందవు లందరూ ఒక్కటే అనే మూల మంత్రాన్ని పునశ్చరణం చెయ్యడమే ప్రస్తుత కర్తవ్యమని నేను భావిస్తున్నాను.'

కనుక ఆనాటి జాతీయ వాదులు భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణాన్ని సమర్థించినా, మాతృభాషకు వివిధ రంగాలలో సముచితస్థానం లభించాలని అభిలషించినా, వారి ప్రధాన ధ్యేయం భారతదేశపు స్వాతంత్ర్యం.

తమిళ భాషా సాహిత్యాలనూ తమిళనాడునీ భారతి ఎంత గాఢంగా ప్రేమించినా, ప్రశంసించినా, ఆయనది ద్వేష రహితమైన మాతృభాషాభిమానం.

సెందమిళనాడని విన్నంతనే - స్రవించు
కమ్మ తేనెలు శ్రవో యుగళి - అనీ,
కవితకు వాసికెక్కిన తమిళనాడు
కీర్తి కంబడు ప్రభవించిన తమిళనాడు - అనీ
భారతి తమిళనాడుని ప్రశంసించాడు

ప్రయత్నించాలి మధుర తమిళవాణి
ప్రపంచ మంతటా వ్యాపించేలా - అని పేర్కొన్న ఆయనే యిలా అన్నాడు:[23]

తమిళంలోకి తర్జుమా కావాలి
పరదేశాల పండితుల రచనలు
తమిళంలో సంతరించాలి మనం
శాశ్వత కీర్తి నిచ్చే కొత్త రచనలు.

భారతిది అభ్యుదయ దృష్టి! తమిళవాణి ప్రపంచ పరివ్యాప్తం చెందాలని ఆశించినట్లుగానే, తమిళంలో అనువాదాలు, కొత్త రచనలూ వెలువడాలని ఆయన అభిలషించారు.

ఇంకా సుబ్రహ్మణ్యశివా, వ. ఉ. చిదంబరం పిళ్లై, వ. వే. సు. (సుబ్రహ్మణ్య) అయ్యరు, నామక్కల్ కవి ప్రభృతులు తమిళభాషను, తమిళులను బహు భంగుల ప్రశంసించారు. తమిళుక్కు అముదెన్రు పెయర్ (తమిళమునకు అమృతమని పేరు) అని భారతిదాసన్ పేర్కొనగా, తమిళుడనని చెప్పరా, తలెత్తి నిలబడరా - అని నామక్కల్ రామలింగం పిళ్లై ఉద్బోధించారు. ఆయన దృష్టిలో అమృతం తమిళుని భాష. సంస్కృత పండితుడైన యస్. సత్యమూర్తి

వంటి జాతీయ నాయకుడు కూడా తమిళ గీతాలు పాడాలని అభిలషించారు. ఆయన అన్నారు గదా: 'తమిళ దేశపు తమిళులకు పాటలను తమిళంలోనే పాడాలి', 'తమిళనాడులో గాయకులు పాట కచేరీలలో తమిళ పాటల్ని ఎక్కువగా పాడాలని నేను అర్థిస్తున్నాను'. ఆ రోజుల్లో తమిళనాడు కాంగ్రెసు కమిటీ ఆధ్వర్యంలో మదరాసులో సంగీతోత్సవం జరిగేది! ఇది ఆశ్చర్యంగా కనిపించవచ్చు. సత్యమూర్తిగారి మాటలలోనే ఈ విషయం గురించి చెప్పడం సముచితం.[24] 'స్వరాజ్యోద్యమంలో ఒక భాగమే కళా పునరుజ్జీవనం. కాగా కాంగ్రెసు ఇందులోనూ శ్రద్ధ వహిస్తున్నది. అందువల్ల తమిళనాడు కాంగ్రెసు కమిటీ ఈ సంగీతోత్సవాన్ని ఏర్పాటు చేసి, జాతీయ జీవనపు వివిధ రంగాలలోనూ నవచైతన్యం కల్పించడంలో తనకు గల ఆసక్తిని వ్యక్తం చేసుకుంటున్నది....సంగీతాన్ని సాధనంగా చేసుకునే స్వాతంత్ర్యానురక్తితో అభివృద్ధి చెందాలని మనవి చేస్తున్నాను. ఈ నిజాన్ని అంగీకరిస్తున్నందుకు గుర్తుగా తమిళనాడు కాంగ్రెసు కమిటీ ఈ ఉత్సవాన్ని జరుపుతున్నది.'

భారతి వంటి ప్రముఖ జాతీయ కవి తమిళ సంగీతోద్యమానికి అంకురార్పణ చేశారన్నా అతిశయోక్తి కాదు. ఇక ఆయన మాటలనే అవధరించండి:[25]

"నేను పుట్టినప్పటినుంచీ నేటిదాకా చూస్తూనేవున్నాను. పాట కచేరీ ప్రారంభమవుతుంది. విద్వాన్ (గాయకుడు) 'వాతాపి గణపతిం' అని ఆరంభిస్తాడు. 'రామ నీ సమాన మెవరు', 'మరియాద కాదురా', 'వరము లొసగి'.... అయ్యయ్యో కథ ఒకటే.

"ముత్తుసామి దీక్షితర్, త్యాగయ్యర్, పట్టణం సుబ్రహ్మణ్య అయ్యర్ - ఈ ముగ్గురి కీర్తనల్నే ఎక్కువగా పాడుతున్నారు. వీటిలో దీక్షితరు కృతులు కేవలం సంస్కృతంలో వ్రాయబడినవి. ఇవి గంగానదిలా గంభీరపు నడకనే కలిగి ఉదాత్తంగా ఉంటాయి. మరికొన్ని మంచి లక్షణాలు వీటిలో ఉన్నా, సంస్కృతంలో వ్రాయబడిన కారణాన మనదేశపు జనులు రసానుభవంతో పాడేందుకు ఇవి ఉపయోగపడవు. తమిళ సభలలో అర్థం తెలియని ఇతర భాషలలో పాత పాటల్ని పదే పదే పాడడం న్యాయం కాదు. అందువల్ల మన జాతి సంగీత జ్ఞానాన్ని కోల్పోవడం జరగవచ్చు."

భారతి సమకాలికుడూ మిత్రుడూ అయిన సుబ్రహ్మణ్య శివా అనే జాతీయవాది భారతదేశాన్ని తన తల్లిగా భావించాడు. అంతేకాదు. భారత మాతకు ఆలయం కూడా నిర్మించదలచాడు. వేదాంతి, సంస్కృత భాషా భిజ్ఞుడూ అయిన ఆయన 'సచ్చిదానంద శివం' అనే వేదాంత గ్రంథం తమిళంలో వ్రాశారు. శివా ప్రముఖ తమిళ భాషాభిమాని కూడా! ఆయన మాతృభాషాభి మానాన్ని గ్రహించేందుకు ఈ క్రింది పంక్తులు తోడ్పడతాయి:[26]

'తమిళ పండితులారా! తమిళ మహాజనులారా! జాగ్రత్త! జాగ్రత్త! మీ భాషను కాపాడుకోండి. ఒక జన సమూహానికి అదే ప్రాణం. తమిళ భాష కనుక నశిస్తే, తమిళుల ప్రాభవమూ ప్రశస్తీ నశిస్తాయి. తమిళంలో కావలసినన్ని మాటలు లేవని నోరు నొవ్వకుండ పలుకుతున్న భారత పుత్రులకు ఆ శబ్దాలను పరిశీలించి తెలియజెయ్యండి. సరిఅయిన శబ్దాలు కనుక లేకుంటే, తమిళవాణి కృపా బలంతో శబ్దాలు కల్పించి యివ్వండి. మీ నాలుక తమిళమే మాట్లాడు గాక! మీ లేఖిని తమిళమునే వ్రాయుగాక! మీ హృదయం తమిళమందే లగ్న మగును గాక! మీ యందరినీ తమిళ జనని దయతో రక్షించును గాక.'

తమిళ జాతీయ కవులతో పోల్చి చూసినప్పుడు, తెలుగు జాతీయ కవుల మాతృ భాషాభిమానం ప్రస్ఫుటంగా కనిపించకపోవచ్చుగాని, తెలుగువారి స్వీయ భాషాభిమానాన్ని మాత్రం శంకించడం అసమంజసం. తెలుగులో గ్రాంథిక వ్యావహారిక వాదాలు ప్రబలినంత తీవ్రంగా తెలుగు భాషోద్యమం తీవ్రరూపం దాల్చలేదు. అచ్చతెనుగు రామాయణం వంటి కొన్ని కావ్యాలు వెలుగు చూసినా, అవి ప్రజల్ని ఆకట్టుకోలేకపోయినాయి. పైగా తెలుగు కవులు మొదటి నుంచీ ఉభయ భాషా పండితులు. సంస్కృతాంధ్రాలు క్షీరోదకాల వలె కలిసి మెలిసి పోవడంవల్ల, తెలుగులో భాషోద్యమం తీవ్రరూపం దాల్చలేదనవచ్చు. అలా అని తెలుగు కవులకు స్వీయ భాషాభిమానం తక్కువని చెప్పడం సరికాదు. అంతే కాదు, కొందరు భాషను సంస్కృతమయం చేయడాన్ని పాల్కురికి సోమ నాథాది కవులు నిరసించారని నిస్సంశయంగా చెప్పవచ్చు. తెలుగు మాటల్ని వేదోక్తులుగా ఆదరించాలని పాల్కురికి పండిత లోకాన్ని అర్థించాడు.[27] సర్వ సామాన్యమైన తెలుగును ఉపయోగించాలన్నది ఆయన అభిమతం. ఒకప్పటి

మాటయేమో కాని, తెలుగు జాతీయకవులు వీలయినంతవరకు సర్వసామాన్యమైన భాషనే ఉపయోగించారు. ముఖ్యంగా గరిమెళ్ల వాడుక తెలుగును బాగా వాడుక చేశారు.[28] అందువల్ల భాషోద్యమానికి తెలుగునాడులో తగినంత ప్రచారం లభ్యం కాలేదు.

ఆంధ్రోద్యమ ప్రభావం తెలుగు జాతీయ కవులమీద ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. 'స్వాతంత్ర్యోద్యమ ప్రభావం వల్ల వచ్చిన కవిత్వం కంటె బృహత్తరంగా వచ్చిన ఆంధ్రోద్యమ కవిత్వం ప్రత్యేక పరిశోధనకు తగినట్టిది' అనీ 'ఆంధ్రాభిమాన కవిత్వానికి బీజారోపణ చేసిన ఘనత మంగిపూడి వేంకటశర్మ గారిదే' ననీ మద్దూరి సుబ్బారెడ్డిగారు పేర్కొన్నారు.[29]

సుబ్బారెడ్డిగారి మాటలు సత్య సన్నిహితాలు. ఆంధ్రోద్యమ కవిత్వం ప్రత్యేక పరిశోధనకు అర్హమైనదే. ఆంధ్ర జాతీయ సంబంధ రచనలు చుబ్బన చూరలే. అయినా స్వాతంత్ర్యోద్యమ కవితకు గాని, ఆంధ్రోద్యమ కవితకు గాని ప్రధాన కారణం దేశాభిమానమే. తెలుగునాడు, తమిళనాడు అని పేర్కొన్నా, ఇవి రెండూ విశాల భారతంలోని అంతర్భాగాలే. తెలుగు సాహిత్యమన్నా. తమిళ సాహిత్యమన్నా - ఇవి రెండూ భారతీయ సాహిత్యంలోని అంతర్భాగాలే. తెలుగు, తమిళం మొదలైన భాషలు భారతీయ భాషలని మనం వ్యవహరిస్తున్నట్టుగానే, తెలుగు తమిళ దేశాలు మొదలైనవి సువిశాలమైన భారత భూభాగాలే. ఈ విషయం విస్మరించరానిది. కనుక స్వాతంత్ర్యోద్యమ కవిత బృహత్తర మైనదని స్పష్టంగా చెప్పవచ్చు.

రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, తుమ్మల సీతారామమూర్తి, కొడాలి సుబ్బారావు ప్రభృతులు ఆంధ్ర జాతీయాభిమాన కవితలూ గేయాలూ ఎన్నో సంతరించి దేశాభిమాన కవిత్వానికి గట్టి పునాదులు వేశారు.

> నాదు జాతి నా దేశము నాదు భాష
> అను అహంకార దర్శన మందు మాంధ్ర-

అని రాయప్రోలువారు ఉద్బోధించారు. జారిన దేశ గౌరవాన్ని చక్కదిద్దాలనే ఉదారాశయంతోనే ఆయన యీ ప్రబోధం చేశారు. ఒక్కొక్కసారి మితిమీరిన

అహంకారం ద్వేషభావానికి దారి తీయవచ్చు. అయినా ప్రతి వ్యక్తికీ నా భాష, నా జాతి, నా దేశం అనే అహంకారం కొద్దిగానో గొప్పగానో ఉండాలి. కనుకనే తెలుగుదేశపు గత వైభవాన్ని తెలుగువీరుల శౌర్య సాహసాలను మన కవులు గుర్తు చేశారు. విశ్వనాథగారు కూడా ఆంధ్రుల పౌరుషాన్ని అక్షర బద్ధం చేశారు. తుమ్మల, పెన్మెత్స సత్యనారాయణరాజు, కొడాలి సుబ్బారావు ప్రభృతులు పూర్వాంధ్ర వైభవాన్ని గుండెకు హత్తుకునేలా అభివర్ణించారు.

తెలుగు దేశాభిమానంతోపాటు తెలుగు భాషాభిమానాన్ని కూడా మన కవులు ప్రకటించారు.

పాలక్రొమ్మీగడ, మకరందకణములు, పుష్పలావణ్యం, సెలయేటి ఒయ్యారం మొదలైనవాటి సమ్మిశ్రమే తెలుగని రాయప్రోలు వారు తెలుగు భాషా మాధుర్యాన్ని కీర్తించారు. తమ రాష్ట్రగానంలో తుమ్మలవారు కూడా తెలుగు తీపిని ప్రశంసిస్తూ, 'ఎల్లఖండమ్ములవారి మెప్పులే సాక్ష్యము'లని పేర్కొన్నారు. మాతృభాషా రమణిని భజించుటకు సంబర మందని జాతి చచ్చు జాతి అన్నారు. 'శబ్ద శాసనుని ద్రాక్షా కవిత్వమును గామించి యెన్నాళ్ళు లాలించినావొ' అని జాషువా కవి అఖండ గౌతమిని ప్రశంసించారు.

ఆంధ్ర యూనివర్సిటీ అనే శీర్షికలో గరిమెళ్ల వ్రాసిన తలుపు దగ్గర పాటలో కొన్ని పాదాలను పరికిస్తే, ఆయన మాతృభాషాభిమానం వ్యక్తమవుతుంది.

తెలుగు భాషను నాకు జూపుమా - అందు
వెలుగు రుచులను నాకు ద్రావుమా
కళల బెళ్కులను చూపెట్టుమా - దాని
కమ్మదనము నాకు పట్టుమా.

తెలుగువారు తమ పాత బాణీలను అశ్రద్ధ చేస్తున్నందుకు కాదు గరిమెళ్ల బాధ పడింది, వాటిని చూసి ఆధునికులు అవహేళన చేస్తున్నందుకు. జానపదుల బాణీలను సమాదరించాలని ఆయన అభిలషించారు. జానపదుల బాణీలు ఆయనకి తెలిసినంతగా ఆనాళ్లలో మరొకరికి తెలియదన్నా సాహసం కాదు.

ఆనాటి జాతీయ కవుల స్వరాష్ట్రాభిమానాన్ని, స్వభాషాభిమానాన్ని అవగాహన చేసుకోడానికి త్రిపురనేని రామస్వామి చౌదరి గారి వీరగంధము అనే గేయం ఒక ఉదాహరణం. తెలుగు యోధుల శౌర్య సాహసాలు ఇందులో చక్కగా వివరించబడ్డాయి.[30]

వీరగంధము తెచ్చినారము - వీరు డెవ్వడొ తెల్పుడీ
పూసిపోదుము మెడను వైతుము పూలదండలు భక్తితో ॥వీర॥
తెలుగు బావుట కన్ను చెదరగ కొండవీటను నెగిరినప్పుడు
తెలుగువారల కత్తిదెబ్బలు గండికోటను గాచినప్పుడు ॥వీర॥
తెలుగువారల వేడినెత్తురు తుంగభద్రను గలసినప్పుడు
దూరమందున్న సహ్యజ కత్తినెత్తురు కడిగినప్పుడు ॥వీర॥
ఇట్టి సందియ మెన్నడేనియు బుట్టలేదు రవంతయున్
ఇట్టి ప్రశ్నలు నడుగువారలు లేకపోయిరి సుంతయున్ ॥వీర॥
నడుము గట్టిన తెలుగు బాలుడు వెనుక తిరుగండెన్నడున్
బాస యిచ్చిన తెలుగు బాలుడు పారిపోవం డెన్నడున్ ॥వీర॥
ఇదిగొ యున్నది వీరగంధము మైనలందుము మైనలందుము
శాంతిపర్వము చదువ వచ్చును శాంతిసమరం బైన పిమ్మట వీర॥
తెలుగు నాటను వీరమాతను జేసి మాత్రము తిరిగి రమ్మిక
పలు తుపాకులు పలు ఫిరంగులు దారి కడ్డము రాక తప్పవు ॥వీర॥
వీరగంధము తెచ్చినారము వీరు డెవ్వడొ తెల్పుడీ.

బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రిగారు కూడా వీరగంధము శీర్షికతో 36 పాదాలలో ఒక గేయం వెలయించారు.[31] అందులో ఆంధ్రనాయకుల ప్రశంస కనిస్తుపింది. అందులోంచి కొన్ని పాదాలు.

వీరగంధము తెచ్చినారము వీరులెవ్వరో తెల్పుడీ
వీరగంధ మలంది పాడెడి విమల కంఠము నెత్తుడీ
బాలచంద్రుని బ్రహ్మనాయని బాకు సోకులు మరతురా
కాకతీయుల కత్తి తళ తళ కనుల నేటికి మెరయదా.

సిపాయీల చిచ్చుకలహము చెవుల మ్రోగుచు నున్నదే
ఖిలాఫత్ సమరంపు త్రైక్యత ఖులాసాగా నున్నదే.
ఆంధ్రకేసరి ఆత్మధైర్యము అలంకారము జేయగా
శ్రీ సరోజిని స్వాతంత్ర్యపు జీవగానము కరుగుగా.
దేశ సేవకు అసువు లొసగిన ధీరవర్యుల దెలియుడీ
తల్లిచెఱ విడిపింప తరలిన ధర్మవీరుల దలపుడీ.
కష్టజీవుల కరుణ కావ్యము గాన మొనరుతు రెవ్వరో
స్వేచ్ఛకోసము జీవితంబును ధారవోయుదు రెవ్వరో.
మరణమైనను భయములేదను మాన్యచారితు లెవ్వరో!

ఇలా తెలుగు తమిళ జాతీయ కవులు తమ మాతృ భాషాభిమానాన్ని, స్వరాష్ట్రాభిమానాన్ని వ్యక్తీకరించారు. అంతేకాక, తమ ప్రాచీన సంప్రదాయాల పట్లకూడా అభిమానం ప్రకటించారు. ఆ అభిమాన ప్రకటన ఒకటి రెండు చోట్ల హద్దులు మీరినట్లు కనిపించవచ్చు. అంతమాత్రాన వారి జాతీయాభిమానాన్ని శంకించడం సముచితం కాదు. అన్య భాషా ద్వేష దూషితం కాని మాతృభాషాభిమానం సర్వదా ప్రశంసార్హం. అది అభిలషణీయం కూడా!

## జ్ఞాపికలు

1. బంకించంద్ర చటర్జీ రచించిన వందేమాతరం జాతీయగీతంలో ఏడు కోట్లని ఉన్నది. ఆ తర్వాత తెలుగు తమిళ, కవుల ముప్పయి కోట్లని మార్చారు.
   'త్రింశత్కోటి కంఠ కలకల నినాదకరాళే' (వందేమాతరం గేయం, జాతీయ గీతాలు.)
   'ముప్పదు కోటి వాయ్ (నిన్నిశై) ముళంగవుం' బారలి చేసిన తమిళ సేత.
   ఏడుకోట్లు వంగదేశానికే పరిమితం.
2. బిపిన్ చంద్రపాల్ దక్షిణాపథంలో విస్తృతంగా పర్యటించారు. ఆయన గంభీరోపన్యాసాలు శ్రోతల్ని బహుధా ఆకర్షించాయి. ఆయన ఉపన్యా

సాలు విని ఉత్తేజితులైన త్రిపురనేని రామస్వామి చౌదరిగారు (1887-1943) రాణాప్రతాప్ అనే నాటకం వ్రాసినట్లు తాపీ ధర్మారావుగారు తెలియజేశారు. (విజ్ఞాన సర్వస్వము, 2 వ సంపుటం, తెలుగు సంస్కృతి-2 1988.)

తిలక్ అనుయాయుల నాయకుడైన బిపిన్ చంద్రపాల్ తెలుగు, తమిళనాడులలో పర్యటించి ఉపన్యాసాలు చేశారు. రా. అ. పద్మనాభన్ తమిళంలో వ్రాసిన భారతి అనే పుస్తకంలో ఇలా పేర్కొన్నారు: '(భారతి) బాల భారత సంఘం అనే ఒక సంఘం నెలకొల్పాడు. తన వంటి యువకుల్ని చేరదీశాడు.... అలాంటి సంఘాలు తెలుగు దేశంలో కూడా ఏర్పడడానికి ఆయన తోడ్పడ్డాడు. బాల భారత్ లేక యంగ్ ఇండియా అనే ఆంగ్ల పత్రిక వెలువడడానికి కారకుడయ్యాడు. బాల భారత్ సంఘం తరఫున, 1907 మే నెలలో సుప్రసిద్ధ వక్తా, తిలక్ అనుయాయుల నాయకుడూ అయిన బిపిన్ చంద్రపాల్‌ని మద్రాసుకి రప్పించి, ఆయన చేత ఉపన్యాసాలు ఇప్పించాడు. తిరువల్లిక్కేణి సముద్ర తీరాన (బీచి) పాల్ చేసిన ప్రసంగాలు దక్షిణ భారతంలో కనువిప్పు కలిగించాయి.' (చల్లా రాధాకృష్ణ శర్మ అనువాదం, భారతి, నేషనల్ బుక్ ట్రస్ట్, న్యూఢిల్లీ, 1987.)

బిపిన్ చంద్రపాల్‌ని మదరాసుకి ఆహ్వానించే నిమిత్తం, బాలభారత సంఘం ప్రతినిధిగా సుబ్రహ్మణ్య భారతి రాజమహేంద్రవరం వెళ్ళాడు. బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశ పర్యటన విజయవంతమయిందని భారతి యిలా వ్రాశాడు: 'రాజమహేంద్రవరానికి విపిన చంద్రబాబు చేసిన విజయం వ్యర్థం కాలేదు. ఆయన రాకతో రాజమహేంద్రవరంలో దేశభక్తి ఆవేశం వేరూనింది. ఆ ఆవేశం ముఖ్యంగా విద్యార్థులలో వ్యాపించినందువల్ల వారు 'వందేమాతరం' అని వ్రాయబడిన రజత చిహ్నాలను రొమ్మున ధరించి పాఠశాలలకు వెళ్ళారు.' ఈ విషయాన్ని తమిళ రచయిత శ్రీ రఘునాథన్ తమ భారతి కాలముం కరుత్తుం (1986) అనే ప్రశస్త రచనలో, 227 పుటలో పొందుపరిచారు. బిపిన్ చంద్రపాల్‌ని గురించి యింకా తెలుసుకోదలచిన వారు ఆ గ్రంథంలో పుటలు 224-232 చూడవచ్చు.

3. ఆశువుగా చెప్పినా, ఈ పద్యంలో అందాలు దిద్దుకున్న శ్లేష మధుర మోహనం. తెల్లవారు అను గడుసరి - ఒక అర్థం; తెల్లవారను గడుసరి గొల్లవారు - మరొక అర్థం.
4. మొదలి నాగభూషణ శర్మ : తెలుగు సాహిత్యం - గాంధీజీ ప్రభావం, గాంధీ సాహిత్య ప్రచురణాలయం, హైదరాబాదు, 1970. 1897 - 98 మధ్య కాలంలో సరస్వతి మొదలైన పత్రికలలో భారతదేశపు స్థితిగతులను గూర్చి పెక్కు ఖండికలు వెలువడ్డాయని శర్మగారి అభిప్రాయం.
5. దేశమంటే మనుషులోయ్.... అని గురజాడ అనడానికి ప్రేరణ బహుశః వివేకానందుని యీ కింది మాటలై ఉండవచ్చు. 'నా భారత పుత్రులార! ఇంకా శతాబ్ది కాలం మీరు నమస్కరించవలసిన దైవాలు ఎవరంటే భారతదేశపు ముప్పయి కోట్ల ప్రజలే. వీరంతా మహాశక్తి హవిర్భాగాలు. వీళ్ళనే మీరు ఆరాధించాలి. వీళ్ళకే మీరు సేవ చెయ్యాలి. దీన్ని మించిన మతం మరొకటి లేదు.'

    గురజాడకూ జాతీయోద్యమానికీ సన్నిహిత సంబంధం ఉన్నట్లు మనం స్పష్టంగా చెప్పలేము. అంత మాత్రాన ఆయన దేశభక్తిని గాని జాతీయ భావాలను గాని సంశయించడం తొందరపాటే అవుతుంది. ఆయన 1889 లో స్థానిక (విజయనగరం) కాంగ్రెసు సభలో ఉపన్యసించారు. 1908 లో మదరాసులో జరిగిన కాంగ్రెస్ మహాసభలకు హాజరయ్యారు. అయితే కాంగ్రెసు వాదుల అంతః కలహాలు, శుష్కోపన్యాసాలు ఆయనకి నచ్చలేదు. వాటిని నిరసించారు. ఆ తర్వాత ఆ మహాసభను వ్యంగ్యంగా విమర్శిస్తూ ఆయన 'మద్రాసు కాంగ్రెసు మహాసభ' అనే ఆంగ్ల వ్యాసం హిందూ పత్రికలో ప్రకటించారు. అందులోనుంచి కొన్ని వాక్యాలు: 'జాతీయవాదులనీ తీవ్రవాదులనీ పేర్లుపెట్టి వాటివల్ల మోసపోవద్దు. పేర్లు పెట్టుకున్నంత మాత్రాన ఒకడు యే వాదీ కాలేడు. ఒక వ్యక్తి యే వాదో అతను చెప్పే కబుర్లనుబట్టికాదు మనం నిర్ణయించేది....' వ్యాసచంద్రిక- అవసరాల సూర్యారావుగారి తెలుగు సేత, 1953.
6. తమిళ సాహిత్యం - భారతి కవిత, 1982 (పుటలు 22-24).
7. పైదే, పుట 15.

8. ఇన్నియ విడుదలై ఇయక్కత్తిల్ బారతి దాసన్, పుట 19.
ఈ ప్రకటన విడదలై పోర్రిల్ తమిళ్ వళర్న్ద వరలాఱు (పుట 69) లో కూడా ఉంది.
9. ఇన్దియ విడుదలై ఇయక్కత్తిల్ బారతిదాసన్ పుట 20.
10. విడుదలై పోర్రిల్ తమిళ్ వళర్న్ద వరలాఱు- పుట 157.
11. జాతీయ గీతాలు. పుట 28.
12. పైదే, పుట 12.
13. విడవై పోర్రిల్ తమిళ్ వళర్న్ద వరలాఱు, పుటలు 61, 76, 77.
14. తెలుగులో జాతీయోద్యమ కవిత్వం, పుట 100
15. సుబ్రహ్మణ్యభారతి, పుటలు 67-72, 1965.
16. తమిళ సాహిత్యం - భారతి కవిత, పుటలు 17-18.
17. విడుదలై పోర్రిల్ తమిళ్ వళర్న్ద వరలాఱు, పుట 79.
18. డిస్కవరీ ఆఫ్ ఇండియా (1964), పుట 53.
19. తమిళ సాహిత్యం-భారతి కవిత, తమిళం అనే గేయం, పుటలు 24,25.
20. ఇదా ఇళవరసు ఇన్దియ విడుదలై ఇయక్కత్తిల్ బారతిదాసన్, పుట 21.
21. పై గ్రంథం, పుట 58.
22. సుబ్రహ్మణ్యభారతి, పుటలు 67-72,
23. పైదే, పుటలు 24-25.
24. విడుదలై పోర్రిల్ తమిళ్ వళర్న్ద వరలాఱు, పుటలు 166-67.
25. పైదే, పుటలు 162-63.
26. పైదే, పుట 85.
27. సోమన తన బసవపురాణంలో ఇలా పేర్కొన్నాడు :

ఉరుతర గద్య పద్యోక్తులకంటె
సరసమై పరగిన జాను తెనుఁగు
చర్చింపఁగా సర్వసామాన్యమగుట
గూర్చెద ద్విపదల కోర్కె దైవారఁ
దెలుఁగుమాట లనంగవలదు వేదముల
కొలఁదియకాఁ జూడుఁడు—

పండితారాధ్య చరిత్రలో ఆయన అన్న మాట లివి :

ఒప్పదు ద్విపద గావ్యోక్తినా వలవ
దారూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృతభూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబుగాను
జాను దెనుఁగు విశేషము ప్రసన్నతకు—

28. గురజాడవారు నిర్యాణం చెందినప్పుడు, గరిమెళ్ల వాడుక తెనుగు అనే శీర్షికలో 80 చరణాల దీర్ఘగేయం సంతరించారు. అది కృష్ణాపత్రికలో 1915, డిసెంబరు 4న వెలువడింది. ఆ గీతంలో ఆయన ఒకచోట అన్నారు కదా:

నరుల నోళ్లను నలిగివుండిన
నాణెమైన పదాల లోపల
ఆడుచుండును ప్రకృతి యంటూ
అందరికి తెలిపితివి గదరా!

29. తెలుగులో జాతీయోద్యమ కవిత్వం, పుటలు-333-336.

30. జాతీయ గీతాలు, పుట 276.

31. పైదే, పుటలు 307-8.

## అధ్యాయం 5

# సమష్టి భావం

మన మందరం ఒకే జాతికి చెందిన వారమన్న సమష్టి భావం జాతీయత లోని మరొక ముఖ్యాంశం. ఈ భావం కనుక లోపిస్తే, జాతీయత కుంటుపడుతుంది.

మన దేశం బహు భాషా నిలయం. అలాగే విభిన్న మత సంస్కృతులకూ నిలయం. ఈ భిన్నత్వాన్ని అధిగమించి ఏకత్వాన్ని సాధించడంలోనే మన సంస్కృతిలోని వైశిష్ట్యం అవగత మవుతుంది. ఆ వైశిష్ట్యమే మన జాతీయతను సంరక్షించ గలుగుతున్నది. మతపరంగా మనలో జీర్ణించుకుపోయిన భేదాలను కాదనలేము. ఒకే మతానికో, కులానికో చెందిన వారిలోనూ అవాంతర భేదాలు లేకపోలేదు. అలాగే ఒకే భాషకు చెందిన వారిలో కూడా మాండలిక భేదాలు లేక పోలేదు. ఇన్ని భేదాలు మనలో నెలకొనడం వల్ల, మనలో ఐకమత్యం లోపిం చింది. తత్ఫలితంగా గతంలో మనం బాధలు అనుభవించాము.

ఈ వివిధ విషయాలను మన జాతీయ కవులు గుర్తించారు. కనుకనే వారు ఐకమత్యానికి సైంధవుడిలా అడ్డు తగులుతున్న కులభేదాలను నిరసిం చారు. ఐకమత్యం నెలకొనాలని ఆశించారు. వివిధ మతానుయాయుల మధ్య, కులాల మధ్య సామరస్యం నెలకొనాలని ఉద్బోధించారు. ఇన్ని వైవిధ్యాల మధ్య నలిగిన భారతాన్ని రాజకీయంగా ఒక్క త్రాటి మీద నిలిపి, స్వాతంత్ర్య రథాన్ని నడిపించిన మహనీయుడు గాంధీజీ. ఈనాడు ఈ విషయం అంత ప్రముఖంగా కనిపించక పోవచ్చు గాని అస్వతంత్ర భారతంలో ఇది నిజంగానే గొప్ప విషయ మనక తప్పదు.

చెరుకువాడ వెంకటనరసింహంగారు తమ అవతరణలో ఇలా అన్నారు:

'గాంధీ మహాత్ముండు కరుణ సాంద్రుండు<br>
నిర్మల శీలుండు ధర్మ స్వరూపి

భారతదేశంపు పారతంత్ర్యంబు
ముందుగా నాశనం బొనరించినపుడె
వరుస క్రమంబుగా వసుధలో నున్న
సర్వ దుర్మార్గముల్ సమసిపోగలవు
అందుచే మన స్వరాజ్య ప్రయత్నంబు
సంకుచితమైన స్వార్థంబు గాదు.'

కొండా వెంకటప్పయ్యగారు గాంధీజీని దాస్య శృంఖలాలను బాపిన భవ్యమూర్తి అని కీర్తించారు. ఆయన మాటలలో-

భరతమాత గర్భమున పండిన పంట మహాత్మగాంధి యీ
భారత దాస్య శృంఖలము బాపగ పుట్టిన భవ్యమూర్తి....

కాగా జాతి మత భేదాల మధ్య నలిగి నల్లేరయిన దేశాన్ని కాపాడినవాడు గాంధీజీ అనడం సత్యసూక్తి.

ఉమర్ అలీషా (1886-1945) వంటి బహుభాషావేత్త, జాతీయవాది ఐకమత్యం అత్యవసరమన్న విషయాన్ని 1916 లో తాము వ్రాసిన పద్యాలలో వ్యక్తం చేశారు.[2]

భిన్న మతము వారలున్నవారు
ఒకరి కెగ్గు గదుర నొకరు రంధ్రము సేయ
సమముగానె హాని సంభవించు....

దేశ శ్రేయస్సుకి మతం ప్రతిబంధకం కారాదని ఆయన పేర్కొన్నారు. హాని సంభవిస్తే, అది అందరికీ సరిసమానంగానే సంభవిస్తుంది. అందులో ఎక్కువ తక్కువ లుండవు.

హిందూ ముసల్మాను లేకమైనారన్న
గాంధీ మహాత్ముని కతనగాదె- అని ఆయన నిష్కర్షగా సెలవిచ్చారు. భారతదేశ చరిత్రలో మహాత్ముడు సాధించిన విజయాన్ని ఉమర్ అలీషాగారు చక్కగా పేర్కొన్నారు.

గరిమెళ్ళ తన 'రాజ్యమేలుదాము రారా' అన్న గేయంలో 'ఇస్లాము కీర్తిని ఇగురెత్తజేదాము, విశ్రమముగను నీ విశ్వంబు నుంతాము' అని పేర్కొన్నారు.[3]

'ప్రియ సోదరులారా ఓ ప్రియ సోదరులారా
ప్రేమ మీర పల్కెదము హితముల వినుడీ మది గనుడీ'

అని ప్రారంభమయ్యే గరిమెళ్ళ గీతం కిలాఫతు ప్రశ్న పరిశీలనార్థమైన రచన.4 మత ద్రోహం దైవద్రోహానికి సమమనీ, మతములన్నీ ఒకటే అనీ, భేదబుద్ధి మాని ఐకమత్యంతో అందరూ సంచరించాలనీ ఆయన ఈ గీతంలో ఉద్బోధించారు. ఇక ఈ క్రింది చరణాలను పరిశీలిద్దాము.

"ఇస్లాము రాజ్యమును బాలేందు బింబమును ఐరోపీయుల
యాశా మేఘము లలమె నీ దినంబు

........................................................

ఒక్కొక్క దేశంబు పాశ్చ్య లొక్కొక్కరు మ్రింగి
మక్కా మదీనాల మహత్వము మట్టివేసినారు.

........................................................

మహ్మదు మతరిపుని మన హిందూ మత రిపుగ తలచి
యీ క్షణమ దర్పమడంచగ ధర్మము మనకు గద

........................................................

మతము లెల్ల నొకటి వాని మహిమ యెల్ల యొకటి
ఏ మతము చెరిపినను దైవమునకు ద్రోహంబు సమానంబు
నేడు వారి మతము మరి రేపగు మన మతము పరపీడ
నడంచుట దైవమునకు సంప్రీతిగ దెలియండి...."

మహమ్మదు మత శత్రువుని హిందూ మత శత్రువుగా భావించాలనీ, నేడు వారి మతమైతే రేపు మన మతం పర పీడనకు లోనవతుందనీ ఆయన హెచ్చరించారు. ఏ మతానికి హాని జరిగినా, అది సహించరానిదనీ గరిమెళ్ళ వ్యక్తం చేశారు. మతపరమైన యీ విశాల భావం, సహన భావం మన దేశంలో ఏర్పడడానికి గాంధీజీయే కారణమన్నా అతిశయోక్తికాదు. గరిమెళ్ళ మేలుకొలుపు గీతంలో ఇలా అన్నారు.

మహమదీయమత మంటపంబు నిండ మంటలంటినాయి
లేరా గంగామాయిని బిలుచుకుపోరా - తుంట
రులగు పాశ్చాత్యులను వెంటగొని అంటును తుడు
చుకోవేరా బ్రహ్మవంటి తేజము గాచుకోరా.

సుబ్రహ్మణ్య భారతి యేసు క్రీస్తు, అల్లా అనే గేయాలు వ్రాశారు.[5] మేరీ మగ్దలానా కథ ఆయన్ని బహుధా ఆకర్షించింది. అందులోని ప్రేమ తత్వాన్ని ఆయన ఎంతగానో ప్రశంసించారు. దేవతలు మనలో ప్రవేశించి మనల్ని రక్షిస్తారనీ, మనలో అహంకారం కనక నశిస్తే, అప్పుడు ప్రేమ తత్వం వ్యక్తమవుతుందనీ ఆయన ఆ కథను ఆధారంగా చేసుకుని పేర్కొన్నారు. మలయాళ మహాకవి వళ్ళత్తోళ్ నారాయణమీనన్‌కూడా మేరీ మగ్దలానా కథను మనోహర కావ్యంగా వ్రాశారు.

పామరులైనా, అసత్యభాషకులైనా, తపోహీనులైనా, సన్మార్గంలో సంచరించని వారైనా సరే ప్రార్థిస్తే వారికి యముభయం లేకుండా చేస్తాడు ఆ దేవుడు -అని అల్లాని భారతి ప్రశంసించారు.

అయితే యీ యిద్దరు జాతీయ కవులు పరమత ప్రశంసలో ఒక భేదం స్పష్టంగా కనిపిస్తున్నది. హిందూ మతమైనా సరే పరపీడనకు పాల్పడకూడదనే భావాన్ని గరిమెళ్ళ వ్యక్తం చెయ్యగా, అల్లాయైనా, యేసుక్రీస్తయినా మరి ఎవరయినా ఈశ్వరుడు ప్రేమ స్వరూపుడనే భావాన్ని భారతి తెలియజేశారు. మత ద్రోహం దైవద్రోహతుల్యమని గరిమెళ్ళ స్పష్టం చేశారు.

జాతీయ కవులలో ఇలాంటి మత సహనం కలగడానికి కారణం గాంధీజీ హితవచనాలే కారణమనడం చర్విత చర్వణం. గాంధీజీని మన జాతీయ కవులు మానవమాత్రునిగా భావించలేదు; దైవసమునిగా భావించారు. వివిధ మతస్థుల మధ్య ఐకమత్యం సాధించిన మహనీయుడు కారణ జన్ముడు కాక మరేమవుతాడు?

హరిజనుల పట్ల సవర్ణ హిందువులకు ఆదరాభిమానాలు కలిగించిన ఘనుడు కూడా గాంధీజీయే- ఆయన్ని అనుసరించి నిమ్న జాత్యుద్ధరణను జాతీయ కవులు తమ రచనలలో సుస్పష్టం చేశారు.

ప్రకృతిలో కనిపించని మైల, అంటు మానవుల కెందుకు? అని ప్రశ్నించారు ఉమర్ అలీషా. కులభేదాలవల్ల మానవ సంఘమనే మేటి సౌధం కూలడాన్ని ఆయన నిరసించారు. మానవులందరు వర్ణభేదాలు లేకుండా జీవించాలనీ, జాత్యహంకారం నశించాలనీ, మానవత్వం నిలవాలనీ దువ్వూరి రామిరెడ్డిగారు ప్రబోధించారు. 'భారతీయు లొనర్చు ప్రతి కార్యమున జాతీయతా వ్యక్తి చాట

వలయు' అన్నదే ఆయన అభిమతం.[6] జాతీయతకు అంత ప్రాధాన్య మిచ్చారు ఆయన!

హరిజనోద్యమం గురించి పెక్కు రచనలు వెలువడ్డాయి. నెల్లూరు వెంకట్రామా నాయుడు (1891 - 1959) 'హరిజనులు' అనే గీతంలో వారు పడే బాధలను దయనీయంగా వర్ణించారు.

హీనపు మాల లనకండి - ఎల్ల
మానవు లందొక యాత్మే కదండి—

అని ఆయన మానవులలోని సమత్వాన్ని స్పష్టం చేశారు. చివరకు 'గాంధి బోధల వినరండి - మాకు, బంధ విముక్తికి పని పూనరండి' అని ఉద్బోధించారు.

ఇక గరిమెళ్ళ సత్యనారాయణగారు పలు గీతాలతో ఈ విషయం ప్రస్తావించారు.

'నిమ్న జాతుల నెత్తుమోయి - వారు
నిరసించిన యెడల నిక నీకు గోయి'

'బ్రాహ్మణాబ్రాహ్మణ - పంచమ బ్రాహ్మణ భేదపు తెగలు మీకేల
మీ భేదాలు వడి కాల్పరేల
చెడ్డ బోధలకు లొంగిరేల
ఈ మధుకరపు వృత్తి మరగినారది యేల?'

గరిమెళ్ళ ఏది చెప్పినా కుండబ్రద్దలు కొట్టినంత స్పష్టంగా ఉంటుంది. నిమ్న జాతుల్ని కనక నిరసిస్తే, జాతి తన పతనానికి తానే గొయ్యి తవ్వుకున్నట్లని స్పష్టం చెయ్యడమేకాక, సంఘంలో నెలకొన్న బ్రాహ్మణ అబ్రాహ్మణాది భేదాలను నిరసించారు. అస్పృశ్యత, అనైక్యత రెండు పిశాచాలై జాతిని నిర్వీర్యం చేశాయనీ, అవి పాతకాలనీ ఆయన ప్రబోధించారు. అంతే కాదు, అస్పృశ్యులు కూడా స్నాన ధ్యానాలు చేసి నిర్మలత్వం ఆత్మను పొంది ధర్మ మార్గానుసారులై గుడికి రావాలని ఆయన ఉద్బోధం. నిజానికి ఆత్మ పారిశుద్ధ్యమే భగవత్ సాక్షాత్కారానికి తొలి సోపానం. కనుక చిత్తశుద్ధి వివిధ వర్గాలవారికీ ఉండవలె ననడం సమంజసం. అంటు దోషం లేదనీ, అది పాప హేతువనీ, అంటు దోషం గురించి చెప్పే మాటలు కుంటి వాదనల కిందికి వస్తాయనీ ఆయన పేర్కొన్నారు.

గరిమెళ్ళ గీతాలలో 'పంచములు' ప్రముఖ మయింది.[7] పంచముల్ని ఆయన మన చిన్న తమ్ములని పేర్కొన్నారు. మనలోని అఘమును కను గొనాలని ఘోషించారు. హైందవ జాతికి చెందినవారూ, అయిదు భాగాలలో ఒకరూ అయిన వారిని పంచములనడం పంచ మహా పాతకములకు సమమని పేర్కొన్నారు. హరిజనులకు గతంలో జరిగిన అన్యాయాలను ఆయన పూస గుచ్చిన రీతిగా ఉదాహరించి, సర్వసమానత్వం వాంఛనీయమన్న అంశాన్ని నిర్ద్వంద్వంగా పేర్కొన్నారు. వేదధర్మశాస్త్రిలు వేయి విధాలుగా చెప్పినా, 'ఎల్లరును నొక్కటను మాన్య సూత్రమును నెరుగు' అని హితబోధ చేశారు. అందరూ ఒక్కటే అనేది మాన్యసూత్రం! ఆ గీతంలోనే మానవు లెల్లరు సోదరులనే విషయాన్ని కూడా తెలియజేశారు. సర్వసమానత్వానికి విఘాతం కలగజేశామని బాధపడ్డారు. ఆ గీతం ఇలా ముగుస్తుంది:

'సర్వసమానత బాదుకొల్పి యా జనముతోఁ గలి
యండి ఆ సర్వేశుడు స్వేఛ్ఛా వర్షంబును పరగజల్లు మనపైని'

మనం కనుక సర్వసమానత్వం నెలకొల్పి, పంచము లనబడేవారికో కలసి మెలసి వుంటే, అప్పుడా సర్వేశ్వరుడు మనపైన స్వేచ్ఛావర్షం కురిసేలా చేస్తాడని గరిమెళ్ళ తన భావాన్ని స్పష్టం చేశారు. మనకు స్వేచ్ఛ లభించాలంటే పంచముల్ని ఆదరించి అందరూ ఒకటే అనే మాన్య సూత్రమును గ్రహించడం అత్యవసరం! మొత్తంమీద ఈ గేయం గరిమెళ్ళ హృదయాన్ని తేటతెల్లం చేస్తున్నదని చెప్పవచ్చు.

కొండపల్లి జగన్నాథదాసుగారు 'దేశమాతా సేవ చేయండి' గేయంలో అంటరానితనం వద్దంటూ ఉద్బోధించారు. మన దేశవాసుల నందరినీ ఒకే రీతి చూడండని సలహా యిచ్చారు, అలాగే కోదేటి రంగాచార్యులుగారు తమ 'దరిద్ర నారాయణీయము' (60 చరణాల గేయం) లో పంచము లనబడేవారి బాధల్ని కళ్ళకుకట్టేలా చిత్రించారు. ఇలాంటివే మరికొన్ని గేయాలు లేకపోలేదు.

దేశ స్వాతంత్ర్యాన్ని సమర్థిస్తూ వ్యాసాలెన్నో సుబ్రహ్మణ్యభారతి 1920 నవంబరు 15 నుంచీ రసత్తిరట్టు (రసగుళికలు) వినోదత్తిరట్టు (వినోదాత్మకములు) అనే శీర్షికల కింద పత్రికలతో వ్రాశారు.[8] ఆరులో ఒక పంతు అనే కథలో భారతి యిలా తన అభిప్రాయం వ్యక్తం చేశారు.[9]

'తక్కువ జాతులవారిని మనం తక్కువ పరిచాం. ఆ ఫలితాలు మన మిప్పుడు అనుభవిస్తున్నాం, మనసుని బాధించే పనులకు మనం స్వస్తి చెపుదాం."

"ప్రొద్దున చేసింది మాపటివేళ ఫలిస్తుంది" మన పళ్లలికీ, పంచములకూ ఏం చేశామో, మనకు విదేశాలలో విదేశీయులు అదే చేస్తున్నారు. మన శృంగేరి శంకరాచార్యులవారూ, వానమామలై జీయర్‌స్వాములూ నేటార్, ట్రాన్స్‌వాల్ మొదలైన దేశాలకు కనక వెడితే, ఊరిబయట ఉన్న గూడెములలో వాళ్ళు నివసించాలి. సామాన్యులు నడిచే బాటల మీద నడవకూడదు. పక్కకు తొలగి నడవాలి. పల్లకీలు, బండ్లు మొదలైన వాటి కోసం ఎదురు చూసే పని లేదు. సంగ్రహంగా చెప్పాలంటే; మనలోనే కొందరిని నీచులని భావించాము. ఇప్పుడు మనందరినీ ప్రపంచంలోని వారు ఇతర దేశీయులకంటె నీచులుగా చూస్తున్నారు. మనలో కొందరిని మనం అస్పృశ్యులుగా భావిస్తున్నాము ...."

ఇలా మన జాతీయ కవులు తమ రచనలలో హరిజన సమస్య గురించి విపులంగా చర్చించినా, అందరికంటె ముందుగా ఈ సమస్యను గురించి కవితలు వెలయించిన గురజాడ అప్పారావుగారు ప్రభాత స్మరణీయులు. ఆయన సంతరించిన లవణరాజుకల (గీతం) పేర్కొనదగింది. అది ఆపాత మధురమే కాక చిరస్మరణీయం కూడా. అప్పటికి గాంధీజీ హరిజనోద్యమం ప్రారంభించలేదనడం గమనించదగిన అంశం. గురజాడవారు అన్నారు గదా:

మలిన దేహుల మాల లనుచును
మలిన చిత్తుల కధిక కులముల
నెల వొసంగిన వర్ణ ధర్మమ ధర్మ ధర్మంబే.

మంచి చెడ్డలు మనుజు లందున,
యెంచి చూడగ, రెండెకులములు[10]
మంచి యన్నది మాల యైతే మాలనే అగుదున్.

మాల యను వారున్న, వారల
మంద బుద్ధికి వగవ వలె; తన
యందు లేని కొరంత కలదని వగవగా నేలా.

మాల లనేవారి స్థితిని చూచి విచారించాలని గురజాడ పేర్కొనడం ఆయన హృదయవైశాల్యానికీ, సంస్కరణ దృష్టికీ నిదర్శనాలు.

స్వాతంత్ర్యం వచ్చినట్లుగా భావించి సుదందిరప్పళ్ళు (స్వాతంత్ర్యగీతం) అనే మధురగీతం ఆలపించారు భారతి. ఇది నేటికీ ప్రచుర ప్రచారంలో ఉన్న గీతం.

ఆడుదామా పాట పాడుదామా
ఆనంద స్వాతంత్ర్యం వచ్చిందని ॥ఆడు॥

బాపనయ్యను అయ్యారనే రోజులు పోయాయి - తెల్ల
పరంగివాణ్ణి దొర అని పిలిచే రోజులూ పోయాయి
బిచ్చగాండ్రకు మ్రొక్కే రోజులూ పోయాయి - మనల్ని
వంచించేవారిని గౌరవించే రోజులూ పోయాయి ॥ఆడు॥

(బిచ్చగాండ్రనగా తెల్లవారని అర్థం)

స్వాతంత్ర్యానంతరం కులభేదాలు కల్లలవుతాయని ఆయన విశ్వసించారు. ఆ విశ్వాసంతో ఆయన పెక్కు గీతాలలో కుల నిరసనం కావించారు. ఏకత్వాన్ని వాంఛించారు. వందేమాతరం అనే గేయంలో —

జాతిమతాలు నిరసించేము
ఉత్తమ జన్మలమని తలచేము
వేదవీరులూ ఒకటే - మరి
వేరెవరైనా ఒకటే - అనీ,

భారతజాతి గేయంలో

అందరిదీ ఒకే కులం ఒకే జాతి
అందరూ భారత దేశీయులు
అందరూ సమధర్ములు సమానులు
అందరూ ఈ దేశపు సమ్రాట్టులు
మనమందరం ఈ దేశపు రాజులం - అనీ

పాప్పా పాట్టు (బాలగీతం)లో

జాతులు లేవే పాపా - మరి
- కులభేదా లెంచుట పాపం
విద్యాబుద్ధులు నీతీ ప్రేమా
కలవారే అధికులు - అని యిలా పెక్కు గీతాలలో కులనిరసనం కావించారు.

లభ్యమయ్యే స్వాతంత్ర్యం ఒక్క అగ్రవర్గాలవారికీ పురుషులకీ పరిమితం కారాదనీ, అది నలుగురికీ సంక్రమించాలనీ ఆయన అభిలషించారు. మనమంతా ఒక కులం, మనమంతా కలసి మెలసి బ్రతుకుదాం అనీ ఆయన స్పష్టంజేశారు. ఉత్తములే ప్రముఖులనీ, నయ వంచకులకు వినాశకాలం దాపురించిందనీ పేర్కొన్నారు. విడుదలై (స్వాతంత్ర్యం) అనే గీతంలో ఆయన తన అభిప్రాయాన్ని మరింత స్పష్టం చేశారు:[12]

అందరికీ స్వాతంత్ర్యం
పరయలకి పులయలకీ
మరవలకి కురవలకీ
అందరికీ స్వాతంత్ర్యం!

ప్రతిభ కలిగి చదువు కలిగి
హానిలేని పనులు చేసి
మనమంతా కలసి మెలసి
బ్రతికెద మీ దేశంలో.
దీనుడనీ దాసుడనీ
లేడెవండు జాతిలోన
హీనుడనే మానవుండు
భరతభూమి లేడెవండు.

చదువు నేర్చి సిరులు చేర్చి
భేదబుద్ధి త్రోసిపుచ్చి
మనమంతా ఒక కులమని
చాటుదమీ దేశంలో
స్త్రీని పరిభవించు పాడు
బుద్ధిని బుగ్గి చేసేము.

పరయలు, పులయలు, మరవలు, కురవలు మొదలైన వారు తమిళ నాడులో నిమ్న జాతులకు చెందిన వారని భావించబడుతున్నారు. వారు అన్ని విధాలా వెనుకబడిన జాతులకు చెందినవారు. వివిధ వర్గాల వారికీ స్త్రీలకూ స్వాతంత్ర్యం లభించినప్పుడే దేశానికి నిజంగా స్వాతంత్ర్యం సిద్ధించినట్లుగా ఆయన భావించారు.

ఐకమత్యానికి ప్రతిబంధకంగా ఉన్న కుల నిర్మూలనావశ్యకతను జాతీయ కవులు ప్రబోధించడం సముంజసమే. ఐకమత్యం నెలకొన్నప్పుడే జాతీయత పటిష్ఠమవుతుంది. జాతీయతను పరిరక్షించడానికి ఐకమత్యం అత్యవసర మనడం చర్విత చర్వణమే; అది స్వాతంత్ర్య సముపార్జనకు కూడా అవసరమే. అందువల్లనే—

'మేము ఐకమత్యముతోడ అలరారు తామయ్య'
'పంచమ జాతిని జనులారా మనపక్షము గొందము, జనులారా'
'కయ్యానికి ముందు కాలుద్రవ్వి వెనుక దయ్యమై మము మింగుతాడు
మాదు నెయ్యము చెడగొట్టుతాడు'

అని బహువిధాలుగా ఐకమత్యం ప్రబోధించారు గరిమెళ్ల.

రథము పాటలో గరిమెళ్ల ఇలా అన్నారు: హిందువులును ముసల్ మానులు ఇంకా మిగిలిన జాతులును సందియంబులు మానండి - వందేమాతరం-మంత్రం మదులను - సుందరముగ పొందుపరిచి ॥రండి॥ ఐకమత్యం లేకపోతే దేశానికి ముక్తిరాదని ఆయన తెలియజేశారు.

కుల నిరసన బలం పుంజుకోగా, మతధర్మం ఏమిటో కూడా గరిమెళ్ల తెలియజేశాడు. ఆత్మోన్నతియే మతం. అది మానవైక్యతను మాప నేర్పడదు. కనుక కులంలా మతమూ జాతీయతకు ప్రతిబంధకం కారాదని ఆయన పేర్కొన్నారు.

ఈ సందర్భంగా గురజాడవారి గీతం ఉట్టంకించదగింది:

మతం వేరైతేను యేమోయ్
మనసు లొకటై మనుషులుంటే
జాతి యన్నది లేచి పెరిగి
లోకమున రాణించు నోయి.

భారతి, భారతి దాసన్ ప్రభృతులు కులనిరసన కావించారు. పైకి వెళ్ల అనే గీతంలో భారతి దాసన్ ఇలా స్పష్టం చేశారు, తమ భావాన్ని:[13]

జాతి మత భేదాలతో మూఢ నమ్మకాలతో
సతమతమై పోతున్న యీ కయ్యాల జగతిని

గాలిలో ధూళిలా ఎగరగొట్టిన తర్వాత
నాశనం చేద్దాము, నిర్మిద్దాము నవజగతిని.
భేదభావ మెరుగని ఆ నవ జగతిని
ఆత్మగౌరవ జగతిగా వ్యవహరిద్దాము.
.... .... .... ....
స్పృశ్యులు అస్పృశ్యులు అనే అన్యాయాన్ని
సృష్టించింది యీ మతాలే గదా!

ఆయన మనలో నెలకొన్న ఆర్థిక భేదాలను కూడా ఎత్తిచూపారు, ఒక గీతంలో:

పేదలేమో చిల్లులు పడ్డ విస్తరాకులయ్యా
ధనికులా నీళ్లు నిండిన తొట్లని తలపించారు
సంపద యావత్తూ కొందరినే ఆశ్రయించింది
నాట్య కత్తెలా వారి ముందు నాట్యమాడింది
.... .... .... ....

మన మందరం ఒక్కటే అనే విశాల భావమే కాదు, మనలో ఎవరైనా ఉన్నతి సాధిస్తే ఆ ఉన్నతి అందరికీ చెందాలనే తపన కూడా కనిపిస్తుంది, భారతి కవితలలో. వందేమాతరం అనే గీతం ఇందుకు ప్రబలోదాహరణం.[14]

వందేమాతరమని పలికేము - మన
మంతా మన తల్లిని కొలిచేము

అనే ఎత్తుగడే కవి హృదయాన్ని చక్కగా ఆవిష్కరిస్తున్నది. ఆ గేయంలోని ఈ క్రింది పాదాలు పరిశీలించదగినవి:

ఎవరైనా మనలో ఉన్నతి సాధిస్తే
అది మన కందరికీ సొంతం కావలె
ముప్పయికోట్ల మనం జీవించవలె
చెడితే అప్పుడు మనమంతా చెడవలె

ఉన్నతి గాని పతనంగాని వ్యక్తి నిష్ఠం కాక, అది సమాజ నిష్ఠం కావాలన్న సుబ్రహ్మణ్య భారతి ఆశయం పరమోదాత్తమయింది. మన మందరం

అన్న సమష్టి భావం ఉంటేనే తప్ప, అంటే, జాతీయ భావం బలం పుంజుకుంటేనే తప్ప, ఇలాంటి ఉదాత్తభావం కలగడానికి వీలుండదు. అప్పుడు స్వార్థ చింతన తక్కువవుతుంది. పరహిత భావన ప్రబలమవుతుంది.

మన జాతీయ కవులు భావించిన ఉదాత్తభావన సాంఘిక న్యాయం. ఇది ఆధునిక భావమని మనం భావిస్తున్నాము. నిజమే, కాని యీ భావానికి కూడా బీజారోపణం చేసిన మహనీయుడు గాంధీజీ అనీ, మన జాతీయ కవులు యథోచితంగా ఈ భావాన్ని కూడా తమ రచనలలో తెలియజేశారనీ చెప్పవచ్చు.

ఏ ఉద్దేశంతో పేర్కొన్నారో ఇదమిత్థమని చెప్పలేము కాని, సాంఘిక ధర్మమనే మాటను మొదట ఉపయోగించినవారు మంగిపూడి వెంకట శర్మగారు. ఆయన తమ నిరుద్ధ భారతము (1915) అనే కావ్యంలో ఇలా అన్నారు:

మాలలన్ పంచము లటంచు, మాదిగలని,
శ్వపచులని, చెప్పగా రాని వారటంచు
మరియు చండాలురని తోడి మానవులను
దరిమి వేయుట సాంఘిక ధర్మమగునె?

పంచముల్ని ఆయన సంబోధించిన తీరు గమనించదగింది.

'పంచములార! యంతరిత భవ్య గుణోత్కరులార! గర్భితో
దంచిత శక్తులార! యసమర్థులె మీరలు...................... .
.... .... .... .... .... పూర్తిగా
వంచితులైతి రాత్మ బలవైఖరి నెంచుడు, మేల్కొనుం డికన్.'

సాంఘిక న్యాయ దృష్టితో కొందరు కుల నిరసన కావిస్తే, ఆ సాంఘిక న్యాయ దృష్టితోనే గరిమెళ్ళ వంటి ఒకరిద్దరు మన ఆర్థిక అసమానతలను గుర్తించి గర్హించారు. ఆర్థిక పరమైన ఆ అసమానతలు గరిమెళ్ళ హృదయాన్ని రంపపుకోత పెట్టాయి కనుకనే ఆయన ఆ అసమాన భేదాలను ఛేదించవయ్య అని ప్రబోధించారు. కర్షకులూ కార్మికులూ తమ భేదభావాలు విస్మరించి ఏకం కావాలని ఆశించారు. అందరూ మేలుకోవాలని హితబోధ చేశారు. ఆ అసమానతలను చూసి సహించలేకపోయిన గరిమెళ్ళ అన్యాయ కాలంబు దాపురించిం

దిపుడు - అంటూ ఆ అన్యాయాలను తెలియజేశారు. సాంఘిక న్యాయం లోపించిన కాలం అన్యాయకాలం కావడంలో వింత ఏమీ లేదు. కులభేదాల నిరసన జాతీయ కవులలో కనిపించే సర్వ సాధారణ లక్షణం, కాని ఆర్థిక పరమైన అసమానతల్ని చర్చించిన వారు కొందరే కనిపిస్తారు. ఈ అసమానతలు తొలగడానికి ఆయన మార్గంకూడా సూచించారు. సర్వానర్థాలకు మూలమైన స్వార్థాన్ని విడనాడడమే ఉత్తమ మార్గం. ఆయన పేర్కొన్నారు గదా—

నాది నాదనెడి అన్యాయంబు వీడు
మనము మనదనెడి సద్గానంబు పాడు.

సంకుచిత దృక్పథం న్యాయం లోపించిన పథం. సమష్టిమార్గం న్యాయం జీర్ణించుకున్న పథం. కనుకనే సమష్టి భావాన్ని కీర్తించాలని ఆయన కోరారు. ఆయన అభివర్ణించిన అన్యాయకాలం ఇలా సాగింది: 15

మాన్యాలు భోగాలు మునుజులందరి కబ్బు
మార్గాలు వెతకాలి రండి
ఏటి పొడుగున దున్ని యెరువేసి నీరెట్టి నూర్చి
పండించేది మనవొంతా
గోటు సేయుచు బూతు కూతలను కూసి
కలకొట్టుకొని పోవు టింకొకరొంతా?
కూలి చాలక కడుపు మాడుతూ గుహలలో
కుందుతూ కుళ్ళడమూ మనవొంతా
గాలిమేడలలోను కమ్మతావులలోను
గర్వముగ భోగమింకొకరొంతా—

ఈ సాంఘిక దురవ్యాయాలను చూసి బాధపడిన గరిమెళ్ళ కొంచెం ఘాటుగానే అన్నారు:

భాగ్యవంతుల వైభవము లంటె నాకు
బాధించు వ్రణమని బాగా తెలియండి—

అన్యాయాలు చూసి సహించలేని గరిమెళ్ళ యింత కఠినంగా అనడం కొందరికి బాధాకరంగా కనిపించవచ్చుగాని, ఆయన దృష్టితో అనగా తాను పడిన పేదరికపు బాధతో చూసినట్లయితే సమంజసమనే తోస్తుంది. విప్లవాత్మక

మైన గేయం సంతరించినా, తాను విప్లవ కవినని మాత్రం ఎక్కడా చెప్పుకో లేదు. పైకి కనిపించని విప్లవ కవి ఆయన.

భారతి దాసన్ కూడా ఆర్థికపరమైన అసమానతలను చూసి బాధపడ్డారనే అంశం ఇంతకుమునుపే ఉదాహరించడమైంది కార్మికుల విజ్ఞప్తి అనే కవితలో విప్లవ కవిగా ప్రసిద్ధికెక్కిన ఆయన తన తీవ్ర వేదన తెలియజేశారు:

..........................................

చింపి గుడ్డలు కట్టుకున్నాము
రెండు చేతులతో ఒళ్ళు కప్పుకున్నాము
ముంతలో కంజి నీళ్ళు తాగి
పస్తులతో పడివున్నాం పలువురం
సంతలోని గొడ్డులా మేము
సతతం నివసించాము, కొంప లేకుండా
మేము చేసిన సేవ కిదేనా మీ కృతజ్ఞత?

..........................................

చెపుతున్నాము వినండి
ఈ జగతిలో కార్మికులు వేనకు వేలు
మమ్మల్ని ఓడలుగానో బానిసలుగానో భావించకండి
అందరికీ ఆహ్లాదం కలిగేలా
ఇప్పుడే మీ ఆస్తిపాస్తుల్ని
ఒప్పగించండి మాకు
మా రక్తం ఉడికిపోకముందే!

దీన్ని సామ్యవాద మన్నా సరే, మరి యే పేరుతో వ్యవహరించినా సరే-తెలుగు, తమిళ కవులు సంఘంలో లోపించిన సాంఘిక న్యాయాన్ని తెలియజేశారనీ, సమాజంలోని న్యూనాధిక్యాలను స్పష్టం చేశారనీ చెప్పవచ్చు.

## జ్ఞాపికలు

1. జాతీయ గీతాలు, పుట 129.
2. తెలుగులో జాతీయోద్యమ కవిత్వం, పుటలు 198 - 99.
3. జాతీయ గీతాలు, పుట 313.
4. అభ్యుదయ, ఆగస్టు - సెప్టెంబరు 89, పుటలు 25 - 26.
5. భారతియార్ కవిత్తైగళ్, (1990), పుటలు 177 - 78.
6. తెలుగులో జాతీయోద్యమ కవిత్వం, పుట 200.
7. అభ్యుదయ, ఆగస్టు - సెప్టెంబరు 89, పుటలు 24 - 25.
8. భారతి వచన రచనలు (భారతీ తమిళ్) అనే వ్యాస సంకలనంలో భారతి జీవిత సంగ్రహం వ్రాసిన పెరియసామి యాదవ్ వ్రాసిన విషయ మిది. పుట XVII, 1978.
9. పైదే, పుటలు 13 - 14.
10. అతి ప్రాచీనమైన సంగకాలానికి చెందిన ప్రసిద్ధ తమిళ కవయిత్రి ఇలా ఉద్బోధించింది:

    జాతులసలు లేవు, రెండు తప్ప
    ఇడెడు వారు, మరి ఇడనివారు
    ఇడెడు వారు ఆభిజాత్యులు
    ఇడనివారు హీన కులజులు
    ఇదియె పో సత్యము.

    తమిళవిందు, పుట 75.
11. తమిళ సాహిత్యం - భారతి కవిత, పుటలు 16 - 17.
12. పైదే, పుటలు 21 - 22.
13. కవిరాజు భారతిదాసన్ కవితలు.
14. తమిళ సాహిత్యం - భారతి కవిత, పుటలు 16 - 17.
15. గరిమెళ్ళ సాహిత్యం, పుట 67.

## అధ్యాయం 6

# స్వాతంత్ర్యానురక్తి

అనాదిగా ఎక్కడెక్కడి హిందువులూ కాశీ, రామేశ్వరాలను పుణ్య క్షేత్రాలుగా భావించారు. ఈ సంప్రదాయం ఈనాటికీ కొనసాగుతున్నది. అలాగే వివిధ భాషా ప్రాంతాలకు చెందిన జాతీయ కవులు దేశ స్వాతంత్ర్యాన్ని మనసార అభిలషించారు. పూర్వం మత ప్రాతిపదికగా జాతీయభావం స్పష్టాస్పష్టంగా నెలకొనగా, ఆధునిక యుగంలో జాతీయభావం ప్రాతిపదికగా విభిన్న మత స్థులూ, వివిధ ప్రాంతీయులూ ఏకం కాగలిగారు. జాతీయ కవుల దృష్టిలో స్వాతంత్ర్యానురక్తి ప్రాణ సమానం. జాతీయ భావం, స్వాతంత్ర్యానురక్తి - ఈ రెంటిలో ఏది మొదట ఆవిర్భవించిందని నిలదీసి అడిగితే సమాధానం చెప్పడం కొంచెం కష్టమే. ఈ రెండూ ఇంచుమించు ఏకకాలంలో కలిగిన భావాలుగా పేర్కొన్నా, స్వాతంత్ర్యానురక్తిదే పై చేయిగా కనిపిస్తుంది. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నవారందరూ మొదట్లో జాతీయవాదులే గాని, ఆ తర్వాత వారిలో కొందరు ఇతర వాదాలను ప్రోత్సహించారు. ఉదాహరణా నికి తమిళ కవి భారతిదాసన్ మొదట్లో సుబ్రహ్మణ్య భారతిని అనుసరిస్తూ కవితలు వ్రాశారు. సుబ్రహ్మణ్య భారతి కవితామండలానికి చెందిన కవిగా ఆయన ప్రసిద్ధి చెందారు. కాని ఆ తర్వాత భారతిదాసన్ ద్రావిడోద్యమ నాయకు లయ్యారు. జాతీయోద్యమానికి భిన్నమైన ద్రావిడోద్యమాన్ని బలపరుస్తూ తత్సంబంధములైన కవితలెన్నో వ్రాశారు. చివరిదాకా ఆయన అలాగే ఉండి పోయారు. తెలుగునాడులో కూడా భారతిదాసన్ వంటి వారు కొందరు ఉండ వచ్చు. 'ఆంధ్రదేశములో ఆర్య, ద్రావిడ వివాదానికి రూపం ఇచ్చిన వారిలో ఆయన (త్రిపురనేని రామస్వామి చౌదరిగారు) ప్రముఖుడు' అని తాపీ ధర్మా రావుగారు వ్రాసినా, త్రిపురనేనివారిది దేశభక్తిపూరిత హృదయం. ఉప్పు సత్యా గ్రహం రోజుల్లో 'వీరగంధము తెచ్చినారము వీరులెవరో తెల్పుడీ' వంటి గేయాలు వెలయించిన దేశభక్తు డాయన. రామస్వామిగారి ఆర్య ద్రావిడదృష్టి పురాణేతి హాసములకు పరిమితమయిందే. కాని, దేశభక్తికి సంబంధించిన విషయాల కది వర్తించదని చెప్పవచ్చు.

స్వాతంత్ర్యానురక్తిగల మన జాతీయ కవులు పారతంత్ర్యాన్ని నిరసించడంలో ఆశ్చర్యమేమీలేదు. స్వాతంత్ర్యశంఖం పూరించారు బానిస బ్రతుకుని ద్వేషించారు. సాయుధ పోరాటాన్ని నిరసించారు.

గాంధి చెప్పిన త్రోవ నడురా. ..
సామాన్యుడనుకోకు మతని....

అని గరిమెళ్ల వంటి జాతీయ కవులు మహాత్ముని పథంలో నడిచి, సత్యాహింసలనే శస్త్రాస్త్రముల సహాయంతో ,స్వాతంత్ర్య సమరంలో పాల్గొని స్వాతంత్ర్య సముపార్జన చెయ్యాలని ఆశించారు. అందుకు అనుగుణంగా కృషి చేశారు. సహర్షంగా త్యాగాలెన్నో చేశారు. తత్ఫలితంగా దేశ స్వాతంత్ర్యం లభించింది.

జాతీయవాదులలో పలువురు గాంధీపథం అనుసరించినవారు కావడంవల్ల అహింస వారికి ధ్యేయమయింది. కనుకనే వారు కత్తిబలాన్ని తూర్పారబట్టారు. హింసారహితమైన మార్గంలో పయనించారు. అహింస ద్వారానే స్వాతంత్ర్యాన్ని పొందడానికి యథాశక్తిని కృషి కావించారు.

కత్తి బలము హేయంబంటూ గాంధి చెప్పినాడురో
వాని మాట బ్రహ్మ మాట దాని మీరరాదురో
..............................................
మానవజన్మం బెత్తినావు మనిషి రక్తం త్రాగకురో
పొరుగువాని మాంసం తింటే పొట్ట పగిలిపోతుందో—

అని ఎలుగెత్తి చాటారు గరిమెళ్ల. గాంధీ మాటమీద ఆయన కెంత నమ్మకమో, కత్తి బలమంటే ఎంత ద్వేషభావమో పై పంక్తులు స్పష్టంచేస్తున్నాయి. పెక్కుచోట్ల ఆయన కత్తిబలాన్ని నిరసించారు.[2]

కత్తి భయము మాని పశుశక్తి నూత పూని
ఆత్మబలము బూని గైకొనుడి మాతృముక్తి - అనీ,
కత్తిని నిరసించు సతము - స్వస్థచిత్తవృత్తియె
వాని చేతియాయుధము—అనీ,

కత్తి బాల్చగ నక్కఱలేదు - అనీ, ఎన్నో విధాలుగా కత్తి బలాన్ని ద్వేషించిన గరిమెళ్ళ యుద్ధ శకము మాన్పునట్టి బుద్ధిశాలివని భారతమాతను కీర్తించడం వింత కాదు.

గరిమెళ్ళవలె ఆనాటి తమిళ జాతీయ కవులు కూడా కత్తివైరం నశించాలనీ కత్తిబలం హేయమనీ పేర్కొన్నారు. ప్రసిద్ధ జాతీయకవి (దేసియ క్కవి) నామక్కల్ రామలింగం పిళ్లై (1888 - 1972) చెప్పిన ఈ క్రింది గీతం బహు ప్రసిద్ధమైనది.

కత్తి యిన్ఱి రత్త మిన్ఱి
యుత్త (ర్ద) మొన్ఱు వరుగుదు
సత్తియత్తిన్ నిత్తియత్తై
నంబుం యారుం సేరువీర్
.........................................

(కత్తులు లేని నెత్తురు లేని
యుద్ధ మొకటి వస్తున్నది
సత్యమెపుడు నిలుచునంచు
తలచువారు చేరండి.
కన్నది లేదు విన్నది లేదు
ఖండన మీ మాదిరి
మునుపెన్నడో చేసిన పున్నెము
పండెను ఈనాడు.
గాంధి యనెడు శాంతమూర్తి
చూపిన మంచి మార్గమిది
మానవాళికి బాధ తగ్గగ
వెలసిన దైవ మార్గ మిది.)

ఈ గీతం తమిళనాడులో ఎందరినో ప్రభావితుల్ని చేసింది. గాంధీజీ తల పెట్టిన అహింసాయుత మార్గాన్ని, ఆ మార్గంలోని వైశిష్ట్యాన్ని చెప్పక చెపుతున్న ఈ గీతంతో నామక్కల్ కవి తమిళనాడుకి చిరపరిచితు లయ్యారు.

గాంధీజీ చేసిన మహత్కార్యాన్ని జాతీయ కవులు బహువిధాలుగా అభివర్ణించినా, గరిమెళ్ళ తెలియజేసినట్లుగా మహాత్ముడు ప్రపంచంలో శాంతి ప్రేమ దీపాలు వెలిగించి ఒక నూత్న పథం వివరించాడు. శాంతి ప్రేమ దీపాలు వెలుగుతున్నంతకాలం ఈ విశాల విశ్వంలో సుఖశాంతులు నెలకొంటాయి ఆ మహత్కార్యమే కాక మరొకటి కూడా చేశాడు మహాత్ముడు.

స్వేచ్ఛ మొలిపించె మన శక్తిచేత
బలము దుర్బల మను భేదమిచ్చుట లేదు.

—ఈ రెండు పాదాలు ప్రభాత స్మరణీయాలు!

బానిస బ్రతుకు బ్రతుకుతున్న మనకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కలిగేలా కృషి చేశాడు మహాత్ముడు. స్వరాజ్యము నా జన్మహక్కు- అని లోకమాన్యుడు బాలగంగాధర తిలక్ ఘోషించినా, ఆ స్వరాజ్య సముపార్జనకు ఎందరెందరో తమ సర్వస్వం మీదు గట్టినా, సాటిలేని ఆ స్వాతంత్ర్య సమరాన్ని ఒక నిర్ణీత పథంలో నడిపి, మహత్తర విజయం సాధించి భారతావనికి స్వాతంత్ర్య ప్రదాత అనే పేరు గడించిన మహనీయుడు గాంధీజీ! కనుకనే జాతీయ కవుల దృష్టిలో ఆయన జగద్రక్షకుడు; ధన్యజీవి; ఎన్నెన్ని జన్మల పుణ్యఫలమో అనే కీర్తి సముపార్జించాడు. దామరాజు పుండరీకాక్షుడుగారి దృష్టిలో ఆయన 'మహాబలశాలి.' ఎందుకంటే:

కత్తులు లేవు, శూలమును గాండివమున్ మొదలే హుళక్కి, నో
రెత్తి ప్రచండ వాక్పటిమనేనియు జాటడు, వైరి మీద దం
డెత్తగ సేనలేదు, బలహీనము కాయము, కోపతాపముల్
బొత్తిగ సున్న, యట్టి పరమూర్తి, మహాబలశాలి గాంధిఁ జే
యెత్తి నమస్కరించి, స్మరియించుద మెప్డు స్వరాజ్యసిద్ధికై.

స్వాతంత్ర్యానికి మారు పేరుగా గాంధీజీ ప్రసిద్ధుడయ్యాడన్నా అతిశయోక్తి కాదు. ఆ స్వాతంత్ర్యాన్ని మన జాతీయ కవులు అభివర్ణించిన తీరు ప్రశంసార్హం. కొందరు స్వరాజ్యమన్నారు. మరికొందరు స్వతంత్రమన్నారు. ఏ పేరుతో వ్యవహరించినా, వారి ధ్యేయం దేశ స్వాతంత్ర్యమే!

రాజభక్తికే చెప్పనలవికాని ప్రాధాన్యం లభించిన ఆ పాత రోజులలో కూడా పారతంత్ర్యాన్ని నిరసించిన కవులు లేకపోలేదు. వారు స్వాతంత్ర్యాన్ని పరోక్షంగానైనా ప్రస్తుతించారు. స్వాతంత్ర్య పిపాస మానవుడికి ఉగ్గుతో అలవడిన లక్షణమని చెప్పినా, అది అతిశయోక్తి కాదు. రాజాశ్రయాన్ని విశ్వసించి కాలం గడిపిన శ్రీనాథుని వంటి కవిరాజు కూడా స్వాతంత్ర్యప్రియుడే! ఆయన రచనగా భావించబడుతున్న పల్నాటి వీరచరిత్ర ఇందుకు నిదర్శనం. ఆయన అభివర్ణించిన పారతంత్ర్యపు బాధ కళ్ళకు కట్టేలా కనిపిస్తుంది.

'బంధించి బుట్టలో పాములవాడు
వదలక పెట్టిన ఫణుల చందమున
గంగిరెద్దుల వాడు కావర మణచి
ముకుదాడు పొడిచిన పోతెద్దులట్లు
బోనులో నుంచిన పులుల విధంబు
స్వాతంత్ర్యహీనత బడి యుండవలయు.'

అది వ్యాఘ్రమే కావచ్చు. కాని బోనులో ఉన్నప్పుడు, దాని స్వాతంత్ర్యానికి సంకెళ్ళు పడక తప్పదు. పులి కూడా పిల్లిలా ప్రవర్తించక తప్పదు. స్వాతంత్ర్యం లోపించినప్పుడు బలవంతుడు సైతం బలహీనుడిలా మెలగక తప్పదనే సత్యాన్ని మనస్సుకి హత్తుకునేలా ఆయన తెలియజేశాడు. కనుకనే ఆయన అన్నాడు గదా :

'పార్థివా! యిటువంటి పారతంత్ర్యంబు
కటకటా పగవారి కైనను వలదు.'

పగవాడికైనా యిది వద్దు - అనడం తెలుగువారి జాతీయోక్తి. పారతంత్ర్యం అలాంటిది!

పారతంత్ర్యాన్ని పారదోలే స్వాతంత్ర్యాన్ని మన జాతీయకవులు ప్రాణప్రాణంలా అభిమానించడంలో ఆశ్చర్య మేమీ లేదు. కనుకనే స్వాతంత్ర్య సిద్ధి కోసం ఆ దేశభక్తులు తమ సర్వస్వాన్ని ధారవోశారు. ఎలాంటి త్యాగానికైనా వెనుకంజ వెయ్యలేదు. తమ మనోగత భావాలను ఆ స్వాతంత్ర్యోపాసకులు బహు విధాలుగా వ్యక్తం చేశారు.

'ఇట్టి త్యాగము నాకు నాదర్శకంబు
బాధలే నా కాప్త బంధు వర్గంబు
.... .... ....
స్వాతంత్ర్య రథమెక్కి సంసిద్ధుఁడనుగ
మునుకొంటి, గుణ్ణాల బూనింతు నిపుడె'4

'పరతంత్రతత సౌఖ్యహరము
పరతంత్రతత ప్రాణ మాన భంగకరంబున్
పరతంత్రతత బహు హేయము
నరకము వలె భరతమాత న్యాయ సమేతా.'5

'చెరసాలల్ పృధు చంద్రశాలలె యగున్, చేదోయి గీలించు న
య్యరదండల్ విరిదండ లయ్యెడును, హేయంబైన చోడంబలే
పరమాన్నంబగు, మోటు కంబళులు దాల్పన్ పట్టుసెల్లా లగున్
స్థిరుడై యేనరు డాత్మదేశమును భక్తిం గొల్చు నవ్వానికిన్.'6

'స్వాతంత్ర్యముననుగాదే
ఖ్యాతిన్ బలముల జయంబుఁ గను దేశంబుల్
స్వాతంత్ర్యామె మేటి దొడవు
స్వాతంత్ర్యము లేని బ్రతుకు బ్రతుకే తలపన్.'7

'సౌఖ్యదమై పొల్చు స్వరాజ్య మీ యవని స్థైర్య స్ఫూర్తి వర్ధిల్లుతన్'8

చిలకమర్తివారు పేర్కొన్నట్లుగా స్వాతంత్ర్యం లేని బ్రతుకు బ్రతుకేనా! ఆనాటి స్వాతంత్ర్య సమరయోధులు వెలిబుచ్చిన భావాన్ని చిలకమర్తివారు అక్షర బద్ధం చేశారనవచ్చు. ఆ త్యాగమూర్తులు బాధల్ని ఆప్తబంధువర్గంగా, కారా గృహాన్ని స్వర్గధామంగా భావించారు.

అలనాటి స్వాతంత్ర్య సమర వీరులలో ప్రముఖుడూ జాతీయ కవీ అయిన గరిమెళ్ళ సత్యనారాయణగారు తమ జీవితంలోనే కాక గీతాలలోను స్వేచ్ఛను ప్రబోధించారు. అంత స్వేచ్ఛానురక్తుడు కనుకనే ఆయన ఏ పదవి లోనూ పట్టుమని పదినాళ్ళు కూడా ఉండలేకపోయాడు. అసహాయోద్యమం రెక్కలు విప్పుకున్న ఆ రోజులలో ఆయనకి కారాగృహం స్వేచ్ఛా మందిరంగా కనిపించింది. అక్కడ స్వేచ్ఛా వధూమణి స్వచ్ఛమైన తేజస్సుతో పూలగుచ్ఛాలు చేత పట్టుకుని స్వాతంత్ర్య సమర వీరుల రాకకోసం వేచి వున్నదని ఆయన తెలియజేశారు. అందువల్ల అస్వతంత్ర రాజ్యం - అంటే చచ్చురాజ్యం విడిచి పెట్టి సరాసరి జైలుకి రండని ఆయన ఆ వీరయోధుల్ని ఆహ్వానించారు. ఆ కారా గృహంలో వారు విచ్చలవిడిగా, రెక్కలు విప్పి విహరించ వచ్చుననీ, స్వేచ్ఛగా సంచరించవచ్చుననీ, అలా సంచరించి దైవం మెప్పులు పొందవచ్చు ననీ ఆయన సూచించారు. అలా చేయడంవల్ల, 'తల్లి కచ్చియున్న ఋణము నర్పింపవగా వచ్చు'నని ఆయన పేర్కొన్నారు. తమ 'మా కొద్దీ తెల్ల దొర తనము' గేయ రాజంలో మాతృ ఋణాన్ని తీర్చుకునే సదవకాశం లభించినట్లు ఆయన విశ్వసించారు! మాతృ ఋణం తీర్చడం సుతుల విధ్యుక్త ధర్మమని మన తరతరాల విశ్వాసం.

స్వాతంత్ర్య వాంఛ అనే తేజస్సుతో రంగరించబడని కవితాసక్తి, సాహిత్యాభిమానం కేవలం వ్యసనములనీ, విద్యాభిరుచి ఒక విలాసమనీ, దైవభక్తి బూటకమనీ గరిమెళ్ళ అభిప్రాయం. అనగా మనం తలపెట్టే ప్రతి విషయంలోను స్వాతంత్ర్య వాంఛ పాలలో నీళ్ళులా, కలిసి మెలిసి వుండాలని ఆయన విశ్వసించారు. స్వాతంత్ర్యవాంఛారహితమైన దైవభక్తి కూడా బూటకమట!

'భారతదేశము నాదేరా, భారతీయుడను నేనేరా' అని ప్రారంభమయ్యే తమ పాంచజన్యం గేయాన్ని మంగిపూడి పురుషోత్తమ శర్మగారు ఇలా పూరించారు:[9]

భారతదేశము ప్రజాస్వామికము
బడయగోరి నే బయలు వెడలితిని
పారతంత్ర్యమును పారదోలుటకు
బద్ధ కంకణుడ బయలుదేరితిని
శాంతి సమరమున సత్స్వరాజ్యమును
సత్వరముగ నే సమార్జించెదను.

పారతంత్ర్యాన్ని పారదోలి స్వరాజ్యం సముపార్జించాలనే ఉద్దేశమే మంగిపూడి వారి గేయంలోను వ్యక్తమవుతోంది.

గాంధీపథంలో పయనించి దేశ స్వాతంత్ర్యం సంపాదించవచ్చుననే పరమాశయం దామరాజు పుండరీకాక్షుడు గారి 'కదిలింది కదిలింది' గేయంలో ప్రస్ఫుటమయింది.[10] స్వేచ్ఛ చచ్చే చిందులాడే పిచ్చిని మాని జైళ్లు నింపండి - అని కూడా ఆయన సూచించారు. స్వరాజ్యసోపాన పథమున రథం పయనం సాగించగలదనీ, స్వరాజ్యసౌధ ప్రవేశాన్ని జాతీయోద్యమ వీరులు చెయ్యగలరనీ ఆయన విశ్వసించారు.[11]

గాంధి చూపిన త్రోవలో కనుక పయనిస్తే, దేశనాయకుల పాలనం ఒక్క గడియలో సిద్ధిస్తుందనే నమ్మకాన్ని గరిమెళ్ళ వ్యక్తం చేశారు. ప్రేమతోనే మనం పగవారినీ జయిస్తామనీ, రాక్షసమతమైన రక్తపాతం శ్రేయోదాయకం కాదనీ, సత్యాహింసలే మన శస్త్రాస్త్రములనీ ఆయన ప్రగాఢ విశ్వాసం.

సమయము కనుగొని సత్యాగ్రహమున
స్వాతంత్ర్యంబును సంపాదింతుము

అని స్వాతంత్ర్య సముపార్జనలో సత్యాగ్రహానికి గల స్థానాన్ని ఆయన విశదీకరించారు.

వినువీథిలో స్వాతంత్ర్యరథం వెడలిన ఆ తీరుని దర్శించినవారు దువ్వూరి రామిరెడ్డిగారు.[12]

అంబుదంబుల నమృతపూరంబు లొలుక
నిద్రచాపపుఁ దోరణమింపు గులుక
గాఁబు మెఱుగులు నెల్లెడ గడలు కొనఁగ
వెడలె, స్వాతంత్ర్య రథము విన్వీథియందు.

కొండపల్లి జగన్నాథదాసు గారు సత్యాగ్రహులు తయారు చేసే సహాయ నిరాకరణం ఎలాంటిదో తెలియజేసిన వైనం ప్రశంసార్హం. దేశభక్తి అనే గోధుమ నూకలో దేశముక్తి అనే వెన్న కలిపి దేశభక్తి జగమంతా నిండేలా సత్యాగ్రహులు తయారు చేస్తారట! స్వరాజ్య ప్రాప్తికి భోగం కాదు కావలసింది, త్యాగం అత్యవసరమనే అంశాన్ని ఆయన స్పష్టంగా తెలియజేశారు కాగా, మన జాతీయ కవులు ఆశించిన స్వాతంత్ర్యం త్యాగఫల మనటంలో విప్రతిపత్తి లేదు.

తమిళ జాతీయ కవులు కూడా స్వాతంత్ర్య ప్రాప్తికి త్యాగం అవసరమని పేర్కొనడం గమనించదగిన విషయం. స్వాతంత్ర్యాన్ని పురస్కరించుకుని సుబ్రహ్మణ్య భారతి స్వాతంత్ర్య ఘనత (సురందిర ప్పెరుమై), స్వాతంత్ర్య సస్యం (సుదందిర ప్పయిర్), స్వాతంత్ర్యదాహం (సుదందిర దాగం), స్వాతంత్ర్య దేవీస్తుతి (సుదందిర దేవియిన్ తుది), స్వాతంత్ర్యం (విడుదలై), స్వాతంత్ర్య గీతం (సుదందిర ప్పళ్ళు) అనే పెక్కు గీతాలు వెలయించారు. స్వాతంత్ర్యం గురించి మనస్సులో మెదిలిన భావాలను గ్రహించేందుకు ఈ గీత సమూహం బహుధా ఉపకరిస్తుంది. స్వాతంత్ర్య ఘనతలో ఆయన ఇలా పేర్కొన్నారు:[13]

వీర స్వాతంత్ర్యం కోరినవారు
వేరొకటి పిదప గ్రహించేరా?
సుధను క్రోలగా తలచినవారు
మధువు కోసం అర్రులు చాచేరా?

పుట్టిన వారంతా గిట్టుట తథ్య మనే
తత్వం కనుక గ్రహిస్తే - పరువు పోగా,
ధర్మం విస్మరించి, ప్రాణాలతో
జీవించుట సుఖమని తలచేరా?
వందేమాతరమని మొక్కిన పిదప
ఎవరైనా మాయను మొక్కేరా?
వందేమాతరమే తారకమని
విశ్వసిస్తే అది మరచేరా?

స్వాతంత్ర్య సస్యం 30 పాదాల దీర్ఘగీతం. స్వాతంత్ర్యం కష్టార్జితం, త్యాగఫలం అనే అభిప్రాయాన్ని ఆయన చక్కగా తెలియజేశారు:

నీళ్లు పోసి పెంచామా? సర్వేశా!
కన్నీళ్ళతో ఈ పైరు కాపాడేము
పైరు పాడవడం నీకు సమ్మతమా?
తలపు లన్నిటినీ నూనెగా మార్చి
మా ప్రాణాలతో పెంచిన దీప మిది
ఇది ఆరిపోవుట నీకు సమ్మతమా?
వెయ్యేళ్ళు బాధ లనుభవించాము
రాదనుకున్నది వచ్చినట్టుగా వచ్చిన
ఈ విశిష్ట మణిని వదులుకునేమా?
ధర్మమే గెలుస్తుందన్న పెద్దల మాట
అవుతుందా అసత్యం? విధివశాన
మేము పడినపాట్లు చాలవా?
..........................................
నీవూ ధర్మమూ నిత్యమున్నది
నిజమైతే ఈ ఒక్క వరం
నీవు ప్రసాదించలేవా?

భారతి వెలయించిన స్వాతంత్ర్య దాహగీతం చిరస్మరణీయ మయింది. ఆ గీతంలోంచి కొన్ని పాదాలు —

ఎప్పుడు తీరు నీ స్వాతంత్ర్య దాహం
ఎప్పుడు మడియు మా అడియరి మోహం
ఎప్పుడు మా తల్లి సంకెల లూడిపోవు
ఎప్పుడు మా యిక్కటులన్నీ తీరిపోవు.

ఆయన కావించిన స్వాతంత్ర్య దేవి స్తుతిలోంచి రెండు పద్యాలు-

దేవి! నీ కాంతి ప్రసరించని
దేశ మొక దేశమేనా!
అచట ప్రాణం వర్ధిల్లేనా
అచట జ్ఞానం వర్ధిల్లేనా
అచట కావ్యరచన, కళలు
తుదకు వేదాలు వర్ధిల్లేనా
పాపాత్ములు కారా వారు
నీ పరిపాలన లేనివారు.
నీ కృపకు నోచుకోనివారు
నిరుపమ ధనాఢ్యులైనా
నిఖిల విద్యాబుద్ధులు నేర్చి
ఎంతగా ఉన్నతులైనా
నిస్తులమైన కీర్తి సంపద
ఎంతగా పొందినవారైనా
వారి జీవితమంతా వృథా
అవన్నీ శవభూషలతో సమానం!

నేటికీ ప్రచుర ప్రచారంలో ఉన్న భారతి గీతాలలో విడుదలై(ల) అన్న శీర్షిక గల రచన ప్రముఖమయింది. ఆర్థికంగా సాంఘికంగా వెనుకబడిన వర్గాల వారందరికీ స్వాతంత్ర్యం లభించాలని ఆశించిన భారతి స్త్రీలకు పురుషులతోపాటు సమాన ప్రతిపత్తి లభించాలని అభిలషించారు. ఒక పద్యం—

ఎలా పరికించినా జగతిలో
మహిళలు మనకంటె తక్కు-
వనే దృష్టి తొలగిపోయి
స్త్రీ పురుషులు సరిసమానమంటూ

బ్రతికెద మీ దేశంలో

పళ్ళు అనేది పొలంపాట. సుదందిరపళ్లు అనే స్వాతంత్ర్య గీతం భారతి లేఖిని నుంచి వెలువడింది. ఇది కూడా వాడుకలో ఉన్న గీతమే. ఆనంద స్వాతంత్ర్యం అరుదెంచినట్లుగా భావించి ఆ రోజులలోనే ఆయన గీతం వెల యించారు. స్వాతంత్ర్యానంతరం సాంఘికమైన భేద భావాలు తొలగ గలవని ఆయన గాఢ విశ్వాసం.

ఏ చోట విన్నా స్వతంత్ర మన్నదె మాట
మన మంతా సమమని వినిపించె ప్రతి నోట

అని ఆయన పేర్కొన్నారు. సేద్యానికి పరిశ్రమకూ నమస్కరిద్దామనీ మనముండే దేశం మనదే అనీ స్పష్టం చేశారు.

ఇది మనకే సొంతమనీ తెలుసుకున్నాము
ఈ జగతిలో మన మిక ఎవ్వరిని సేవించము
ఆ జగన్నాథునికే మన మిక సేవ చేద్దాము

తొలినాళ్ళలో ప్రబోధాత్మకం కవితలు వెలయించిన భారతిదాసన్ రచన లలో కూడా స్వాతంత్ర్య ప్రశస్తి కానవస్తుంది.

'అక్కయ్య వచ్చి యిచ్చేందుకు, చిలుకా!
శాంతి మిరియాలా స్వాతంత్ర్యం' అనీ

'జీవితంలో ఎందుకో సుఖజీవనం మాత్రం?
స్వాతంత్ర్య శిఖరాన సౌఖ్య మందేందుకు' అనీ ఆయన పేర్కొన్నారు.

'ఇచ్చవచ్చినట్లు జీవించాలని
ఈ భువిలోని చీమసైతం కోరుతుంది
ఉత్తమ మయింది మానవ జన్మ
స్వాతంత్ర్య వాంఛ లేకుండా
బానిస బ్రతుకు గడపడం
భావ్యమేనా మనకు?'

అని నామక్కల్ రామలింగం పిళ్లై ప్రశ్నించారు.

పరాయివారి పాలనలో లాభాలున్నా
బానిసబ్రతుకు ఎన్నటికీ నరకమే;

నా యింటికి నేనే అధికారి నని
భావించినప్పుడే స్వరాజ్య భేరి!

అని ఒక కవితలో ఆయన విశదం చేశారు.

కవియోగిగా జాతీయకవిగా ప్రసిద్ధుడైన శుద్ధానంద భారతి కవితలలో స్వాతంత్ర్య ప్రశస్తి కనిపిస్తుంది. ఆయన ఒక కవితలో ఇలా పేర్కొన్నారు:

సజ్జనుల యింట్లో పాపులు దూరి
పట్టపగలే దోచుకుపోయారు
సోదరుల మంటూ ఇచ్చకాలాడి
ఉన్న ఆస్తిపాస్తులతో ఉడాయించారు.

పడుకున్నవారి చాపను లాగివేశారు
దెబ్బతిన్నవారి యింటిని దగ్ధంచేశారు
పరాయివారు దేశంలో బలవంతులై
ఫిరంగులు పేల్చి నాశనం చేస్తున్నారు.

దాస్యమన్నమాటను దబ్బర చేద్దాము
భయమనే భావాన్ని పారదోలుదాము
ఫిరంగి వెంటాడినా లక్ష్యం వీడము
చేతులు కట్టుకు నిలబడము.

తెలుగు, తమిళ జాతీయ కవులు స్వాతంత్ర్యాన్ని గాఢంగా ప్రేమించారనడం నిర్వివాదాంశం. మన ముండే దేశం మనదే అనీ తెలుసుకున్నాము, ఇది మనకే సొంతమనీ తెలుసుకున్నాము - అని భారతి వ్యక్తం చెయ్యగా, కవి యెవరో తెలియరాలేదు గాని ఒక తెలుగు కవి 'దేశాభిమానమెన్నటికో, మన దేశమూ మనదని తెలియుటెన్నటికో' అని ఆవేదన తెలియజేశారు. ఆ రోజులలో తెలుగు తమిళ కవులు స్వాతంత్ర్య సిద్ధి ఎప్పుడు కలుగుతుందోనని ఎదురు తెన్నులు చూచారు.

వందేమాతరోద్యమం తెలుగు జాతీయ కవుల్ని బహుధా ఆకర్షించినట్లు పేర్కొనవచ్చు. అప్పటి కింకా గాంధీజీ రాజకీయరంగ ప్రవేశం చెయ్యలేదు. 1908 లో రాజమహేంద్రవర దేశీయ పాఠశాలల బాలురను ఉద్దేశించి ప్రచురించబడిన వందేమాతరం కీర్తనలు ముఖ్యంగా పరిశీలించదగినవి. ప్రచారం కోసం వ్రాయబడినవే అయినా, ఆ పాటల్ని విద్యార్థులు అభ్యసించాలనే ఆశయం పాటల సంపాదకులకూ పుస్తక ప్రకాశకులకూ ఉండినట్లు చెప్పవచ్చు. వారి

అశయం ఎటువంటిదైనా, ఆనాటి కవుల స్వాతంత్ర్యానురక్తిని అర్థంచేసుకునేందుకు ఆ కీర్తనలు ఎంతైనా ఉపకరిస్తాయి. అందుకు ఈ పాట ప్రబల నిదర్శనం:[14]

స్వాతంత్ర్యము - స్వర్గలోకము
పారతంత్ర్యము - ఘోర నరకము
ఐకమత్యము - స్వర్గమార్గము
బహిష్కారము - చక్రాయుధము
స్వార్థత్యాగము - స్వర్గద్వారము
జాతీయ విద్య - బ్రహ్మాస్త్రము
వందేమాతరం - బీజమంత్రము
స్వరాజ్యము - స్వర్గలోకము

వీటిలో మొదటి మాటను కొంతమంది చదివితే, రెండవ మాటను కొంత మంది చదివేవారట. అదీ వారు అవలంబించిన ప్రచార విధానం!

స్వాతంత్ర్య సమరం జరుగుతూ వుండిన ఆ రోజులలో జమీందారుల దమన పాలన నుంచి రైతులకు విముక్తి ప్రసాదించాలనే సదుద్దేశంతో కొందరు జమీన్ రైతుల సమస్యలకు ప్రాధాన్యమిస్తూ రచనలు చేశారు. ఆ కోవకు చెందిన వారిలో నెల్లూరు వెంకట్రామానాయుడు, వేదాంత కవిగా ప్రసిద్ధుడైన వేదాంతం వెంకట సుబ్రహ్మణ్యశర్మ ప్రభృతులు సంభావ్యులు. జాతీయవాది అయిన వెంకట్రామా నాయుడుగారు 1930లో జమీన్ రైతు అనే పత్రిక స్థాపించారు.[15] ఆ పత్రికలో అయన పద్యాలు పాటలు పేరడీలు మొదలైనవి వ్రాశారు. 'మాకొద్దీ జమీందారీ పొందు మా ప్రాణాలపై పొంచి మానాలు హరియించె' అనే చక్కని గీతం ఆయన లేఖినినుంచి ఆ నాళ్ళలో వెలువడింది.

వేదాంత కవిగారు 1938లో జమీన్ రైతు అనే నాటకం వ్రాశారు. అప్పటి బ్రిటిషు ప్రభుత్వం వారు ఆ నాటకాన్ని నిషేధించారు.[16] 1928 - 31 మధ్యకాలంలో జైలుశిక్ష లనుభవించిన శర్మగారు శాంతి సంగ్రామం అనే గ్రంథం వ్రాశారు. దాన్ని కూడా ప్రభుత్వం నిషేధించింది. పదేళ్ల తర్వాత ఆయన ఆ గ్రంథాన్ని స్వతంత్ర గర్జన అనే ఖండ కావ్యంగా సంతరించారు. అది కూడా నిషేధాజ్ఞలకు లోనయిన రచనే. జాతీయోద్యమ భాగంగా జమీందారులకు వ్యతిరేకంగా పోరు సాగించాలని ప్రబోధిస్తూ వేదాంతకవి ప్రభృతులు పాటలూ పద్యాలూ వ్రాశారు.

జాతీయ భావాలు గల ఆనాటి కవులు ప్రబోధాత్మకములైన పాటలూ, పద్యాలూ సంతరించడమేకాక, గాంధీజీ తలపెట్టిన నిర్మాణ కార్యక్రమంలోని వివిధాంశాలను వివరిస్తూ వాటికి విస్తృత ప్రచారం కల్పించారు కూడా. ఆనాటి కవుల స్వాతంత్ర్యానురక్తి బహుధా ప్రశంసార్హం! మనసా వాచా స్వాతంత్ర్యం అభిలషించారు కనుకనే, వారి రచనలు నేటికీ పఠనయోగ్యములై ఉన్నాయి.

## జ్ఞాపికలు

1. తెలుగు సంస్కృతి, రెండవ సంపుటము, తెలుగు విశ్వవిద్యాలయం విజ్ఞాన సర్వస్వ కేంద్రం, 1988, పుట. 536.
2. కొయ్యెడ గీతము, మంచి సమయ మిదె రారా, స్వరాజ్యము మొదలైన గీతాలలో గరిమెళ్ళ సత్యనారాయణగారు కత్తిబలాన్ని దుయ్యబట్టారు.
3. నామక్కల్ కవిని గురించిన యితర వివరాలకు ఆధునిక తమిళ సాహిత్య నిర్మాతలు (1978) చూడవచ్చు.
4. దువ్వూరి రామిరెడ్డిగారి మాతృమందిరము (1922).
5. పంగిపూడి వెంకటశర్మ. కృష్ణాపత్రిక, 1908, డిసెంబరు 22. (తెలుగులో జాతీయోద్యమ కవిత్వం).
6. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి స్వీయచరిత్ర (1957). కొద్ది పాటి మార్పులతో ఈ పద్యం జాతీయ గీతాలులో చోటుచేసుకుంది గురజాడ రాఘవశర్మగారి పరిచయం (పుట 9).
7. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు. తెలుగులో జాతీయోద్యమ కవిత్వం, పుట. 103.
8. చెన్నాప్రగడ భానుమూర్తిగారి 'మాతృ విలాపము' జాతీయ గీతాలు, పుట. 23
9, 10, 11, 12. జాతీయ గీతాలు.
13. భారతియార్ కవితెగళ్ పూ పుగార్ పరిప్పగం, పుటలు. 52 - 57.
14. వివరాలకు తెలుగులో జాతీయోద్యమ కవిత్వం చూడవచ్చు. పుటలు. 307 - 10.
15. 1990 లో జమీన్‌రైతు వజ్రోత్సవం జరుపుకున్నది. ఆ సందర్భంగా విశేష సంచిక ఒకటి ముద్రించబడింది.
16. ప్రభుత్వంవారి నిషేధాజ్ఞల నకళ్ళతో సహా పూర్తి గ్రంథాన్ని జయధీర్ తిరుమలరావుగారు సంపాదించగా, దాన్ని తెలుగు విశ్వవిద్యాలయం వారు 1991 లో ప్రచురించారు.

## అధ్యాయం 7

# జాతీయ ప్రబోధ కావ్యాలు

గురుజాడ రాఘవశర్మ గారు సంకలనం చేసిన జాతీయ గీతాలు గ్రంథానికి విశ్వనాథ సత్యనారాయణ గారు ఉపోద్ఘాతం వ్రాస్తూ ఇలా పేర్కొన్నారు : 'ఇందులో కొన్ని పద్యములు కలవు. కొన్ని గేయములు కలవు. పద్యములు వ్రాసిన వారిలో సగానికి సగముగా నొడ్డున కూర్చున్నవారు. గేయములు వ్రాసిన వారిలో నూటికి 90 మంది నిప్పులో నురికినవారు ... నేనా యుద్యమములో పాల్గొన్నవాడిని కాను. అభిమానము సమృద్ధిగా కలవాడిని, కాని కొంపయు గోడియు వదలి పెట్టినవాడనుగాను....'

జాతీయోద్యమములో పాల్గొని, త్యాగాలెన్నో కావించి, స్వాతంత్ర్య సిద్ధికి ఎంతగానో కృషి చేసిన కవులలో కొందరు గీతాలు వెలయించారు. మరికొందరు పద్యాలు రచించారు. గీతాలు వ్రాసినవారే ఎక్కువగా కనిపిస్తారు. గీతం పండిత పామర రంజకం; ఉత్తమ ప్రచార సాధనం. సామాన్య ప్రజలలోకి గీతం చొచ్చుకు వెళ్ళినంత త్వరగా పద్యం చొచ్చుకు వెళ్ళలేదు. గీతం వెలయించినా పద్యం సంతరించినా, ఆ జాతీయ కవుల ప్రధాన ధ్యేయం స్వాతంత్ర్య సముపార్జనే. జాతీయోద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొనక, ఒడ్డున కూర్చున్న కవులలో కూడా జాతీయాభిమానం సమృద్ధిగా కలవారు పలువురు కనిపిస్తారు. తమ తొలి పలుకులో స్వాతంత్ర్య సమరయోధులు బెజవాడ గోపాలరెడ్డిగారు చెప్పినట్లుగా, స్వాతంత్ర్య సందేశం తొలిసారిగా పల్లెపట్టులకు కూడా ప్రాకి పల్లీయులలో ఎక్కువ సంచలనం కలిగించింది. అమాయకులైన కర్షకులలో కలిగిన సంచలనం అంతా యింతా కాదు. వివిధ వృత్తుల వారు, విద్యావంతులు, విద్యా విహీనులు, కవులు, మహిళలు-అందరూ-సమష్టిగా సాగించిన కృషివల్ల స్వాతంత్ర్యం లభ్యమైనట్లు పేర్కొనడం నిర్వివాదాంశం!

గీతానికిగల శక్తి ఎంత గొప్పదైనా, అది ఉత్తమ ప్రచారసాధనమే అయినా, ఒక ఉద్యమం ఉవ్వెత్తున లేచిన రోజులలో అది పొందిన శక్తిసంపన్నత ఉద్యమం ఉపశమించిన తర్వాత తగ్గక తప్పదు. ఉద్యమకాలంనాటి గీతాలు కాలక్రమాన ప్రచారం కోల్పోయి, వాటి శక్తి సన్నగిల్లి, మామూలు గీతాలుగా కనిపించవచ్చు. జాతీయ కవిసార్వభౌముడుగా భావించబడుతున్న గరిమెళ్ల సత్యనారాయణగారి మాకొద్దీ తెల్లదొరతనం వంటి గేయరాజములకు కూడా ఈనాడు ప్రచారం తగ్గిపోయి స్మృతిమాత్రములై ఉన్నాయి.[8] ఇతర గీతాల విషయం చెప్పనవసరంలేదు. ఈ పరిస్థితి శోచనీయం. కాని, తమిళ నవయుగప్రవక్త సుబ్రహ్మణ్యభారతి గీతాలు కొన్ని నేటికీ రేడియో, టి.వి. మొదలైన ప్రచారసాధనాల ద్వారాను, సభలు-సమావేశాల ద్వారాను ప్రతిధ్వనిస్తూ వుండడం విస్మరించరాని విషయం. అనాటికంటే ఈనాడే ఆయన సజీవుడై ఉన్నాడని చెప్పవచ్చు!

ప్రచారం అనల్పమే అయినా, పరిమిత ప్రయోజనంగలది గీతం. కావ్యం తద్భిన్నం. ప్రచారం అల్పం. ప్రయోజనం అనల్పం. అంతేకాదు, కాలక్రమాన ఒక్కొక్కసారి కావ్య ప్రచారం ఎక్కువ కావచ్చు. ఉద్యమకాలంలో గీతం ఎంత అవసరమో, ఉద్యమం పొంగు చల్లారిన కాలంలో కావ్యం అంతే అవసరం కాగా, గీతమూ, కావ్యమూ సాహిత్యాభివృద్ధికి అవసరము లనడం సమంజసం. ఈ దృష్టితో చూసినప్పుడు కావ్య విశిష్టత ప్రముఖంగా గోచరిస్తుంది.

అసహాయోద్యమం, హరిజనోద్యమం, ఖద్దరు, రాట్నం మొదలైనవాటికి సంబంధించిన విషయాలనేకాక, మన జాతీయ కవులు త్యాగధనులైన దేశనాయకుల్ని ప్రస్తుతిస్తూ కూడా ఖండకావ్యాలు, మహాకావ్యాలు సంతరించారు. తెలుగు కవులు బాలగంగాధరతిలక్, లాలా లజపతిరాయి, గోపాలకృష్ణగోఖలే, దాదాబాయి నౌరోజ్, జవహర్‌లాల్ నెహ్రూ, నేతాజీ మున్నగు వారిని గురించి వ్రాశారు. అలాగే సుబ్రహ్మణ్య భారతి గోఖలే (గోక్కలే స్వామియార్ పాడవ్), దాదాబాయి నౌరోజ్, లోకమాన్య తిలక్,[2] లజపతిరాయ్ (లాజపతిరాయ్ తుది (స్తుతి) )[3] ప్రభృతి కవితలు వెలయించారు. నెహ్రూని గురించి గేయాలు, ఖండకావ్యాలు చాలా వెలువడ్డాయి. తెలుగులోనూ, తమిళంలోనూ గాంధీజీని ప్రస్తుతిస్తూ వెలువడిన రచనలకు అంతులేదు. అనగా, మహాత్ముని పట్ల జాతీయ కవులకుగల ఆదరాభిమానాలు అనిర్వచనీయములని నిస్సంశయంగా చెప్పవచ్చు.

మహాత్ముని ఆస్థాన కవిగా పేరు పెంపులు గడించిన తుమ్మల సీతారామ మూర్తి చౌదరిగారు ఆత్మకథ, మహాత్మ కథ మొదలైనవి వ్రాశారు. 'గుణగరిష్ఠుల దేశభక్తుల చరిత్ర చెప్పుట జగద్ధితంబైన చేతగాదె' అన్నది ఆయన విశ్వాసం. ప్రసిద్ధ గాంధేయవాది అయిన మంగిపూడి వేంకటశర్మగారు శ్రీ గాంధీ చరితామృత మనే ద్విపదకావ్యం వెలయించారు. ఆయన్ని ఆలంబనగా చేసుకుని మంగిపూడివారు కావించిన స్వపరిపాలనాప్రశస్తి యిలా సాగింది:

'స్వపరిపాలనమున్న జాతి యేదైన
జవ సత్వములతోడ శౌర్యంబు తోడ
వివిధ విద్యా కళా విస్ఫూర్తి తోడ
బహు భోగ భాగ్య సంపన్నత తోడ
నుత్సాహవంతమై యుప్పొంగుచుండు.'

వీలు దొరికినప్పుడెల్ల జాతీయ కవులు స్వాతంత్ర్యం గురించి, గాంధీజీ నిర్మాణ కార్యక్రమం గురించి పెక్కు విషయాలు పేర్కొన్నారు. గాంధీజీ నిర్యాణం చెందినప్పుడు కవిలోకం అశ్రుతర్పణం చేసింది. జాతీయవాదుల విషయం చెప్పనవసరం లేదు. స్థైర్యనిధి అయిన గాంధీని కొండా వెంకటప్పయ్య పంతులుగారు ఇలా ప్రస్తుతించారు:

'దేహ మర్పించె శాంతికై దీరు డతడు
మనసు నర్పించె బరమేశు మహితభక్తి
తప మటన్నను నిది ఘోర తపము గాదె
తపసి యాతడు మహాత్మ తపసి యతడు.'

తెలుగు జాతీయ కవులు మహాత్ముని గురించి మహా కావ్యాలు వెలయించి నట్లుగానే తమిళ కవులు కూడా గాంధీని గురించి బృహద్రచనలు చేశారు. రాయ చొక్కలింగం అనే దేశభక్తుడు పిళ్లైత్తమిళ్ అనే ప్రక్రియలో గాంధి పామాలై రచన చేశారు.[4] నాటకకర్తగా కూడా ప్రసిద్ధులైన యస్.డి. సుందరం గారు గాంధియుగం సంతరించారు.[5] 'ఇంటి కాపలా కోసం ఒక కుక్కను కనుక పెంచితే, స్వేచ్ఛను కోరి అది అరుస్తుంది. వేటగానికి కనుక ఒక పక్షి వశమైతే,

రెక్కలు కొట్టుకుని అది మరణిస్తుంది. కాని మాటలాడే మనిషికే తన హక్కును అడిగే హక్కు లేక చెరలో ఉన్నాడు' అని ఆగ్రహం ప్రకటించారు, కారాగారంలో బంధితులైన స్వాతంత్ర్య సమర యోధుల్ని ఉద్దేశించి. ఒక కవితలో ఆయన యిలా అన్నారు:

'ఇంటిలోపలే కంచెలు కట్టే
విచిత్రం జగతిలో చూచేమా?
తాతగారి పితామహి స్త్రీ ధనమైన
భారత మణిమయ సదనంలో
కావాలనే భాగాల పంపిణీ
కోరుతున్న విరా పిల్లి ఎలుకలు
పూలచెట్టు పక్కగా పరుగిడుతున్నవి
పాములూ తేళ్లూ.'

వేలకొద్ది మనుమలు మనుమరాండ్రు
మనుగడ సాగిస్తున్నారు భవనంలో
వారందరూ భాగాలు పంచమంటే
మనిషికో రాయి మిగులుతుందిరా.
కట్టిన స్వాతంత్ర్య దేవాలయాన్ని
పగులగొట్టగా వెతకవద్దు గడ్డపారలు.

విదుషి అచలాంబిక (కై) గారు గాంధీ పురాణం వ్రాశారు, గాంధీజీ కారాగృహ ప్రవేశం వరకు సాగిన కథను అభివర్ణించే మొదటి రెండు కాండలు 1923 లో ప్రచురించబడ్డాయి. ఆ తర్వాత రెండు కాండలు 1925 లో వెలువడ్డాయి. మొదటి రెండు కాండలకు లభించిన ప్రచారం తరువాతి కాండలకు లభ్యం కాలేదని ఆమె పేర్కొన్నారు. జాతీయ కావ్యాలలో ఈ పురాణానికి స్థానం లభించిందే కాని దీనికి ప్రచారం తక్కువనే చెప్పాలి.

అరంగ శ్రీనివాసన్‌గారి గాంధి కావ్యం కూడా సంభావించదగిన రచనే.

బాలసాహిత్యంలో కూడా గాంధీజీని గురించి కొన్ని చక్కని కావ్యాలు వెలువడ్డాయి. ర. అయ్యాసామిగారి మోహనగాంధీ, అళ. వళ్లియప్పగారి

పాట్టిలే గాంధికదై మొదలైనవి. కొత్తమంగలం సుబ్బుగారు జానపదుల బాణీలో 'గాంధిమగాన్‌కదై' సంతరించారు.

ఇంకా మహాత్మాగాంధీ కావియం (టి. కె. రామానుజ కవిరాయర్), గాంధీ నార్పదు (అమలన్), గాంధిమహాన్ పెరుమై (లక్ష్మణ సెట్టియార్), కవి జర్ పోట్రుం గాంధి (సంకలనం), వాళ్‌గనీ ఎమ్మాన్ (సంకలనం), గాంధి కాలక్షేపం (శుద్ధానంద భారతి) మొదలైన కావ్యాలూ సంకలనాలు వెలువడ్డాయి. ఇవన్నీ చూస్తే, గాంధీజీని మన కవులు ఎలా ప్రస్తుతించారో చక్కగా తెలియ వస్తుంది.

జాతీయ ప్రబోధ కావ్యాలలో పేర్కొనదగిన రచన శుద్ధానంద భారతి గారు వెలయించిన 'భారతశక్తి మహాకావ్యం' ప్రముఖ మయింది. అయిదువేల పాదాలలో వృత్తాలలో సాగిన యీ మహాకావ్యానికి తమిళ విశ్వవిద్యాలయం వారి లక్షరూపాయల బహుమతి లభించడం, కవియోగిగా ప్రసిద్ధులైన భారతి గారి మాతృభాష తెలుగు కావడం మొదలైన అంశాలు పేర్కొనదగినవి. 1910-45 సంవత్సరాల మధ్య ఆయన వెలయించిన వందల కొద్ది కవితలు నేడు లభ్యం కావడం లేదు. ఆ కవితలలో కులమత నిరసన, ఆధ్యాత్మికోన్నతి మొదలైన విషయాలు అందాలు దిద్దుకున్నాయి. ఆయన వెలిబుచ్చిన కొన్ని భావాలు:

అఖిల భారతంలో నివసించే
వారందరూ సరిసమానమే
ఆర్యులు ద్రావిడులు మహమ్మదీయులు క్రైస్తవులు....
భయ విరోధాలు బానిసత్వం తొలగి
అందరమూ సఖ్య జీవనం సలుపుతూ
ఆ పరాశక్తి సంతతిగా బ్రతుకుదాం.
మహిళల్ని శక్తులని వ్యవహరిద్దాము
పాతభూతాలు సోకినవారు కల్పించిన
రోత గాలిపే ప్రవాదాలను నయం చేద్దాము.

ప్రతినిత్యం స్వాతంత్ర్య దరహాసం
ప్రస్ఫుటమయ్యే నయనా లనగా
పరిశుద్ధ మనస్కులై ప్రణయ జీవులు వర్ధిల్లాలి
సుమధుర సుందర జీవన విధానం వర్ధిల్లాలి.

పసిడిని చూశాను, భక్తిని చూడలేదు
సంప్రదాయాలు చూశాను, సత్యం చూడలేదు
జాతిని చూశాను, స్వామిని చూడలేదు
అర్చకుని చూశాను, ఆలయం చూడలేదు.

సుబ్బు ఆరుముగం విడుదలై వేళ్వి (స్వాతంత్ర్య యజ్ఞం) అనే లఘు కావ్యం సంతరించి, తమ స్వాతంత్ర్యానురక్తిని ప్రకటించారు.

స్వాతంత్ర్య సంబంధి కావ్యాలు తెలుగులోనూ ఎన్నో వెలువడ్డాయి. 1860 నుంచి 1906 వరకు సాగిన స్వాతంత్ర్యోదమ చరిత్రను మనోజ్ఞంగా చిత్రించే వందేమాతర కావ్యం పేర్కొనదగింది. 18 ఖండాల యీ కావ్యాన్ని ముదిగొండ వీరభద్రమూర్తిగారు ప్రజలకు అంకితం చేశారు. దాదాభాయ్ నౌరోజీ, బాలగంగాధర తిలక్, గోపాలకృష్ణ గోఖలే, రామకృష్ణ పరమహంస ప్రభృతి మహనీయుల జీవిత ఘట్టాలు ఈ కావ్యంలో అభివర్ణితాలు. అనగా మన జాతీయోద్యమంలోని కొన్ని ఘట్టాలను చిత్రించే చారిత్రక కావ్యమిది. కాగా ఇందులో జాతీయ ప్రబోధ భావాలు అందాలు దిద్దుకోవడంలో వింత ఏమీలేదు. కొన్ని భావాలు:

భారత జాతీయతకై
యేరిన్ దెగనాడనట్టి హిత సమరస వా
క్ప్రారీణత్వము హైందవ
సారము, దీనిన్ గ్రహించి జనము మెలగుతన్. (పద్యము 30, పుట 48)

ప్రాణ వాయువు కన్నను పౌరుషంబు
ముఖ్య, మన్నము కన్నను ముఖ్య మాత్మ
గౌరవము, పలువకన్న ముఖ్యంబ యైక
మత్య మని తలంపనివాడు మనిసి కాడు. (పద్యము 79, పుట 90)

ఈశభక్తికి మించిన దేశభక్తి
దేశభక్తికిఁ దగిన యాత్మీయ శక్తి
యాత్మశక్తికిఁ దోడుగ నాధునికత
రక్తి, యని యొప్పునాడె భారతము ముక్తి. (పద్యము 36, పుట 100)

పేదలు నిమ్నజాతులు నవిద్యులు చెప్పులు కుట్టువారు మీ
వీదుల నూడ్చువారు ప్రభవించిరి వారును మీరు నెల్ల రే
కోదరు లొక్క గడ్డపయి నొక్కటె మాంసము నొక్క రక్తమై
మోదిలుడో ప్రజల్! సమ సముజ్జ్వల భావముతో శుభం బగున్.
(పద్యము 32, పుట 242.)

స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా సాగుతున్న ఆ రోజులలో గాంధీ మహాత్ముని నేతృత్వంలో పలువురు కవులు జాతీయ ప్రబోధం కావిస్తూ కవితలు వెలయించడం విస్మరించరాని విషయం. దేశభక్తిని చాటే కావ్యాలే కాక దేశ భక్తుల వీరోచిత జీవిత గాథల్ని కూడా తెలియజేసే కావ్యాలు కొన్ని వెలువడ్డాయి. ఈ కోవకు చెందిన రచనలు తెలుగులో నేడు చాలా కానవస్తున్నా, 1930 ప్రాంతాల దేశభక్తిని ప్రబోధించే చారిత్రక కావ్యాలు లేవని చెప్పవచ్చు. ఈ అంశాన్ని సుప్రసిద్ధ స్వాతంత్ర్య యోధులు మంగిపూడి వేంకటశర్మ గారి మాటలలోనే వ్యక్తం చెయ్యడం సముచితం. ఆయన కొంచెం ఘాటుగానే అన్నారు.[6] 'ఆధునికులగు తెలుగు కవులకు దేశభక్తి - దేశాభిమానములు శూన్యములు. వారి గ్రంథములలో ప్రబోధకములగు రచనలు తక్కువ. చరిత్రాత్మకములు కడుంగడు దక్కువ. చరిత్రాత్మకములై దేశభక్తి నుద్దరింపజేయు పద్య కావ్యములు లేనేలేవు. వేల సంఖ్యను మించిన తెలుగు కవులలో దేశమును దలచుకొనువా రరుదు. భావకవుల కీ గొడవ పట్టనేలేదు....'

గాంధీజీ ఉద్యమ ప్రభావంవల్ల ఉద్యోగానికి స్వస్తి చెప్పిన దుర్భాక రాజశేఖర శతావధానిగారు 1934 లో రాణా ప్రతాపసింహ చరిత్రం ప్రకటించారు. రాణా ప్రతాపుడు రాజపుత్రుడే అయినా, స్వాతంత్ర్యవీరుడైన ఆ వీరయోధుణ్ణి భారతీయులు ప్రస్తుతించారు. విశ్వనాథవారన్నట్లుగా? ఆయన 'ఆంధ్రుడు కాడు. ధర్మరాజు ఆంధ్రుడా? కృష్ణుడు ఆంధ్రుడా? రాము డాంధ్రుడా? శంకరుడు ఆంధ్రుడా? వారందరూ భారతీయులు. అందుచేత ఆ సేతుశీతనగము వారి కథలు

పాడిరి. అట్లే ప్రతాపుడునూ.' ఈ కావ్యాన్ని పలువురు పండిత కవులు వేనోళ్ళ కొనియాడారు. రమారమి 2000 పద్యాలుగల ఈ మహాకావ్యం కొండాటమునకు అర్హమయింది.

ఒక వీరుని జీవితగాథను ఆధారంగా చేసుకుని జాతీయ ప్రబోధాత్మకంగా సంతరించబడిన యీ కావ్యంలో స్వాతంత్ర్యానురక్తి ప్రస్ఫుటం కావడం ఒక విశేషం కాదు. దుర్భాకవారు సర్వభారతాన్ని తమ దేశంగా గుర్తించిన అంశాన్ని యీ కింది పద్యం వ్యక్తం చేస్తున్నది.[8]

'ఇది నా యూ'రిది నాదు రాష్ట్రమనుచున్ హీనుల్ మదిన్ దుర్బలుల్
మది నూహింతురు కాని విక్రమకళాలంకారులౌ వారిక
య్యుదయాస్తాచల మధ్యగంబయిన సర్వోర్వీతలంబున్ ముదా
స్పదమౌ............'

అస్వతంత్ర భారతాన్ని చూసి భరించలేకపోయిన కవి గుండె చెరువయింది. 'నందనోద్యానమట్లు లుండఁదగిన భూమి పారతంత్ర్య, మహాబ్ధి మునిఁగి కఱవు వ్యాధు లీతి బాధలు గల్గి బలము తఱిగె'నని ఆయన బాధపడ్డారు.

'ఆత్మబలము ప్రధానమై యలరుగాని
యుపకరణములఁ బనియేమి యుత్తములకు?' అని దుర్భాక వారు ఆత్మబల ప్రాశస్త్యాన్ని వివరించారు. ఆత్మబలం ఉన్నవారికి ఉపకరణాలతో పనిలేదన్నప్పుడు మనకు గాంధీజీ దర్శనమిస్తారు.

1942-46 సంవత్సరాల మధ్య కాలంలో గడియారం వేంకట శేషశాస్త్రి గారు వ్రాసిన శివభారత మహాకావ్యం వీర రస ప్రధానమైన రచన. ఛత్రపతి శివాజీని ఆదర్శంగా గ్రహించి గడియారం వారు దేశభక్తిని తేటతెల్లం చేశారు.

'దేశభక్తుల కీర్తి వర్ధిల్లు గాక
దేశ చరితలు రక్తి సంధించు గాక' అని ఆయన తమ ఆకాంక్షను వ్యక్తంచేశారు. స్వాతంత్ర్యంబునఁ బుట్టి చావవలె- అనే అభిలాష కావ్యంలో వివరించబడింది. భారతదేశపు ప్రాక్తన జాతీయత అందగించాలనే ఆకాంక్ష ఆయన రచనలో కానవస్తుంది. ఒక తెగకు అన్యాయం జరుగుతుంటే అది చూసి వంతుపాట పాడడం తనకు సమ్మతం కాదన్న అభిప్రాయం కూడా కావ్యంలో కనిపిస్తుంది.

నీతిపథమ్ము మెట్టి అవనీపతులందరు నేగుచో జగత్
త్రాతకు లేనిపోని అవతారము లెత్త పనేమి?-

ఆనాటి ప్రభువులు అన్యాయ మార్గంలో సంచరించడం వల్లనే, అవతార పురుషుని వంటి గాంధీజీ నాయకత్వం అవసరమయింది. ఆ అవసరాన్ని గుర్తించడమే కాక భారతీయులు సహర్షంగా స్వీకరించారు కూడా.

బలిజపల్లి రామమూర్తిగారు (1868-1933) 10 ఆశ్వాసాలలో ఛత్రపతి శ్రీ శివాజీ చరిత్ర అనే పద్య కావ్యం వ్రాశారు. అది 1979 లో ముద్రిత (674 పుటలు)మైనా, చాలాకాలం లిఖితప్రతిగానే ఉండిపోయింది. తెలుగులో సంతరించబడిన శివాజీ చరిత్ర కావ్యాలలో ఇది మొదటిదనవచ్చు. కొమర్రాజు లక్ష్మణరావు గారి శివాజీచరిత్ర యీ మహాకావ్యానికి ఆధారం. శివాజీ వంటి వీరశిరోమణి చరిత్ర తెలుగు కవుల్ని ఎంతగానో ఆకర్షించినట్లు నిస్సంశయంగా చెప్పవచ్చు.

ఇంకా రాజశేఖర శతావధాని గారి అమరసింహ చరిత్ర, ముంగిపూడి వేంకటశర్మ గారి దుర్గావతి, పుట్టపూర్తి నారాయణాచార్యులు గారి షాజీ, విశ్వనాథవారి ఝాన్సీరాణి, చల్లా లక్ష్మీనారాయణ శాస్త్రిగారి రణతిక్కన, జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి విజయశ్రీ మొదలైన కృతులు, చర్ల గణపతి శాస్త్రిగారి స్వాతంత్ర్య దీక్ష, వక్కలంక లక్ష్మీపతిరావు గారి వీరభారతము (సంయుక్తా పృధ్వీరాజుల కథ) మొదలైన కావ్యాలు పేర్కొనదగినవి.

వజ్రతుల్యము దేశ సేవకుని మనసు,
పూలపానుపువలె నుండు ముండ్ల పాన్పు,
మదిని మానావమానముల్ కదపలేవు,
వేదనల గణింప, డతండు ప్రేమమయుడు.

అని చర్లగణపతి శాస్త్రిగారు అలనాటి దేశ సేవకుల వజ్రతుల్యమైన మనస్సును మనస్సుకి హత్తుకునేలా అభివర్ణించారు.

దేశప్రేమి అయిన వీరవరేణ్యుడు సంచరించే స్థలాలు ధన్యవిస్తారములనీ, అతడు పలికే పలుకులు మంత్రతుల్యములనీ చల్లా లక్ష్మీనారాయణ శాస్త్రిగారు తమ రణతిక్కన కావ్యంలో పేర్కొన్నారు.

వీరుని గన్నతల్లి జనవిశ్రుతయై చను వీరమాతయై
భూరియశోభిరామయయి పొల్చి; తదీయ సుతుండు తత్కృపన్
వీరుడ గాక - యాతడు భువిన్ దిరుగాడెడి చోట్ల ధన్య వి
స్తారము, లాతడాడెడి వచస్సులు మంత్రము లింత యేటికిన్.

రణతిక్కన కావ్యాన్ని ప్రశంసిస్తూ వీర చరిత్రల ప్రాధాన్యాన్ని గడియారం వేంకట శేష శాస్త్రిగారు వివరించిన తీరు హృద్యం :

పరదాస్యంబున మ్రోడువారి నవభావస్ఫూర్తి కర్తైన యీ
భరతక్షోణిఁ బునః ప్రరూఢ జవసత్వ స్థైర్య వీర్యాది వి
స్ఫురణంబుల్ వెలయింప వీర చరితంబుల్ వీరకావ్యంబులై
యరుదేరందగు నేఁడు నీ కృతి విశాలాంధ్రోత్సవం బందెడున్.

భిన్నత్వంలో ఏకత్వం దర్శించడం భారతీయులలో కానవచ్చే విశిష్ట గుణం. భారత ధరిత్రి హరివిల్లు - అని వక్కలంక లక్ష్మీపతిరావు గారు పేర్కొన్నారు.[9] కన్నుమూసిన అర్ధాంగిని పృథ్వీరాజు తలచుకొన్న విధం పరికిస్తే, జాతీయోద్యమ వీరుల మాతృదేశాభిమానం స్ఫురణకు వస్తుంది.

'దేశము దేశమో! యని గతించితివే ప్రియురాల! చూడుపై
దేశిక సేనలన్ క్షతి విధించి వధించెద; దేశమాతృనా
దేశము నౌదలన్నిలిపి తీరెదఁ, బోరెద; నేను నీ పవి
త్రాశయ సిద్ధికై యహరహమ్ము దురమ్మొనరించి తీరెదన్.'

ఇతః పూర్వం తెలిపినట్లుగా, ఆంధ్రోద్యమం వేర్పాటు ఉద్యమం కానే కాదు. ఆంధ్ర ప్రశస్తిని తెలుగుజాతికి తెలియజెప్పడమే ఆ ఉద్యమ లక్ష్యం. జాతీయ నాయకులు సాగించిన మహోద్యమానికి అనుబంధంగా సాగిన ఉద్యమమది. కొండా వెంకటప్పయ్య పంతులు వంటి జాతీయవాదులు ఆంధ్రోద్యమానికి కూడా నాయకత్వం వహించిన విషయం విస్మరించరానిది. ఈ అంశాన్ని కృష్ణా పత్రిక వంటి ప్రముఖ జాతీయ పత్రిక తన సంపాదకీయంలో (1917) ఇలా స్పష్టం చేసింది: 'ఆంధ్రోద్యమము జాతీయ ధర్మము చేతనే ప్రేరితమగుచున్నదనుట నిశ్చయము. ఆంధ్రావళి, ఆంధ్ర పౌరుషము, ఆంధ్రప్రశస్తి, రామ

చంద్రుని హంపీ యాత్ర, పెనుగొండ లక్ష్మి, రాష్ట్రగానము వంటి పెక్కు ప్రశస్త ఖండకావ్యాలు ప్రాచీనాంధ్ర వైభవాన్ని, ఆంధ్రవీరుల ధైర్య స్థైర్యాలను స్ఫురణకు తెచ్చేవే కాని అన్యములు కావు. అనగా ఆంధ్ర జాత్యాభిమానాన్ని కలిగించే రచన లన్నమాట! ఈ కోవకు చెందిన మహాకావ్యాలే మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి ఆంధ్ర పురాణము, వానమామలై వరదాచార్యులుగారి పోతన చరిత్రము మొదలైనవి.

తొలినాటి తెలుగువారి చరిత్ర సారాన్ని నవ పర్వాలుగా వింగడించుకుని మధునాపంతులవారు ఆంధ్ర పురాణ రచనకు ఉపక్రమించారు. స్వభావం చేత కావ్యమే అయినా, ఇది పురాణమని కవి విశ్వసించారు. ఉదయ పర్వం మొదలు కొని నాయకరాజ పర్వం దాక సాగిన యీ కావ్యంలో తెలుగురాజుల వైభవం అభివర్ణితం. కాకతీయ ప్రభువైన ప్రతాపరుద్రుణ్ణి బందీగా ఢిల్లీకి తీసుకుని వెడుతూ వుండగా, ఆ వీరుని హృద్వీధిలో మసలిన భావాలను వర్ణించిన వైనం కొనియాడ దగింది; దేశభక్తి ప్రబోధకంగా ఉండడం గమనించదగిన ముఖ్యాంశం.

> కుతుకము లేని దాస్యమునఁ గుందెడి దేశ సవిత్రి యిక్కటుల్
> జతనమునం దొలంపుడి ప్రజల్! విజయ ధ్వజమున్ బునః ప్రతి
> ష్ఠిత మొనరింపుడీ! తెలుగు సీమ స్వతంత్రపు జోతిఁ బెంపుడీ!
> తతభుజ శౌర్యుడైన వినతాసుతు వీర కృతుల్ తలంపుడీ!

దాస్య శృంఖలాలను పటాపంచలు చేసి దేశంలో స్వాతంత్ర్య జ్యోతిని వెలిగించడమనే అంశం ఏ దేశానికైనా వర్ణించే విషయం. ఆంధ్రాభిమానం మూర్తీభవించిన కావ్యం ఆంధ్ర పురాణం!

తమిళ సాహిత్యంలో ఆధునిక కాలంలో మహా కావ్యాలు గణనీయమైన సంఖ్యలో వెలువడలేదని చెప్పవచ్చు. అసలు తమిళ సాహిత్య చరిత్రలో కావ్యం తొలుదొలుత సంతరించబడినట్లు తెలియరావడంలేదని ప్రసిద్ధ రచయిత అయిన ము. వరద రాజన్‌గారి అభిప్రాయం.[10] ముక్తక రచనలే తొలుత వెలువడ్డాయి.[11]

కావ్య నిర్మాణానికి ఉపక్రమించిన తొలి కవి ఇళంగో అడిగళ్. అడిగళ్ అంటే పూజ్యపాదులని అర్థం. ఆయన సిలప్పదికారం కావ్యకర్త.[13] ఆ తర్వాత, కాల క్రమాన కావ్యాలు కొన్ని వెలువడ్డాయి.

ఆధునిక కాలంలో లఘు కావ్యాలు, ఖండకావ్యాలు వెలువడినంతగా మహా కావ్యాలు వెలువడలేదు. గాంధీ నెహ్రూల గురించి వచ్చినన్ని ఖండకావ్యాలు ఇతర జాతీయ నాయకులను గురించి రాలేదు. రాణా ప్రతాపసింహుని వంటి ప్రసిద్ధ వీరయోధులకు సంబంధించిన రచనలు ఎందుకో వెలువడలేదు.

బ్రిటిష్ సామ్రాజ్యాధిపత్యానికి వ్యతిరేకంగా పోరు సాగించిన వీరపాండ్య కట్టబొమ్మన్ (1765 - 99) గురించి తమిళంలో పెక్కు కావ్యాలు వెలువడ్డాయి. వాటిలో మొదటిది నమశ్శివాయ పండితుడు రచించిన కలియుగ పెరుంకాప్పియం (మహా కావ్యం). నాలుగు వేల పద్యాలు గల యీ కావ్యం పురాణంగా వ్రాయబడింది. ఇందులో చారిత్రక విశేషాలు ఏమీ లేకపోవడంవల్ల, మధురకు చెందిన జగవీర పాండియనార్ (1886 - 1967) నాలుగు వేల పద్యాల బృహత్కావ్యంగా వీరపాండ్యం వ్రాశారు. వీరపాండ్య కట్టబొమ్మన్, ఆయన్ని గురించి కావ్యాలు సంతరించినవారిలో పలువురూ కంబళత్తార్ కులానికి చెందినవారుగా కనిపిస్తున్నారు. భారతి అనుయాయులైన దేశిక వినాయకం పిళ్లై, నామక్కల్ వై. రామలింగం పిళ్లై ప్రభృతులు కట్ట బొమ్మన్ గురించీ, ఆయన సాగించిన పాంచాలం కురిచ్చి యుద్ధంగురించీ లఘుకావ్యాలు వెలయించారు.[14]

సుబ్రహ్మణ్య భారతి 187 పాదాలలో ఛత్రపతి శివాజి అనే లఘుకావ్యం సంతరించారు. తన సైన్యానికి ధైర్యోత్సాహాలు కలిగిస్తూ శివాజి పలికిన పలుకులు ఆ వీర కావ్యం. అది యిలా ప్రారంభమవుతుంది:

జయ జయ భవాని! జయ జయ భారతం!
జయ జయ మాతా! జయ జయ దుర్గా!
వందేమాతరం! వందేమాతరం!
సైన్యాధిపతులార! ఉత్తమ మంత్రులార!
హస్తి వీరులార! ఖండన వీరులార!
అతిరథులార! అశ్విక వీరులార!

వందేమాతరం, జయ జయ భారతం - అన్నప్పుడు భారతి మనస్సులో మెదిలినవారు శివాజీ కాలపు వీరులే కాదు, ఆనాటి స్వాతంత్ర్య సమర యోధులు కూడా! ఈ రెండు విషయాలు ఆయన విస్మరించలేదు. భారత దేశాన్ని ఆయన యిలా ప్రస్తుతించారు:

భారతభూమి ప్రాచీన మహాభూమి
మీ రామె సంతతి; ఇది విస్మరించవలదు!
భారతదేశం ధారుణికంతా తిలకం
మీ రామె సంతతి; ఇది విస్మరించవలదు.
ఆకసమంటే హిమశైలం ఒకవైపు
కడమ దిక్కుల జలధులు కాచే దేశం.
.... .... .... ....
మాతృదేశాన్ని హీనపరిచే మ్లేచ్ఛుల
నాశము చేయని వారి బ్రతకూ ఒక బ్రతుకేనా?
మానమేమీ లేక పగవారి దాసులై
హీనపు బ్రతుకును ఎవరైనా కోరుదురా?

శివాజీని ఆదర్శంగా చేసుకుని భారతి స్వాతంత్ర్యోద్యమ వీరుల్ని ఉద్దేశించి పలికిన పలుకులే యివి - అనే భావం మామూలు పాఠకుడికికూడా కలుగుతుంది. గురు గోవిందసింహుని గురించి ఆయన 204 పాదాల లఘుకావ్యం సంతరించారు. గురు గోవిందుని ఉద్బోధనుంచి కొన్నిపాదాలు—

ఒక్కడే దేవుడు, భువిలో ప్రభవించిన
మానవు లందరూ సోదరులే
మానవులు సమానులు స్వతంత్రులు
శిష్యులారా! కులం కృత్యం అన్నిటా
ఈ క్షణం నుంచీ మీ రందరూ ఒక్కటే
భేదాలు తొలగించండి, విభజనమే మరణం.

భారతి పాంచాలి శపథం అనే ఒక దీర్ఘ కావ్యం వెలయించారు. వృత్తాలతోను జానపదుల బాణీలలోను రచించబడిన యీ కావ్యం సంగీతం నాటకంగా కూడా ప్రదర్శిత మవుతున్నది. వ్యాస భారతాని కిది తమిళ సేత; సుమారు 3,000 పాదాలలో సాగిన కావ్యం.

శకునితో జూదమాడుతూ ధర్మరాజు దేశాన్ని పణంగా చేసి, తుదకు దేశాన్నే కోలుపోయిన అంశం భారతికి భరించరాని విషయంగా కనిపించింది. అప్పు డది పురాణ కథగా ఆయనకి స్ఫురించలేదు. భారతదేశపు హక్కులే ఆయనకి ప్రధానంగా కనిపించినట్లు విమర్శకులు భావిస్తున్నారు.[15] ఆ దృశ్యాన్ని ఆయన అభివర్ణించిన తీరు పరిశీలనార్హం:

దేవాలయంలోని అర్చకుడు
దేవతా విగ్రహం అమ్మినట్లు
వాకిట కావలి కాసేవాడు
ఇంటిని ఒడ్డి కోల్పోయినట్లు
వందలు వేలుగా ధర్మములూ
అవీ తెలిసిన ధర్మజుడే
దేశం ఒడ్డి కోల్పోయాడు - ఛీ ఛీ
అల్పమతులు చేసే పని చేశాడు!
దేశ ప్రజ లెల్లరు తమలా
మనుష్యులని భావించలేదు.
గొర్రె మందగా జమ కట్టాడు
పాలకు డలా లోకాన్ని భావించాడు.
ధర్మ శాస్త్రాలను పెక్కింటిని
తమకు తోడుగా ప్రదర్శించినా
రాజనీతిని గుర్తించిన ఆ నరులు
సవ్యంగా సంచరించలేదు.

జాతీయ వాదులైన కవులు నవ్యభావాలను తెలియజేసేందుకు మన ప్రాచీన కావ్యాలను ఎలా ఉపయోగించుకున్నారో, ఆ విషయాన్ని పాంచాలి శపథం వ్యక్తం చేస్తున్నది. భారతిలా, జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు భారత కథను ఆధారంగా చేసుకుని స్వాతంత్ర్యోద్యమ కాలం నాటి భావాలను తెలియ జేశారు. అందుకు విజయశ్రీలోని ఈ క్రింది పద్యం సాక్ష్యం:

దొరలకు ముందు రాజసముతో తెగనీలిగి పట్టుపాన్పులన్
బొరలు దినమ్ము లన్నియును బోయె, ప్రపంచము మారిపోయె, ము
ష్కరులు కరూద్వహుల్ మనల గాదని కన్నులు మూసికొన్న ఈ
నరుని కఠోర గాండివ నినాదము నిద్దుర మేలుకొల్పెడిన్.

ప్రపంచం మారిపోయిందని కవి చెప్పడం గమనించదగిన అంశం. జాతీయోద్యమం కారణంగా మన దేశంలో స్వాతంత్ర్య కాంక్షకు రెక్కలు వచ్చినట్లయింది అంతవరకు నిద్రాణంగా ఉన్న ఆ భావం బలం పుంజుకుంది. అది బలం పుంజుకోవడంతో రోజులు మారిపోయాయి. ఒక్క మన దేశంలోనే కాదు, ఎన్నో దేశాలలో స్వాతంత్ర్య కాంక్ష ప్రబలింది. తత్ఫలితంగా సామ్రాజ్య వాదతత్వం నిర్వీర్యమై పోయింది. భారతమాత పడిన పారతంత్ర్య బాధను కుంతి ద్వారా ఆయన వ్యక్తం చేశారు. చివరికి పాపయ్యశాస్త్రిగారు గాంధిజీ సందేశాన్ని కృష్ణుని ద్వారా అభివ్యక్తం చేసిన వైనం పేర్కొనదగింది.

'నిద్రాణమ్మగు జాతికిన్ నవనవోన్మేషమ్ము చేకూర్చి ని
ర్నిద్ర స్ఫూర్తి స్వతంత్ర భారత పునర్నిర్మాణముం జేయుటే.'

మహాత్ముని సందేశమే అయినా, నిజానికి స్వాతంత్ర్యోద్యమ నాయకులు కన్న కల యిది. పాత వ్యవస్థ నశించి కొత్త వ్యవస్థ నెలకొనాలని అభ్యుదయ కవులు, ఇతరులు ఆశించినట్లే, ఆనాటి జాతీయ కవులు స్వతంత్ర భారత పునర్నిర్మాణం జరగాలని గాఢంగా వాంఛించారు. ఎవరు అభిలషించినా ఒక కొత్త వ్యవస్థనే!

తెలుగు రాజులకు సంబంధించిన ఆంధ్ర పురాణం వంటి మహాకావ్యం ఆధునిక కాలంలో తమిళంలో వెలువడలేదు. అయితే 12 వ శతాబ్దిలో ఒట్టక్కూత్తర్ అనే మహాకవి - విక్రమ చోళుడు, అతని కుమారుడు, మనుమడు - ముగ్గురు చోళ భూపతుల్ని ఉద్దేశించి విడివిడిగా మూడు ఉలా[16] ప్రబంధాలు సంతరించాడు. ఆమూడింటిని కలిపి మూవరులా వ్యవహరించడం సంప్రదాయం. అంతేకాని, తమిళ రాజులుగా వ్యవహృతు లవుతున్న చేర చోళ పాండ్యులు తరువాతి కాలంలో తమిళనాడుని పరిపాలించిన రాజులు మొదలైనవారి నందరిని గురించి ఒక ప్రత్యేక కావ్యం తమిళంలో వెలువడకపోవడం చింత్యం.

మొత్తంమీద, తెలుగు, తమిళ జాతీయ కవులు జాతీయోద్యమానికి స్పందించి లఘు కావ్యాలు ఖండకావ్యాలు, మహాకావ్యాలు వెలయించారన వచ్చు. లఘు కావ్యాలు, ఖండ కావ్యాలు పరశ్శతంగా వెలువడ్డాయి. వాటిని ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక వంటి తెలుగు పత్రికలూ; ఇందియా, దేశబక్తన్, సుదేశమిత్తిరన్, ఆనందవికటన్ వంటి తమిళ పత్రికలూ ప్రచురించి, వాటికి విశాల ప్రచారం కల్పించాయి. ఆ పత్రికలు కనుక దేశభక్తి ప్రబోధాత్మకములైన ఆ రచనల్ని ప్రోత్సహించకపోతే, తద్రచనలు ఎన్నో కాలగర్భంలో కలిసి వుండేవి. ఆ పత్రికలు నిర్వహించిన పాత్ర బహుధా ప్రశంసనీయం.

ఈ సందర్భంగా బెజవాడ గోపాలరెడ్డిగారి మాటలు పరిశీలించదగినవి:17 'ఏకైక దినపత్రికయగు ఆంధ్రపత్రికకై పోస్టాఫీసుల వద్ద కాచుకొని యుండుట, రాగానే గుములుగూడి చదివి వినిపించుకోవడం సాధారణ దృశ్యమే. అటులనే కృష్ణాపత్రిక సంపాదకీయ వ్యాసాలకు, గాంధీజీ సూత్రాలకు వారి విపుల సమాధానములు ప్రజల ఉత్సాహమును పైస్థాయికే తీసుకొనిపోవుచుండినవి.'

అలాగే, 1882 లో స్థాపితమైన సుదేశమిత్తిరన్ (స్వదేశమిత్రన్) గురించి రాజాజీ వెలిబుచ్చిన అభిప్రాయం పరిశీలనార్హం: 'ఆంగ్లం తెలియని లక్షలమంది తమిళులకు, ముఖ్యంగా స్త్రీలకు, రాజకీయ పరిజ్ఞానాన్ని, స్వాతంత్ర్య కాంక్షను కలిగించినది రంగసామి అయ్యంగారి సుదేశమిత్తిరన్'.

సుబ్రహ్మణ్య భారతి, గరిమెళ్ళ సత్యనారాయణ ప్రభృతులు ప్రముఖ పత్రికా రచయితలన్న అంశం మనం గుర్తుంచుకోదగింది. భారతి 'చక్రవర్తిని' 'ఇందియా' మొదలైన పత్రికల్ని నిర్వహించగా, గరిమెళ్ళ శారదా గ్రంథమాలను స్థాపించి పుస్తక ప్రచురణ చేశారు. ఆయన కొంతకాలం గృహలక్ష్మి, త్రిలింగ పత్రికలలో పనిచేశారు.

## జ్ఞాపికలు

1. అనాళ్ళలో గరిమెళ్ళవారి గీతాలకు ప్రచుర ప్రచారం ఉండేదనడం నిర్వివాదాంశం. ప్రముఖ గాంధేయవాది తల్లాప్రగడ ప్రకాశరాయడుగారు తమ జీవిత గాథలో ఇలా అన్నారు: 'జాతీయ గీతాల మహాకవి అయన ....ఆ రోజుల్లో ఆయన జాతీయ గీతాలు తెలుగు దేశాన్ని ఊపివేశాయంటే నమ్మండి' '....పెండ్లిండ్లలో కూడ బ్యాండు వాద్యము ప్రారంభమైనచో మాకొద్దీ తెల్లదొరతనము పాట వినిపించెడిది....' నా వాఙ్మయ మిత్రులలో ఆచంట జానకిరాంగారు పేర్కొన్న విషయమిది.

2. లోకమాన్యుణ్ణి ప్రస్తుతిస్తూ 'వాళగ తిలకన్ నామం', 'తిలక్ మునివర్ కోన్' అనే రెండు రచనలు చేశారు భారతి. ఒక కీర్తన యిలా సాగింది:

పల్లవి

వర్ధిల్లాలి తిలకు నామం! వర్ధిల్లాలి వర్ధిల్లాలి
నశించాలి క్రూర పరిపాలన! నశించాలి నశించాలి.

చరణం

నాలుగు దిక్కులూ స్వాతంత్ర్యనామం మారుమోగాలి
నరకతుల్యమైన దాస్యం నాశనం కావాలి
నరుల జ్ఞానాన్ని హరించే యిరులు తొలగాలి
ఆవహించిన భయం జగతినుండి పోవాలి.

3. లజపతిరాయ్‌ని గురించి కూడా రెండు కవితలు వెలయించారు భారతి. లజపతిరాయ్ స్తుతితోపాటు లాజపతిరాయిన్ ప్రలాపం అనే రచన కూడా చేశారు. ప్రలాపం అంటే విలాపమని అర్థం. అందులోంచి కొన్ని పాదాలు:

దేశభ్రష్టుడనై పిల్లలకీ భార్యకూ దూరమై
ఇంటికి దూరంగా ఇక్కడున్నాను, విధి నేమందును?
వేదఋషుల వంటివారు నా వృద్ధ జననీ జనకులు
వారి పాద దర్శన భాగ్యం నా కెన్నటికో!
ముద్దుల కొడుకు అర్జునునివంటి వాడు
మచ్చలేని తేజోవదన మతనిది, మళ్ళీ చూడగలనా?

4. తమిళ ప్రబంధాలలో ఒకటి పిళ్లైత్తమిళ్. భగవంతుణ్ణి భగవద్భక్తుల్ని పిల్లలుగా భావించి, వారి శైశవం మొదలుకొని వివిధ బాల్యదశల్ని అభివర్ణించే కావ్యాన్ని పిళ్లైత్తమిళ్ అని వ్యవహరిస్తారు.

5. సుందరంగారు తెలుగుభాషాభిజ్ఞులు. ఆయనతో ఈ రచయితకు పరిచయ భాగ్యం ఉన్నది.

6. దుర్భాక రాజశేఖర శతావధానిగారి (1888-1957) రాణాప్రతాప సింహ చరిత్రమునకు మంగిపూడి వారు ఒసగిన అభిప్రాయం. ఆ నాళ్ళలో ఉవ్వెత్తుగా లేచిన భావ కవిత్వపు పొంగుమీది ఏవగింపుతో మంగపూడి వంటి జాతీయకవి అలా అనడంలో ఆశ్చర్యంలేదు.

7. ముదిగొండ శివప్రసాద్ గారి వ్యాసం. ఇతిహాస లహరి, యువభారతి ప్రచురణ, పుటలు 26-27

8. ఇంకా వివరాలకు తెలుగులో జాతీయోద్యమం పుటలు 166-68 చూడ వచ్చు.

దుర్భాకవారు ప్రత్యక్షంగా ఉద్యమంలో పాల్గొన్నవారు కావడం చేత, ఆయనకి సమగ్ర భారతం సాక్షాత్కరించింది. తమ అమరసింహ కావ్యంలో కూడా ఆయన-

ఈ దేశ, మీకొండ, లీసూర్యు, డీతరు,
లీవాయు, లీయెండ యన్ని మావి

అని నొక్కి చెప్పారు. భారతదేశం భారతీయులదే అనే స్వాతంత్ర్య సమరవీరుల అభిప్రాయాన్ని ఆయన అక్షర బద్ధం చేశారు.

9. వీర భారతము, పుట 35

10. ఆయన వ్రాసిన తమిళ్ ఇలక్కియ వరలాఱు (సాహిత్య చరిత్ర) సాహిత్య అకాడెమీ ప్రచురణ, పుట 79.

11. 3 పాదాల చిన్నపద్యం మొదలుకొని 782 పాదాలు గల దీర్ఘ పద్యం వరకూ గల ముక్తక రచనలే తమిళ సాహిత్యానికి శ్రీకారం చుట్టిన సంగయుగంలో వెలువడ్డాయి. కనుక ముక్తక రచనలే మొదటివని నిస్సంశయంగా చెప్పవచ్చు.

12. ఈ కావ్యరచనా కాలం క్రీ.శ. 2 వ శతాబ్ది అని పండితులూ 9 వ శతాబ్ది మధ్య భాగమని పరిశోధకులూ భావిస్తున్నారు. (తమిళ సాహిత్య చరిత్ర, పుటలు 30-31). కథా వివరాలకు తమిళ పంచకావ్య కథలు చూడ వచ్చు.

13. ఈ కులస్థులు తెలుగు వారని భావించబడుతున్నది. క్రీ. శ. 11 వ శతాబ్దిలో బళ్లారి మండలానికి చెందిన బాలరాజా అనే ఆయన పాండ్య మండలానికి తరలి వెళ్లాడనీ, ఆయనకి 47 వ తరమువాడే కట్టబొమ్మ అనీ చెబుతారు. జగవీర పాండియనార్ జీవిత విశేషాలకు చల్లా రాధాకృష్ణ శర్మ వ్రాసిన తెలుగువారి తమిళ సాహిత్య సేవ వ్యాసం చూడవచ్చు (ఆంధ్రజ్యోతి సాహిత్య వేదిక, జూన్ 17, 1991). గిడుగు వెంకట సీతాపతిగారు కట్టబొమ్మ అనే నాటకం వ్రాశారు. శ్రీమతి రూపాబాయి మోతీలాల్ 'వీరపాండ్య కట్టబమ్మన్' నవల వ్రాశారు. (1952 ?) తొలిగా కట్టబొమ్మన్ తెలుగువాడేనని సాక్ష్యాధారాలతో ఋజువు చేశారు.

14. ఇంకా వివరాలకు విడుదలై పోరిల్ తమిళ్ వళర్న్ద వరలాఱు, పుటలు 12 - 24 చూడవచ్చు.

కట్టబొమ్మన్ ఘనతను వర్ణించే ఒక జానపద గేయంలో ఆయన తోకల వంశీయుడని స్పష్టంగా చెప్పబడింది.

కట్టబొమ్మ పేరు చెబితే చాలు, గడగడలాడును ఈ ధరణి
అట్టుడికిపోవును అష్టదిశలూ, అందరూ గడగడలాడుదురు.

..........................................

గొంతులోన జీవుడు గుటగుటలాడినా, తోకల వంశీయులు జంకరని
పెద్దలు పలికే ఆ కమ్మని సుద్ది, లోకుల కందరికీ తెలుసు.

వివరాలకు చల్లా రాధాకృష్ణశర్మ తరతరాల తమిళ కవిత (1976), పుటలు 48 - 50 చూడవచ్చు.

15. తమిళ్ ఇలక్కియ వరలాఱు, పుట 326.

16. ఉలా ఒక ప్రబంధ విశేషం. దేవతా విగ్రహాన్ని ఊరేగింపుగా (ఉలా రావడం) తీసుకువచ్చేటప్పుడు, ఆ దైవాన్ని కీర్తిస్తూ పద్యాలు వ్రాయడం మొదట్లో సంప్రదాయంగా ఉండేది. తరువాతి కాలంలో రాజుల్ని గురించి ఉలాలు వ్రాసే సంప్రదాయం ఏర్పడింది. తమిళ్ ఇలక్కియ వరలాఱు, పుటలు 135 - 38.

17. జాతీయ గీతాలకు ఆయన వ్రాసిన తొలిపలుకు, పుట VI.

18. కా. దిరవియంగారి దేసియం వళర్త తమిళ్, పుట 117.

# అధ్యాయం 8

# ఉపసంహారం

ప్రాచీన భారతానికి మతం వెన్నెముక, కనుకనే మత సంప్రదాయాలు అనాళ్ళలో మహాశక్తిమంతంగా ఉండడంలో ఆశ్చర్యం లేదు. మతధర్మాలు సాహిత్యాన్నికూడా వశం చేసుకున్నాయి. ఆనాటి మత సంప్రదాయాలు కొన్ని నేటికీ సజీవంగా ఉన్నాయి. అయినా మతానికి గల ప్రచార ప్రభావాలు నానాటికి తగ్గుముఖం పట్టసాగాయి. నేడు మనది లౌకిక దేశం; అనగా మత సంబంధ రహిత దేశం. అంటే మతానికి చోటు లేదని కాదు అర్థం; ఎవరి మతం వారు సహర్షంగా అనుసరించవచ్చు, ఎవరి సంప్రదాయాలు వారు పాటించవచ్చు, కాని రాజకీయాలలో మతానికి స్థానంలేదు. ఒకప్పుడు మన దేశంలో కుటుంబ సభ్యులలో వివిధ మతానుయాయులు ఉండేవారు. జైనులు శైవులయిన వారూ ఉన్నారు. శైవులు వైష్ణవం స్వీకరించినవారూ ఉన్నారు. రాను రాను కుటుంబ సభ్యులంద రిదీ ఒకే మతమన్న ఆచారం వాడుకలోకి వచ్చింది. చార్వాకులూ ఉన్నారు.

ఈనాడు మనది లౌకిక దేశమనుకున్నాము. మనది లౌకిక రాజ్యాంగం అయినా మనదేశం విభిన్న సంస్కృతులకూ వివిధ భాషలకూ నెలవనే విష యాన్ని విస్మరించకూడదు. ఈ భిన్నత్వంలోని ఏకత్వాన్ని దర్శిస్తూ వచ్చాము, దర్శిస్తున్నాము. కనుకనే మనం ఏక జాతిగా మనగలుగుతున్నాము. దేశం ఒక్క త్రాటి మీద నిలువగలుగుతున్నది. తెలుగులు, తమిళులు, మహారాష్ట్రులు- ఇలా విభిన్న భాషల వారున్నా వీరందరూ భారతీయులనీ వీరిది ఒకే పాలనా వ్యవస్థగల జాతి అనీ ప్రపంచం కూడా గుర్తించింది. భిన్నత్వంలో ఏకత్వం సాధించడానికి ప్రముఖంగా తోడ్పడిన హేతువు మన జాతీయత. అందువల్లనే నెహ్రూ పండితుడు జాతీయతను ఏకీకరణ శక్తిగా భావించాడు. అంతేకాదు, జాతీయత ఒక సృజనాత్మక శక్తి అనీ, సామ్యవాదం కంటె కూడా శక్తిమంత మయిందనీ ఆయన అభిప్రాయం. అయితే అది తగిన అవధులలో ఉండాలి. లేకపోతే ప్రపంచయుద్ధం వంటి అంతర్జాతీయ విపత్తులకు దారి తీస్తుందని భావించాడు.

ప్రతి దేశంలోనూ జాతీయతకు సముచిత స్థానం కలదని భావించిన జాతీయవాది నెహ్రూ. దాన్ని సరిగా పోషించకపోతే, అది కయ్యానికి కాలు దువ్వుతుందనీ, అంతర్జాతీయాభివృద్ధికి నిరోధక మవుతుందనీ, అంతర్జాతీయ శాంతికీ భద్రతకూ ప్రమాద హేతువు కావచ్చుననీ, అందువల్ల సామ్రాజ్యవాద తత్వానికి దారితీయగలదని ఆయన హెచ్చరించాడు. కాగా అదుపులో లేని జాతీయ భావాన్ని నెహ్రూ ప్రతికూల భావంగా భావించడంలో ఆశ్చర్యంలేదు. విశ్వకవి రవీంద్రులు జాతీయత మన దేశానికి ఒక బెదిరింపుగా ఉన్నదనీ, మన అసలు సమస్య సాంఘికమనీ పేర్కొన్నారు.

జాతీయత ఆధునిక భావమే అయినప్పటికీ, మన దేశంలో అది ఏదో ఒక రూపంలో ఉండడం వల్లనే మన మధ్య విభేదాలెన్నో ఉన్నా, ఒక జాతిగా మన గలుగుతున్నామనీ చెప్పవచ్చు. మన భాషాభిమానం కాని, మన ఆచార వ్యవహారాల మీది ఆదరభావం కాని మన జాతీయ భావానికి ప్రతిబంధకాలు కాలేదు. ఈ విశిష్టాంశాన్ని 1962 లో చైనావారి దురాక్రమణ సందర్భంగా మనదేశం ఒక్క జాతిగా నిలబడిన ఉదంతం స్పష్టం చేస్తున్నది. ఆధునికమైన జాతీయభావం మనకు ప్రాచీన భారతంలో గోచరించక పోవచ్చుగాని తత్తుల్యమనదగిన రాజభక్తి వివిధ రాష్ట్రాలలోనూ నెలకొన్నది. ప్రభుభక్తి పరాయణులైన ప్రాచీన భారతీయులు తమ ప్రభువుల కోసం సహర్షంగా ప్రాణత్యాగం చేసిన కథలు నేటికీ ప్రచారంలో ఉన్నాయి. ఆ ప్రభుభక్తి కాలక్రమాన దేశభక్తిగా, జాతీయ భావంగా పరిణమించిందన్నా సాహసం కాదు.

మనలో జాతీయభావం లేకపోవచ్చు, కాని మన ప్రాచీనులు విశాల హృదయులనడానికి మన ప్రాచీన సాహిత్య సంపద చక్కని ఉదాహరణ. సర్వేజనా స్సుఖినో భవంతు, లోకా స్సమస్తా స్సుఖినో భవంతు, వసుధైవ కుటుంబకం వంటి సూక్తిరత్నాలను ఆలవోకగా పరిశీలించినా, వారు ప్రదర్శించిన విశాలభావం వ్యక్తమవుతుంది. అలాగే, 2000 యేండ్లకు ముందు నివసించిన తమిళ కవి కనియన్ పూంకుంద్రన్ కవివరేణ్యుడు పేర్కొన్న 'యాదుం ఊరే యావరుం కేళిర్' (అన్నియు మన ఊళ్ళే అందరు చుట్టాలే) ఈ విశాల భావాన్ని స్పష్టం చేస్తున్నది సహనమే సంస్కృతి అని భారతీయ సంస్కృతిలోని వైశిష్ట్యాన్ని సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు వ్యక్తం చేశారు. మన దేశంలో మత సహనం, భాషా సహనం మొదలైనవి అభిలషణీయములనడం సత్యసమ్మతం.

మతం, భాష మొదలైనవి ఏకీకరణ సాధనాలే అయినా, అవి పరిమిత ప్రయోజనం కలవి. అవి కొందరిని మాత్రమే ఏకం చేయగలుగుతాయి; అందరినీ మాత్రం కాదు. విభిన్నత్వమునకు నెలవైన మన దేశంలో ఒక్క జాతీయతే ప్రబల ఏకీకరణ సాధన మనడం చర్విత చరణం. ఈ విషయాన్ని మన కవులూ నాయకులూ గుర్తించలేకపోలేదు.

స్వాతంత్ర్యం జన్మహక్కని ఎలుగెత్తి చాటిన మహనీయుడు లోకమాన్య బాలగంగాధర్ తిలక్. కాని, గాంధీజీ రాజకీయ రంగంలోకి ప్రవేశించిన తర్వాతనే ఆ ఉదాత్త భావం నలుగురినీ బాగా ఆకట్టుకుంది. పామరులూ పండితులూ - అందరూ - స్వాతంత్ర్యానికిగల ఆవశ్యకతను గుర్తించి అందుకోసం పాటుపడ సాగారు. ఆ స్వాతంత్ర్యం వివిధ వర్గాల వారికీ లభించాలనీ, అప్పుడే అది సార్థక మవుతుందనీ వారు భావించారు. స్వాతంత్ర్య శక్తిని జాతీయవాదులే కాక విప్లవ వాదులు కూడా గ్రహించారు. వారందరి ధ్యేయం దేశ స్వాతంత్ర్యం! అయితే వారు అవలంబించిన మార్గాలు వేర్వేరు. జాతీయవాదులు గాంధీజీ మార్గంలో పయనించి శాంత్యహింసలు అభిలషణీయములని త్రికరణశుద్ధిగా భావించారు. ఈ విశిష్టాంశం గరిమెళ్ళ సత్యనారాయణ కవితలలో ప్రముఖ స్థానం వహించింది.

'ప్రపంచమున శాంతి - ప్రేమ దీపంబులు వెలిగించె నీ దేశమంత
గాంధి తెనిగించె నీ క్రొత్త వ్రాత.'
'అహింస వ్రతము నేబూని యాత
దవతరింపగ జేసె ఆర్యత్వ మవని.'
'ప్రేమ చేతనే పగతుని గెలుతుము
రక్తపాతములు రాక్షసమతమగు.'

సుబ్రహ్మణ్య భారతి కూడా యుద్ధ మార్గాన్ని నిరసించినవాడే. గాంధీజీని ప్రస్తుతిస్తూ 'పెరుంగొలై వళియాం పోర్వళి ఇగళ్న్దాయ్' అన్నాడు. మహా హింసా మార్గమైన యుద్ధమార్గం నిరసించావని పైపాదానికి అర్థం. వైరభావం (పగైత్తొలిల్ మఱన్దు) మరచిపోయి ప్రపంచం సుఖంగా ఉండాలని కూడా ఆయన అభిలషించాడు.

గాంధీజీని ప్రస్తుతించినా, జాతీయవాది అయినా మొదట్లో సుబ్రహ్మణ్య భారతి తిలక్ మహాశయుని అనుయాయి. ఆయన తీవ్రవాదాన్ని ఆదరించాడు. అంతకు ముందు వివేకానందుని శిష్యురాలయిన సోదరి నివేదితాదేవిని భారతి జ్ఞాన గురువుగా భావించాడు. ఆ తర్వాత శ్రీ అరవిందులు, లాలా లజపతిరాయ్, బిపిన్ చంద్రపాల్, వి.వి. యస్. అయ్యర్ ప్రభృతుల్ని అభిమానించాడు. భారతి అభిమానులూ శిష్యులూ అయిన సుబ్రహ్మణ్య శివా, నీలకంఠ బ్రహ్మచారి మొదలైనవారు విప్లవ వాదంలో విశ్వాసమున్నవారు. కాగా 1905 నుంచి 1912 వరకు సాయుధ సమరంలో విశ్వాసం కలిగి విప్లవ వాదిగా ఉండిన[2] సుబ్రహ్మణ్య భారతి తరువాతి కాలంలోనే గాంధీజీ శిష్యుడై అహింసావాదిగా మారినట్లు తెలియ వస్తున్నది. ఆయన 1919 మార్చిలో మదరాసులో రాజాజీ గృహంలో మహాత్ముని సందర్శించాడు. భారతి వెళ్ళిపోయిన తర్వాత, 'ఎవరీయన?' అని గాంధీజీ అడిగారట. 'మా తమిళ దేశపు కవి' అని రాజాజీ ప్రత్యుత్తర మిచ్చారట. అందుకు గాంధీజీ 'ఈయన్ని జాగ్రత్తగా చూడడం అవసరం' అన్నారట గాంధీజీ.[3] మరి రెండేళ్ళకు, అనగా 1921 లో, భారతి కన్ను మూశాడు. ఈ వివిధ విషయాలు వివరించడానికి కారణం, గాంధీజీ ప్రభావానికి భారతి వంటి విప్లవవాదులు కూడా అహింసావ్రతులుగా మారిన విషయాన్ని వ్యక్తం చేయడానికే. నిజానికి విప్లవవాదం వల్ల స్వాతంత్ర్య సమరం కుంటుపడింది. అయినా ఒక్క విషయం మాత్రం స్పష్టం. భారతి తిలక్ శిష్యుడైనా, గాంధీజీ అనుయాయి అయినా, ఆయన ధ్యేయం మాత్రం స్వాతంత్ర్య సముపార్జనమే. తదాశయ సిద్ధినే లక్ష్యంగా ఉంచుకుని ఆయన మొదటి నుంచీ రచనా వ్యాసంగం చేశాడు. జాతీయకవిగా పేరు పెంపులు గడించాడు. తమిళంలో జాతీయకవి అంటే భారతే అనే కీర్తి గడించాడు.

ఇక్కడ ఒక విషయం తెలపడం అవసరం.

జాతీయ కవులంటే జాతీయోద్యమంలో (కాంగ్రెసు పక్షం) చేరి, స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న కవులే అనే అభిప్రాయం మనలో సర్వసాధారణంగా ఉన్నది. కాంగ్రెసు వారు జాతీయవాదులే; స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నవారే. జాతీయ గీతాలు వారు వెలయించిన మాట వాస్తవమే. గాంధీజీ నిర్మాణ కార్యక్రమంలోని మద్యపాన నిషేధం, హరిజనోద్ధ్యమం మొదలైన

అంశాలను ఉగ్గడిస్తూ వారు కవితలు వెలయించారు. కాని అందరూ జాతీయ కవులుగా పేరు పెంపులు గడించలేకపోయారు. తెలుగులో గరిమెళ్ళ సత్య నారాయణ, తమిళంలో సుబ్రహ్మణ్యభారతి ప్రభృతులు జాతీయకవులుగా చిర కీర్తి గడించారు.

జాతీయకవిగా ప్రసిద్ధుడు కాకపోయినా, గురజాడ అప్పారావు గారిలో జాతీయ భావాలకు కొదవ లేదు. కవిత వ్రాసినా, నాటకం రచించినా ఆయన ధ్యేయం సంఘ శ్రేయస్సు. దేశభక్తి ప్రబోధాత్మకంగా ఆయన వెలయించిన దేశమును ప్రేమించుమన్నా అన్న గేయం అనర్ఘ రత్నం. ఏ మతస్థుడైనా, ఏ ప్రాంతీయుడైనా ఆ గేయరాజాన్ని మణిపూసగా భావిస్తాడు. అలాంటి ఉదాత్త గేయాలు వ్రాసినవారి సంఖ్య అల్పమే అని నిస్సంశయంగా చెప్పవచ్చు. కాని ఆయన దృష్టి సాంఘిక విషయాల మీద కేంద్రీకరించినంతగా దేశ సమగ్రత మీద ప్రసరించ లేదు.

కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు ప్రసిద్ధ దేశభక్తులు. ఉప్పు సత్యాగ్రహం రోజులలో 'వీరగంధము తెచ్చినారము, వీరులెవరో తెల్పుడీ' వంటి దేశభక్తిపూరిత గేయాలు వ్రాశారు. దేశాభిమానం కొద్దీ రాణా ప్రతాప్ అనే నాటకం వెలయించారు. సంఘ సంస్కర్తగా, విమర్శకులుగా చిరకీర్తి సంపాదించారు. తాపీ ధర్మారావుగారు పేర్కొన్నట్లుగా, ఆంధ్ర దేశంలో ఆర్య ద్రావిడ వివాదానికి రూపం ఇచ్చిన వారిలో ఆయన ప్రముఖులయ్యారు.[4] ఈ దృష్టి ఆయన జాతీయ దృక్పథాన్ని మరో వైపుకి మరలించిందని భావించవచ్చు.

ఈ ఆర్య-ద్రావిడ దృష్టి తమిళ విప్లవకవి భారతిదాసన్‌లోనూ పేర్కొనదగిన మార్పు తెచ్చింది. మొదట్లో భారతి శిష్యుడైన భారతి దాసన్ దేశ స్వాతంత్ర్యం అభిలషిస్తూ కవితలు వెలయించినవాడే. సామ్యవాదాన్ని ఉగ్గడిస్తూ ఉలగ ఒట్రుమై (విశ్వమైత్రి), ఉలగం ఉన్నుడైయదు (లోకం నీది), సుదందిరం (స్వాతంత్ర్యం) వంటి కవితలు వెలయించారు. మూఢాచారాలను నిశితంగా విమర్శిస్తూ ప్రగతిశీలాత్మకములైన కవితలూ వెలయించారు. కాని ఆర్య-ద్రావిడ దృష్టి ఏర్పడడంతో, ఆయన దృక్పథం ద్రావిడనాడుకే పరిమితమై పోయింది. మొదట్లో తెలుగు, తమిళం మొదలైన దాక్షిణాత్య భాషలు వ్యవ

హరించేవారందరూ ద్రావిడనాడుకి చెందినవారనే భావం ప్రచారంలో ఉన్నా, అది రానురాను ఒక్క తమిళనాడుకీ తమిళ భాషాసాహిత్యాలకూ పరిమితమై పోయింది. చివరికి వేర్పాటువాదంగా పరిణమించిందన్నా సాహసం కాదు జాతీయ దృష్టి లోపించడంవల్ల, ఈ వాదం బలం పుంజుకుంది. కాని యీ వాదాన్ని తాముా, తమ పక్షమైన డి.యం.కె. (ద్రావిడ మున్నేట్ర కళగం) విసర్జించినట్లు 1962 లో ప్రముఖ నాయకులూ, రచయితా అయిన శ్రీ సి.యన్. అణ్ణాదురైగారు ప్రకటించారు.

తెలుగు కవులలో కొందరు ఆర్య-ద్రావిడ వాదాన్ని సమర్థించినా, ప్రత్యే కాంధ్ర రాష్ట్రం అభిలషించి తదనుగుణంగా కవితలు వెలయించినా, వారు వేర్పాటు వాదాన్ని ప్రోత్సహించకపోవడం పేర్కొనదగిన విషయం. ఆంధ్ర రాష్ట్రం భారతదేశంలోని అంతర్భాగమనే విశ్వసించారు. ఈ అఖిల భారత దృష్టి జాతీయవాదానికి వెన్నెముక వంటిది. ఈ విశాల దృక్పథం కనుక లోపిస్తే, అప్పుడు జాతీయవాదం జీవచ్ఛవంలా కనిపిస్తుంది. అందువల్ల దాని ప్రభావం సంకుచితం కావచ్చు.

జాతీయవాదం దృఢతరమయ్యే కొద్దీ, అంతవరకూ దేశంగానే ఉండిన భారతం మాతృస్థానం వహించి ఆ భావం గట్టిపడింది. భారతమాత అన్నమాట విస్తృత ప్రచారం గడించింది. భారతమాత అంటే ఆమె లక్షలాది సంతానమనీ, భారతమాతకు జై అన్నప్పుడు ఆమె సంతానానికి విజయం కోరడమనీ పండిత నెహ్రూగారు భారతమాతృ శబ్దానికి గల అర్థాన్ని స్పష్టంచేశారు.5 ఈ భావాన్ని గరిమెళ్ళ తన మాతృస్తవంలో మరింత స్పష్టం చేశారు:

'వందన మిదె గైకొనుమీ - భారత జననీ
భారత జననీ మా పాలిటిరాణీ
ముప్పదికోట్ల జనమునకు - మూలమాతవు
మూలమాతవు మా పాలి నేతవు.'

దేశాన్ని దైవంగా జాతీయతను మతంగా సంభావించిన మంగిపూడి వెంకటశర్మగారు తమ మేలుకొలుపు గీతంలో ఇలా పేర్కొన్నారు:

'వేడుకను జాతీయతా యను
వేగుచుక్క పొడిచె నదిగో
కూడి 'వందేమాతరం' బని
కుక్కుటము లరచెన్.'

భారతదేశం, భారతనాడు అనే గీతాలు వెలయించిన సుబ్రహ్మణ్య భారతి భారతమాతా, ఎంగళ్ తాయ్ (మా తల్లి) అనే గీతాలు వెలయించారు.

'మునుపు లంకలోని దనుజుల్ని
తునుమాడిన ఆ విల్లెవరిది? - మా
జనని భయంకరి భారతదేవి ఆర్యరాణి
పూనిన పెనువిల్లది.'

అని ప్రారంభమవుతుంది భారతమాతా అన్న గేయం.

'దివ్య నాటకం శాకుంతలాన్ని
తీర్చిదిద్దిన దెవరి కవిత? - అజుడు
సంతరించే సమస్తం గ్రహించిన
భారతదేవి అనుగ్రహ కవిత అది.'

అని ముగుస్తుంది. భారతీయులు నిర్వర్తించిన విశిష్ట కార్యములన్నీ ఆమె చేతలనే భారతి సంభావించారు.

ముప్పయి కోట్ల ముఖములు కలది
మూల ప్రాణం మాత్రం ఒకటే కలది
మాటలాడే భాషలు పద్దెనిమిది కలది
వాటిలోని భావన ఒకటే కలది
అరువది కోట్ల కరములతోను
ఆచరించేను తల్లి ధర్మములన్నీ
అర్థించి వచ్చేవారి కోరికలు
తీర్చేను ఆ తల్లి—
అని ఎంగళ్ తాయ్ కవితలో వ్యక్తం చేశారు.

దేశమంటే మట్టి మశానమే కాదు, కొండలూ కోనలే కాదు- దేశమంటే ప్రజలనే కొత్త భావం జాతీయతను ద్విగుణీకృతం చేసిందనవచ్చు. దేశమంటే మనుషులోయ్ అని గురజాడవారు స్పష్టంగా పేర్కొన్నారు. కాని అంతకు పూర్వమే మానవుని మహత్తుని, భారత జననియే దైవమనీ గాఢంగా విశ్వసించిన మహనీయుడు వివేకానందస్వామి. సాధారణంగా తాత్త్వికుల ఆలోచనా ధోరణి ఆధ్యాత్మిక విషయాల మీదే కేంద్రీకృతమై ఉంటుంది. ఆధ్యాత్మికవాదియే అయినా వివేకానందుడు ప్రదర్శించిన మానవతావాదం బహు విశిష్టమయింది. ఆయన ప్రవచనాలను పరికిస్తే, యీ అంశం సుస్పష్టమవుతుంది.

'దేశ సేవకుల విధ్యుక్త ధర్మం: మీరు భగవంతుని అన్వేషిస్తూ వేరే ఎక్కడికి వెళ్లాలి? నిరుపేదలు, దయనీయులు, బలహీనులు దైవస్వరూపులు కారా? మొట్టమొదట వారిని ఎందుకు నమస్కరించకూడదు? మీరెందుకు గంగా నదీ తీరానికి బావి తవ్వకానికి వెళ్ళాలి? ప్రేమకు గల సర్వశక్తి సంపన్నతలో విశ్వాసం ఉంచండి ...

'మన భారతదేశ మహాజనని - ఇదే, ఇది మాత్రమే- రాబోయే యాభై యేళ్ళదాకా మన తారకమంత్రంగా ఉండాలి. అంతవరకూ వ్యర్థ దైవాలు మన మనస్సుల నుంచి అదృశ్యం కావాలి. ప్రత్యక్ష దైవం ఇదొక్కటే.... దీన్ని మనం నమస్కరించేటప్పుడు, దైవాలన్నిటినీ నమస్కరించిన వారమవుతాము.'[6]

జాతీయ భావ సిద్ధాంతాలు తెలియజేస్తూ తెలుగులోనూ తమిళంలోనూ కవులు పలువురు కవితలు వెలయించారు. మంగిపూడి వెంకటశర్మ, దువ్వూరి రామిరెడ్డి, గురజాడ రాఘవశర్మ, తుమ్మల సీతారామమూర్తి చౌదరి ప్రభృతులు స్వాతంత్ర్యం, దేశభక్తి, సర్వమానవ సమానత్వం మొదలైన అంశాలు వివరిస్తూ ప్రబోధాత్మక కవితలూ గీతాలూ వెలయించారు. అలాగే తమిళంలోనూ నామక్కల్ రామలింగం పిళ్లై, దేశిక వినాయకం పిళ్లై, వ.ఉ. చిదంబరం పిళ్లై, రాయ చొక్కలింగం, శుద్ధానంద భారతి ప్రభృతులు చక్కని కవితలు వెలయించారు. వీరందరూ జాతీయతను పెంచి పెద్ద చేసిన కవులే. వీరందరిమీద

గాంధీజీ ప్రభావం స్పష్టంగా గోచరిస్తుంది. తిలకు ప్రభావం తమిళ కవుల మీద కనిపించినంతగా తెలుగు కవుల మీద కనిపించదు.

> లాభదాయకమా ఈ పరిశ్రమ యీ రోజుల్లో
> కలాపం ముందు కాకి ఆట లాంటిది
> ఈ స్వదేశీయం....

అని పరిహాసానికి పాల్పడినా, స్వదేశ నౌకలు ధైర్యంగా నడిపి, కప్పలోట్టియ తమిళన్‌గా (ఓడ నడిపిన తమిళుడుగా) ప్రసిద్ధికెక్కిన చిదంబరం పిళ్లై బాల గంగాధర తిలకుని తన గురునాథునిగా స్వీకరించాడు. ఆయన భారతి మిత్రుడు; తమిళనాడులో తీవ్ర జాతీయవాద ఉద్యమంలో నాయకత్రయంగా భావించబడిన వారిలో ఒకడు (మిగిలినవారు భారతి, సుబ్రహ్మణ్య శివాలు). భారతి తిలక్ శిష్యుడుగా ప్రసిద్ధికెక్కినవాడు! శివాకూడా అతివాద వర్గంలోనివాడే; అనగా తిలక్ శిష్యుడే చిదంబరం పిళ్లై, శివాలు ప్రకటించిన స్వాతంత్ర్యానురక్తిని భారతి యిలా వ్యక్తం చేశారు:

> సొంత దేశంలో పరులకు బానిసలమై
> బ్రతకబోము - ఇక భయపడబోము
> ఏ దేశంలోనైనా ఈ అన్యాయాలు
> సాగేనా - దైవం సహించేనా?

తిలక్ నిర్యాణం చెందినప్పుడు దేశంతోపాటు తెలుగు కవులు కూడా కంట తడిపెట్టారు. కాని, తమిళ కవుల మీద తిలక్ ముద్ర కనిపిస్తున్నంత గాఢంగా తెలుగు కవుల మీద కనిపించడం లేదు. తిలక్ లేని భారతావనిని కళ్లకు కట్టేలా ఒక తెలుగు కవి చెప్పిన పద్యం అవశ్య పఠనీయం.[7]

> 'దేవుడు లేని కోవెలయు, దీపము లేని గృహమ్ము, రమ్య రా
> జీవము లేని కోనెరును, శీతమయూఖుడు లేని రేయునై,
> బాషరు మన్నదీ సకల భారతదేశము, నేడు నీవు ని
> ర్జీవుడ వౌట జాతి, బుధశేఖర! శ్రీ తిలకా! జగత్ప్రభూ!'

జాతీయవాదులైన తెలుగు కవులు గాంధీజీని తమ గురువుగా స్వీకరించారు. కనుకనే తెలుగులో గాంధీ సంబంధిత కవితలు, గీతాలు పరశ్శతంగా వెలువడ్డాయి. అయినా మహాత్ముని కథ అనగానే తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు స్ఫురణకు వస్తారు.

పలికెడిది గాంధికథ యట
పలికించెడివారు తెనుగు ప్రజలట, దీనిం
బలికిన నూఱట యౌనట
పలికెద నిక నొండు మఱచి బాపు చరిత్రన్.

ఆయనకి మహాత్ముని మీద గల ఆదరాభిమానములు తెలుసుకోడానికి ఈ ఒక్క పద్యం చాలు.

అలాగే మరింగంటి శేషాచార్యులుగారు తమ శ్రీ గాంధీ భారతములో పేర్కొన్నారు. సంఘ సంస్కర్తలకు సంస్కార కథగా, విప్లవ ప్రియులకు విప్లవాదర్శిగా, హిందూముస్లిముల ఐక్య సింధువుగా గాంధీ భారతాన్ని ఆయన దర్శించారు.

గాంధేయ కవి అనగానే తమిళంలో నామక్కల్ రామలింగం పిళ్ళై గుర్తుకి రావడం పరిపాటి. గాంధీజీ దండి ఉప్పుసత్యాగ్రహోద్యమం ప్రారంభించినప్పుడు, రాజాజీ అధ్వర్యములో తమిళనాడు సత్యాగ్రహులు నామక్కల్ కవి రచించిన కత్తి యిన్ద్రి రత్తి మిన్ద్రి.... (కత్తులు లేని, నెత్తురు లేని) గేయం పాడుకుంటూ వేదారణ్యం (తిరుమరైక్కాడు) వైపు నడక సాగించారు. అప్పుడు రాజాజీ నామక్కల్‌కి లేఖ వ్రాస్తూ యిలా అన్నారు : 'ఈ సమయంలో సుబ్రహ్మణ్య భారతిగారు లేరే అని అనుకున్నాను. ఆ లోటుని మీరు తీర్చారు.' ఆ గేయం నామక్కల్ కవిని లోకానికి పరిచయం చేసింది. స్వాతంత్ర్య వాంఛను ఆయన బహుముఖాల వ్యక్తం చేశారు.

'పరాయివారి పాలనలో మంచి కలిగినా
బానిస బ్రతుకు బ్రతకడం ఎప్పుడూ నరకమే;

నా యింటికి నేనే అధికారిని
అన్నదే స్వరాజ్యభేరీ.'

'భారతదేశం నా ముత్తాతల ఆస్తి
పట్టా కెందుకు వ్యర్థ పంచాయతి?'

'స్వాతంత్ర్యం లేని ఒక దేశం
శార్దూల భూతాలు నిండిన మహావిపినం.'

'సత్యం మనలో తగ్గడంతో—పెక్కు
సంకటాలు వచ్చిపడ్డవి.
పత్యం చెయ్యనప్పుడు—ఏమి
ప్రయోజనం మందులవల్ల?'

ఇలా నామక్కల్ సరళ సుందరమైన భాషలో ఉదాత్త భావాలు ప్రకటించారు.

తెలుగు, తమిళ కవుల కవితలలో ఈ విధంగా జాతీయభావాలు ప్రస్ఫుటములైనా, తెలుగులో గరిమెళ్ళ సత్యనారాయణ, తమిళంలో సుబ్రహ్మణ్య భారతి జాతీయకవులుగా ప్రథితయశస్కులైనారనడం చర్విత చర్వణం.

సమకాలికులు వారిద్దరినీ జాతీయ కవులుగా గుర్తించారు. 'కల్కి' రా. కృష్ణమూర్తి వంటి ప్రసిద్ధ తమిళ రచయిత భారతి ప్రపంచకవి కాదనీ, ఆయన కవితలలో నిరసించదగిన అంశాలున్నాయనీ విమర్శిస్తూ ఆనందవికటన్ పత్రికలో వ్యాసం వ్రాశారు. అప్పుడు విప్లవకవి భారతిదాసన్ 'మహాకవి' అనే ఒక కవిత ప్రత్యుత్తరంగా వ్రాశారు. అందులో ఆయన భారతిని ప్రపంచకవిగా, మహాకవిగా, జాతీయతను చిత్రించిన కవిగా పేర్కొన్నారు. అనగా అప్పటికే సుబ్రహ్మణ్య భారతి జాతీయ కవిగా తమిళనాడులో ప్రసిద్ధులయ్యారు.

అలాగే గరిమెళ్ళను ఆనాటి తెలుగు ప్రముఖులు జాతీయ కవిగా గుర్తించి బహువిధాల ప్రశంసించారు. గాంధేయ వాదిగా నిర్మాణ కార్యక్రమానికి అంకిత

మైన ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు తల్లాప్రగడ ప్రకాశ రాయడుగారు (1893 - 1988)[8] తమ రచనలో పేర్కొన్న యీ కింది అంశాలు పరిశీల నార్హములు:

"ఒకసారి విద్యార్థులతో తీర్థానికి వెళ్ళి తిరిగి వస్తున్నాం. ప్రతిధ్వనిం చేటట్లు జాతీయ గీతాలను పాడుకొంటూ వస్తున్నాం. రాజమండ్రి పోలీసు డిప్యూటి సూపరింటెండెంటు తన సిబ్బందితో ధవళేశ్వరం వెడుతూ మాకు ఎదురౌస్తున్నాడు. మహమ్మదీయుడు. ప్రజలలో అతడి మారు పేరు 'అగ్గిదొర'.... అతనిని తప్పించుకొని మా దారిని మేము పాటలు పాడుతూ వస్తూనే ఉన్నాం. శ్రీ గరిమెళ్ల సత్యనారాయగారి మాకొద్దీ తెల్లదొర తనము పాట తెలుగుదేశం మారుమూలలకంటా మోగిపోతూనే ఉంది. జాతీయగీతాల మహాకవి ఆయన. గాంధీ ఉద్యమంతోనే, అందుకోసమే ఆయనకు కవిత్వం అబ్బింది... ఆరోజుల్లో ఆయన జాతీయగీతాలు తెలుగుదేశాన్ని ఊపివేశాయంటే నమ్మండి. ఆరోజున మాతో ఆయన కూడా ఉన్నారు. మాకెదురు వస్తున్న అగ్గిదొరను చూచి, అప్పటికప్పుడు ఆశువుగా ఆ పాటకు ఆయన మరో చరణం చేర్చారు. అవ సరాన్ని బట్టి అట్లా క్రొత్త చరణాలు చేర్చడం ఆయనకు పరిపాటి. ఒక్కొక్క కొత్త చరణంతో ఆ పాట క్రొత్త ప్రాణం పోసుకొనేది. 'సిగ్గూ లజ్జా లెల్ల బుగ్గిలో కలిపేసి, అగ్గిదొరలై పోవుతారు - మాకొద్దీ తెల్లదొరతనము' అన్నది ఆనాటి సమయస్ఫూర్తి...."

ప్రసిద్ధ స్వాతంత్ర్య సమరవీరులు గురుజాడ రాఘవశర్మగారు ఆయన్ని జాతీయ గేయ కవిసార్వభౌముడని కీర్తించారు. గరిమెళ్ల జాతీయ కవిసార్వ భౌముడని విశ్వనాథ సత్యనారాయణగారు కీర్తించారు. అలాగే, ఆనాళ్ళలోనే కాదు- ఈ రోజుల్లో కూడా తమిళనాడంతట భారతి జాతీయ గీతాలు ప్రతిధ్వని స్తున్నవని చెప్పడం సత్య సన్నిహితం. ఈ యిద్దరినీ ప్రజలు జాతీయకవులుగా గుర్తించారు. ప్రజల తీర్పు తిరుగులేనిది! నేటికీ భారతి గీతాలు ప్రచుర ప్రచారంలో ఉండడం పేర్కొనదగిన అంశం. ఈ విషయంలో గరిమెళ్ళ అదృష్టహీనుడు. అయినా ఆయన గీతాలు పూర్వపు ప్రచారం అందుకోగలవని ఆశించవచ్చు.

వారిద్దరూ సర్వమానవ సమానత్వాన్ని విశ్వసించినవారే. మదరాసు సముద్ర తీరాన (బీచ్‌లో) జరిగిన ఒక బహిరంగ సభలో భారతి ఆశువుగా చెప్పిన గీతం ఆయన చివరి గీతం కావడం మన దురదృష్టం. ఆశువుగా చెప్పినా, తిన్నగా కూర్చుని చెప్పినా ఆయన మనోవీథిలో - సర్వకాల సర్వావస్థలలోనూ - 'భారతజాతి వర్థిల్లాలి!' అనే ఉదాత్త భావం మెదులుతూ ఉండేది. కనుకనే ఆ గీతం పల్లవి 'భారతజాతి వర్థిల్లాలి వర్థిల్లాలి, భారతజాతి వర్థిల్లాలి! జయ జయ' అయింది. అందులో ఆయన అన్నాడు గదా:

'ముప్పయి కోట్ల జన సమూహం
సమ్మగత కిది ప్రతిరూపం
సాటి యెరగని జన సమూహం
జగతికే ఒక అపురూపం.'

ఆ తుది గీతం ఇలా ముగిసింది:

'అందరిదీ ఒకే కులం ఒకే జాతి
అందరూ భారత దేశీయులు
అందరూ సమధర్ములు సమానులు
అందరూ ఈ దేశపు స్వమాట్టులు
మన మందరం ఈ దేశపు రాజులం
మన మందరం ఈ దేశపు రాజులం.'

చట్టరీత్యా మన మందరం సమానులమే కాక ఈ దేశపు రాజులమూ అయినాము. కవి వాక్యం అమోఘం!

1921 లో ముద్రితమైన గరిమెళ్ళ 'స్వరాజ్య గీతములు' అనే పుస్తకంలో పంచము లనే గీతం ఒకటి చోటు చేసుకుంది. మన చిన్న తమ్ముళ్ళి వేరుచేసి మనం పాపానికి పాల్పడ్డామన్న బాధను వ్యక్తీకరిస్తూ ఆయన అన్నాడుగదా:

'మానవు లెల్లరు సోదరు లనుచును - మనల నెవ్వరన
రిలను ఆ కూనల నిట్టుల చెడగొట్టుటచే....

ఏమి నోరులను బెట్టి వారికడ
ఏడ్వగలము ధర్మముకు
భూమిని సర్వ సమత్వంబు సల
జో జేస్తిమి ముందుగను—
సర్వ సమానత బాదుకొల్పి యీ
జనముతో గలి
యండి ఆ సర్వేశుడు స్వేచ్ఛా వర్షంబును
సరగ జల్లు మనపైని—'

ఎల్లరూ ఒక్కటనే మాన్యసూత్రం గ్రహించాలనీ, మతాలన్నీ ఒక్కటనీ, ఏ మతాన్ని చెరిపినా అది దైవద్రోహ మవుతుందనీ ఆయన ఉద్బోధించాడు.

అలాగే ఆ కవులిద్దరూ అఖండ భారతాన్ని తమ మాతృదేశంగా భావించారు. అందువల్ల తమ దేశాన్ని తామే పాలించాలని గాఢంగా ఆశించ డంలో ఆశ్చర్యం లేదు. ఈ భావంతోపాటు భారతదేశంలో నివసించే వారందరూ అన్నదమ్ములే అన్న భావం ఏర్పడింది. జ్ఞాతి కలహం సహజం. అందువల్ల వారు సోదరులు కాకపోరు. 'ఒక తల్లి పిల్లలు కలహించుకున్నా అన్నదమ్ములే వారెన్నటికీ' అని నిర్ద్వంద్వంగా పేర్కొన్నాడు భారతి. ఎన్నటికీ వారు సోదరు లనడం గమనించదగింది.

'ఎవరెన్ని చెప్పిన హిందూదేశవాసు లేక సోదరులె సుమండీ' అనీ, 'అన్నదమ్ముల్లోన బేధ మాడు పెట్టాడండి బాబు' - 'మాలో మాకే చిచ్చు పెడతా డండి బాబు' - ఇలా గరిమెళ్ళ పెక్కు గీతాలలో భారతీయులు సోదరులనే భావాన్ని విదితం చేశాడు. అఖండ భారతాన్ని తన దేశంగా భావించిన గరిమెళ్ల, దేశం రెండు ముక్కలైనప్పుడు ఎంత బాధపడి వుంటాడో మనం ఊహించవచ్చు. ఆ బాధను ఆనందవాణి పత్రికలో (8-6 1947) ప్రచురితమైన ఆయన గేయం 'చీలికలు' వ్యక్తం చేస్తున్నది. 'అఖండ హిందూస్థానం స్వప్నం ఆఖరు కిట్లడు గంటింది' - అని మొదలవుతుంది ఆ గేయం.

స్వదేశాభిమానం స్వపరిపాలనానురక్తి మూర్తీభవించిన ఆ కవులు పర ప్రభుత్వాన్ని ఎలా సహించగలరు? వరాళి రాగంలో రచించబడిన స్వాతంత్ర్య గీతంలో భారతి తన అభిప్రాయాన్ని యిలా తెలియజేశాడు:

'మన ముందే దేశం మనదని తెలుసుకున్నాం - ఇది
మనకే సొంతమనీ తెలుసుకున్నాం - ఈ
పుడమిలో ఎవరికి దాస్యం చెయ్యబోము - ఆ
పరిపూర్ణునికే దాస్యం చేసి బతికేము.'

గరిమెళ్ళ అయితే మాకొద్దీ తెల్ల దొరతనం అనే దీర్ఘ గేయం వ్రాశాడు. అస్వతంత్ర భారత దేశపు అధ్వాన్నస్థితిని తెలిపే యీ ప్రబోధ గేయం 'మాగ్నా కార్టా' వంటిదని చెప్పవచ్చు. తట్టుముట్టాడే పేదరికం అనుభవించినా, కొందరు బలవంతం చేసినా ఆయన మాత్రం మాకొద్దీ నల్లదొరతనము అనే గేయం వ్రాయ లేదు.[9] అదీ ఆయన స్వపరిపాలనానురక్తి!

దేశభక్తి, స్వాతంత్ర్యానురక్తి, అఖిల భారత దృష్టి, జాతీయ దృక్పథం మొదలైన విశిష్ట గుణాలు కలిగి జాతిని ఉత్తేజపరిచే కవితలు వెలయించినవారు జాతీయ కవులవుతారు. అలాంటి కవులు భారతి, గరిమెళ్ళ సత్యనారాయణలు.

ఈ సందర్భంగా 1992, జూలై 25న నవమ రాష్ట్రపతిగా పదవీ ప్రమాణం చేసినప్పుడు డాక్టర్ శంకర్ దయాళ్‌శర్మగారు తమ ప్రసంగంలో ఉదాహరించిన విషయాలు పరిశీలనార్హములు. మతసంబంధ రహితమైన దృక్పథాన్ని ప్రాచీన భారతీయులు ప్రదర్శించారని అధర్వవేదంలోని పృథివీ సూక్తం వ్యక్తం చేస్తున్నది; శాంతియుతమైన గృహం వలె, పృథివి విభిన్న మనస్తత్వాలు కలిగిన వివిధ వ్యక్తుల్ని భరిస్తున్నది; ఆ లక్షణం మనకందరికీ ప్రయోజనకారి అవునుగాక - అనే ఉదారాశయం ఆ సూక్తంలో తెలియజేయబడింది.[10]

అలాగే, మైత్రీ భావంతో ఇతరుల్ని పరికిద్దామనే ఉదాత్త భావాన్ని యజుర్వేదం వ్యక్తం చేస్తున్నది.[11]

బౌద్ధ ధర్మాలకు విస్తృత ప్రచారం కలిగించిన అశోక చక్రవర్తి వేయించిన పన్నెండవ శాసనంలో ఇలా ఉన్నది: "స్వమతాభిమానంతో అన్యమతాలకంటె తన మతమే గొప్పదని భావిస్తూ తన మతాన్నే గౌరవిస్తూ అన్య మతాలను అగౌరవ పరుస్తూ సంచరించే వ్యక్తి తన మతానికే నిస్సందేహంగా హాని కలిగించిన వాడవుతున్నాడు.'

ఖురాను కూడా లౌకిక తత్వాన్ని ప్రబోధిస్తున్నది. మందిరమైనా మసీదైనా, పూజ అయినా నమాజ్ అయినా, పురాణమైనా ఖురానే అయినా అభేదాలనీ, మానవులందరూ సోదరులనీ సిక్కుల కట్టకడపటి (పదవ) గురువైన గురుగోవింద సింగు అభిప్రాయం.

ఈ సూక్తి రత్నాలను అలవోకగా పరిశీలించినా, భారతీయులు మత సంబంధం లేని విశాల దృక్పథాన్ని అలవరచుకున్నవారనీ, సహనశీలురనీ సువిదిత మవుతుంది. లేకపోతే భారతదేశం బహుభాషలకూ సంస్కృతులకూ మతాలకూ నిలయమై ఉండేదికాదు. మత మార్పిడులూ మత కలహాలు మొదలైనవి మన దీర్ఘ చరిత్రలో, పానకంలో పుడకలులా కనిపించే మాటను కాదనలేము. గత చరిత్రలోని మచ్చలను సులభంగా తుడిచివేయలేము. అయినా భారతీయులు మూర్తీభవించిన సహనశీలురు కావడంవల్ల చెడుకి చీ కొడుతూ మంచికి జేజేలు పలుకుతూ ముందుకి వెడుతున్నారు. ఇది అభ్యుదయ లక్షణం.

మనిషికి స్వేచ్ఛ ఎంత అవసరమో. దేశానికి స్వాతంత్ర్యం అంత అవసరం. సంఘంలో జాతీయ భావం సుస్థిరంగా నెలకొన్నప్పుడే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలూ సుస్థిరంగా నెలకొంటాయి. కాగా జాతీయవాదం వెన్నముక వంటిదని పేర్కొన్నా అతియోక్తి కాదు. జాతీయ వాదం ఆధునిక భావమే అయినా, అది మన దేశంలో వేదకాలం నుంచి నేటిదాక ఏదో ఒక రూపంలో ఏదో ఒక పేరుతో ఉన్నదని భావించవచ్చు. ఇరవయ్యో శతాబ్ది తెలుగు తమిళ కవులు చాలావరకు సంప్రదాయ విధేయు లయినా, వారు ప్రదర్శించిన జాతీయ భావ సిద్ధాంతాలు విస్మరించరానివి. మునుపటి మాట ఎలా ఉన్నా, నేటి కవికి జాతీయ భావం తప్పనిసరిగా ఉండాలి. బహు భాషలకూ సంస్కృతులకూ కొటారమైన మన దేశంలో జాతీయ భావాలు గల కవులే జాతికి దారి దివ్వెలు కాగలుగుతారు.

## జ్ఞాపికలు

1. వి. టి. పాటిల్‌గారి సంకలనం Studies on Nehru లోని (Sterling publishers (p) Ltd. 1987) నందలాల్‌గారి వ్యాసం Nehru's contribution to the Theory of International Relations. పుటలు 29, 30.
2. ఇంకా వివరాలకు శ్రీ రఘునాథన్ రచించిన 'భారతి కాలముం కరుత్తుం' (న్యూ సెంచరీ బుక్ హౌస్ (పి) లిమిటెడ్, మదరాసు, 1986) అనే గ్రంథం చూడవచ్చు.
3. వివరాలకు నా సుబ్రహ్మణ్య భారతి (1965), పుటలు 29-31 చూడవచ్చు.
4. తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించిన విజ్ఞాన సర్వస్వము, రెండవ సంపుటం, పుట 536.
5. ది డిస్కవరీ ఆఫ్ ఇండియా, 1964, పుట 62.
6. శ్రీ రఘునాథన్ గారి భారతి కాలముం కరుత్తుం, పుటలు 121-29. ఇంకా వివరాలకు Complete works of Vivekananda, 3,4,5,6 సంపుటాలు చూడవచ్చు.
7. శ్రీ గురజాడ రాఘవశర్మగారి జాతీయగీతాలు, పుట 22.
8. ప్రకాశరాయడు గారికి సంబంధించిన వివరాలకు విజ్ఞాన సర్వస్వము, రెండవ సంపుటము (1988), అనుబంధం, పుట 4 చూడవచ్చు. ఆయన వ్రాసిన నా రాట్నచక్రం అనే గ్రంథం పరిశీలించదగిన రచన. (అవనిగడ్డ, గాంధేయ సమాజ సేవాసంస్థ వారి ప్రచురణ).
9. ఈ ఉదంతం గురించి తెలుసుకోదలచిన వారు నా గరిమెళ్ళ సాహిత్యం (పుట 15) చూడవచ్చు.

# కొన్ని ఉపయుక్త గ్రంథాలు


**తెలుగు :**

ఇతిహాసలహరి (ఉపన్యాస వ్యాసమంజరి); సికింద రాబాదు, యువభారతి, 1982.

నాగభూషణశర్మ, మొదలి; తెలుగు సాహిత్యం: గాంధీజీ ప్రభావం; హైదరాబాదు, గాంధీ సాహిత్య ప్రచురణాలయం, 1970.

రజత రంజని; ఏజి ఆఫీసు తెలుగు సాహితీ సమితివారి పత్రిక; హైదరాబాదు, 1988.

రాఘవశర్మ, గురజాడ; జాతీయగీతాలు; హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1973.

రాధాకృష్ణశర్మ, చల్లా; గరిమెళ్ళ సాహిత్యం; మధుర, లక్ష్మీనారాయణ గ్రంథమాల, 1989.

— (అనువాదం) భారతి కవిత; సికిందరాబాదు, యువభారతి, 1982.

— (అనువాదం) భారతి వచన రచనలు; న్యూఢిల్లీ, నేషనల్ బుక్ ట్రస్టు, ఇండియా; 1978.

వేంకట రంగయ్య, మామిడిపూడి; (అధ్యక్షులు- సంపాదకీయ వర్గం) సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, 4వ సంపుటం, హైదరాబాదు, సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశ సమితి, 1964.

సుబ్బారెడ్డి, మద్దూరి; తెలుగులో జాతీయోద్యమ కవిత్వం; తిరుపతి, రాగసుధా ప్రచురణలు, 1982.

**తమిళం :**

ఇళవరసు, ఇరా., ఇందియ విడుదలై ఇయక్కత్తిల్ బారతిదాసన్., తిరుచి రాపల్లి, మరుదం, 1990.

దిరవియం, కా., దేసియం వళర్త తమిళ్., మదరాసు, పూంపుగార్ ప్రచురం ప్రెస్, 1974.

యోగేశ్వరన్, పి., తమిళ్ కవితైగళిల్ సముదాయ చిక్కల్ గళ్., మదరాసు, నీల పదిప్పగం, 1985.

రఘునాథన్, టి యం సి., భారతి కాలముం కరుత్తుం., మధుర, మీనాక్షి పుత్తగ నిలయం, 1982.

రామలింగం, యం , ఇరుపదాం నూట్రాండు తమిళ్ ఇలక్కియం (2వ ముద్రణ), మదరాసు, 1977.

వరదరాజన్, ము., తమిళ్ ఇలక్కియ వరలాఱు., న్యూఢిల్లీ, సాహిత్య, అకాడమీ, 1972.

విమలానందం, మ. స., తమిళ్ ఇలక్కియ వరలాట్రు కళంజియం., మదరాసు, ఐందిణై పదిప్పగం, 1987.

శివజ్ఞానం, మ. పొ., విడుదలై పోర్రిల్ తమిళ్ వళర్న్ద వరలాఱు., మదరాసు, ఇన్బ నిలైయం, 1970.

శ్రీనివాస రాఘవన్, అ., ఒరు నూట్రాండు తమిళ్ కవిత్తై., కోయముత్తూరు, మెర్క్యురీ పుత్తగ కంపెనీ, 1970.

# ENGLISH :

Encylopaedia Americana, Vol. 19.

Kripalani, Krishna; Rabindranth Tagore: A Biography; Oxford University Press, 1962.

Mackenzie Brown, D., The Nationalist Movement; Bombay, Jaico Publishing House, 1961.

Mclane, John R., Indian Nationalism and the Early Congress. Princeton University press, 1977.

Nehru, Jawaharlal., The Discovery of India, 1964.

Patil, VT., Studies on Nehru,, Sterling Publishers, 1987.

Sen, NB. (Ed.)., Glorious Thoughts of Nehru., New Delhi, New book Society of India, 1972.

Sri Aurobindo, Essays; Sri Aurobindo Birh Centenary Library, Pandicherry, Vols 1 and 15

Tagore, Rabindranath., Nationalism., London, Macmillan & Co., Ltd., 1950.

The New Encyclopaedia Britannica, Vol. 8 (15 th edn), 1987.

The Oxford English Dictionary (2 nd edn), Vol X, 1989.

